## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటీ కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీగురుభ్యో నమః
హరిః ఓం
శ్రీరస్తు

# సర్వోపనిషత్సారసంగ్రహము


రచయిత
శ్రీనరసింహయోగి
జ్ఞానమందిరం
Opposite to the Officers Quarters No. 1.
తిరుమల - 517 504.


వెల : 75/-

# తొలిపలుకులు

ఈ "ఉపనిషత్సారసంగ్రహ" ముద్రణము నాకు సాధ్యము కా దని విరమించుకొనదలచినాను. కాని ఈశ్వరాజ్ఞవలన చిత్తూరుమిత్రులు అడ్వొకేట్ శ్రీ ఆర్ యస్.వి. నరసింహరాజుగారు తాను కొంతమంది తెలిసినవారికి విరాళములకై అప్పీలు పంపి దీనిముద్రణము నెరవేర్చిరి. తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఆధ్యాత్మికగ్రంథరచయితలకు యిచ్చు ఆర్థికసహాయముతో బాటు యీవిరాళములతోడ్పాటుతో ఈగ్రంథ ముద్రణము పూర్తిఅయినది. వీ రందరికి నాకృతజ్ఞతాభినందనములు.

"పలికించెడివాడు రామభద్రుం డట" అన్నట్లు జగద్గురు శ్రీ ఆదిశంకరులవారి అనుగ్రహముతో, వారి ఆదేశ–ఉపదేశముల ననుస రించి ఇది రచింపబడినది. శ్రీ ఆదిశంకరులవారి ఉపదేశానుసారము మద్గురువర్యులైన శ్రీ విమలానందభారతీస్వామివారు నాకు బోధించిన తత్త్వము సంగ్రహముగా యిందు వ్రాసితిని.

పూజ్యపాదులగు మద్గురువర్యులు శ్రీ పోలూరి హనుమజ్జానకీ రామశర్మగారు నామీది శిష్యవాత్సల్యముతో దీని ముద్రణము విషయమై ఎంతో శ్రమ కోర్చి చివరవరకు ప్రూఫ్ కరెక్షన్ చేయుచు, యిందు భాషాసవరణయే గాక శ్రీవారు నామీది దయతో తత్త్వవిషయసవర ణలు గూడ చేసి గ్రంథమును ఈస్వరూపమునకు తెచ్చిరి. వారికి నా నమస్కృతము లర్పించుచున్నాను.

ఈ గ్రంథమును చక్కగా ముద్రించిన శ్రీ కనులాంబికా ప్రింటింగు ప్రెస్సు అధికారులకు నాకృతజ్ఞతాభివందనములు. మరియు ప్రీతిపూర్వకముగా దీనికి విరాళము లిచ్చిన దాతలకు నాకృతజ్ఞతాభి నందనములు.

ఈ గ్రంథము ఆధ్యాత్మిక తత్త్వజ్ఞానార్థదర్శనులకు సంతస మును, శ్రద్ధావంతులైన ముముక్షువులకు పరంనిశ్శ్రేయసమగు, సహే తుకస్య సంసారస్య అత్యంతోపరమలక్షణమైన ముక్తిని ప్రసాదించుట కిది ఉపయోగపడునుగాక.

ఇట్లు

స్వామి నరసింహయోగి

# పరిచయము

ఈ గ్రంథమును రచించిన శ్రీనరసింహయోగిగారు మద్గురువర్యులు శ్రీశ్రీశ్రీ విమలానందభారతీస్వామివారికి శిష్యులు. శ్రీ స్వామివారు కుర్తాళమున శ్రీసిద్ధేశ్వరపీఠమునకు ప్రథమపీఠాధిపతులయ్యును పరమవిరక్తులు, తత్త్వజ్ఞులు, దేశికశేఖరులు. శ్రీనరసింహ రాజుగారు, బాల్యమునుండి విరక్తులై నైష్ఠికబ్రహ్మచారులుగా నుండి దేశికుల నన్వేషించుచు గాంధిగారియాశ్రమమునుండి శ్రీఅరవిందాశ్రమమువఱకు పర్యటించి, ఎచ్చటను సంతృప్తి నొందక తుదకు శ్రీ విమలానందభారతీస్వామివారిని చేరి తత్త్వోపదేశమును పొంది సంతుష్టులైరి. అప్పటినుండి వారిని చిరకాలము సేవించుచు పెక్కు ధర్మతత్త్వార్థములను అవగాహనము చేసికొనిరి. కొంతకాలము నెల్లూరులో కూడ నాయొద్ద ఉపనిషద్భాష్యశ్రవణము గావించిరి.

శుశ్రూషాఫలముగా తాము సంపాదించిన విషయములను శ్రీ రాజుగారు ముముక్షువుల యుపయోగముకొఱకు సర్వోపనిషత్సారసంగ్రహ మను గ్రంథమునుగా రూపొందించిరి. శ్రేయోభిలాషులు పరిగ్రహింతురు గాక.

బుధజనవిధేయుడు

పోలూరి హనుమజ్జానకీరామశర్మ

# విరాళములిచ్చిన దాతలపేర్లు

| | |
|---|---|
| శ్రీ నందిమండలం చెంద్రాజుగారు | 1116 |
| రిటైర్డు చీఫ్ ఇంజనీరు, శివజ్యోతినగరు తిరుపతి. | |
| శ్రీ పి. వేణుగోపాల్ | 1116 |
| అసిస్టెంటు ఇంజనీరు, తిరుపతి. | |
| శ్రీ డి. వి. రామచంద్రరాజు యం టెక్, | 250 |
| ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, పొదిలి. | |
| శ్రీ పి. లక్ష్మణరాజు | 250 |
| ఆంధ్రబ్యాంకు ఆఫీసరు, తిరుపతి. | |
| శ్రీ డి. గోపాల్‌రాజు యం. ఎల్. ఎ. ఊరికాపురం. | 500 |
| శ్రీ యం. మెరికలాజు విజయపురం, మిట్టూరు. | 500 |
| శ్రీ యం. నాగరాజారావు, తిరుపతి. | 200 |
| శ్రీ సేతు మాధవరావు, తిరుపతి. | 100 |
| శ్రీ టి. కృష్ణారెడ్డి, అన్నదానసమాజము తిరుపతి. | 200 |
| శ్రీ పి. కృష్ణమరాజు, చిరతానూరురోడ్ | 100 |
| శ్రీ యస్. వెంకటరాజు | 116 |
| రిటైర్డు టీచరు, విజయపురం, మిట్టూరు. | |
| శ్రీ బి మునిరెడ్డి | 100 |
| రిటైర్డు టీచరు, విజయపురం, మిట్టూరు. | |
| శ్రీ డి. జయరామరాజు విజయపురం, మిట్టూరు. | 100 |
| శ్రీమతి వై. వెంకటలక్ష్మమ్మ, విజయపురం, | 50 |
| శ్రీ ఆర్. యస్. వి. నరసింహరాజు | 550 |
| అడ్వొకేటు చిత్తూరు. | |
| గం॥భా॥ రామలక్ష్మమ్మ, రైల్వేకోడూరు. | 1100 |
| శ్రీ సి. త్రివిక్రమరావు అడ్వొకేటు హైదరాబాదు. | 2000 |

| | |
|---|---|
| శ్రీ జనచైతన్య హౌసింగ్ ప్రై. లిమిటెడ్. | 2000 |
| చిరంజీవి దిలీప్‌కుమార్ ప్రోత్సాహము, హైదరాబాదు. | |
| శ్రీ డా॥ పి. వి. అరుణాచలం, బాలాజీకాలనీ, తిరుపతి. | 600 |
| శ్రీ యం. మోహన్‌రాజు, అడ్వొకేటు | 600 |
| ఎల్. ఐ. సి కాలనీ, తిరుపతి. | |
| శ్రీ కె. సుబ్బరామరాజు, అడ్వొకేటు పుత్తూరు. | 500 |
| శ్రీ డి. నారాయణరావు శివానందనగర్, హైదరాబాదు. | 250 |
| శ్రీ ముద్దులూరు నాగరాజు కార్వేటినగరంరోడ్, పుత్తూరు. | 116 |
| శ్రీ డి. నాగరాజు, స్టేట్‌బ్యాంక్ వరదయ్యపాలెం. | 100 |
| శ్రీ కె లక్ష్మణరాజు అబ్బికండ్రిక. | 500 |
| శ్రీ పి. ధనంజయరెడ్డి, రిటైర్డు హెడ్‌మాస్టరు పన్నూరు. | 101 |
| శ్రీమతి ఉమాదేవి, అమెథర్త వైకుంఠపురం | 500 |
| శ్రీ డి. రామకృష్ణరాజు | 100 |
| వి. వి. సినిమా మహల్ ప్రక్కన తిరుపతి. | |
| శ్రీ దిలీప్‌కుమార్ వైకుంఠపురం | 500 |
| శ్రీ డి. విష్ణురాజు క్షూరికాపురము | 500 |
| శ్రీ దిలీప్‌కుమార్ వైకుంఠపురము | 4000 |

సమాప్తము

# విషయసూచిక


1) సంసారము — 2
2) సాక్షిభావము — 33
3) మరణభీతి — 45
4) జ్ఞానలక్షణము — 52
5) వేదప్రామాణ్యము — 75
6) ఉపదేశము — 82
7) వైరాగ్యము — 85
8) బ్రహ్మవిచారణ — 91
9) త్యాగము — 95
10) సద్గురువు — 101
11) అద్వైతసిద్ధాంతము — 109
12) శ్రవణము — 128
13) మోక్షము — 138


## అనుబంధము


1) శ్రీగౌడపాదకారికలు — 145
2) ముండకోపనిషత్తు — 147
3) జీవన్ముక్తుడు — 149
4) సాధనమార్గము — 151
5) ప్రత్యగాత్మ — 152
6) కఠోపనిషత్తు — 154
7) సన్న్యాసావశ్యకత — 164

# ప్రార్థనము

## శ్రీగురుభ్యో నమః

హరిః ఓం

శ్లో॥ గురు ర్బ్రహ్మ గురు ర్విష్ణుః।
గురు ర్దేవో మహేశ్వరః।
గురు స్సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవే నమః॥

ఆ నామరూపములను మినాహాయించి సద్వస్తువును గుర్తించుటకు శక్తి వచ్చినది. అలాగే మన నామరూపములను గూడ వదలి ప్రత్యగాత్మను గుర్తించగలము.

ఇందువలన సర్వోపాధులను మిథ్యాదృష్టితో త్యజించి కేవల సద్వస్తువును గ్రహించుటకు దారి ఏర్పడినది.

"స ఏష ఆదేశో నేతి నే త్యాత్మాఽహమ్"

శ్లో॥ "యస్మిన్ విశ్వ మిదం ప్రతీత
మసకృద్భూత్వా పున ర్లీయతే
యే నేదం రశనాహివ ద్భ్రమయతే
యస్మా న్న కించిత్ పరమ్।
తస్మిన్ శ్రీ మదభీష్ట శంకరగురు
బ్రహ్మ ణ్య నంతేఽద్య మే
భూయిష్ఠం నిరుపాధికేఽధిరమతే
మాయాముషీ శేముషీ॥"

ఎవనియం దీ విశ్వము పునః పునః ఆవిర్భావతిరోభావముల నొందుచున్నదో, ఎవనికంటె నితర మేమియును లేదో, అట్టి అనంతమై నిరుపాధికమైనట్టి అభీష్టమైన పరమాత్మయగు శ్రీమచ్ఛం

కరగురుచరణులయం దిపుడు మాయాతీతమైన నామతి అత్యంత మానందసరసి నోలలాడుచున్నది.

శ్లో॥ "వక్తార మాసాద్య య మేవ నిత్యా
సరస్వతీ స్వార్థసమన్వి తాసీత్।
నిరస్తదుస్తర్కకళంకపంకా
నమామి తం శంకర మర్చితాంఘ్రిమ్"॥

ఏ వక్తనైతే ఆశ్రయించి నిత్యమైన సరస్వతి దుస్తర్కకళంక పంకరహితయై స్వార్థసమన్విత మైనదో, అట్టి పూజ్యపాదులగు జగద్గురు శ్రీశంకరాచార్య గురువర్యులకు నమస్కారములు.

శ్లో॥ నారాయణసమారంభాం
శంకరాచార్యమధ్యమామ్।
అస్మ దాచార్యపర్యంతాం
వందే గురు పరంపరామ్॥

## 1. సంసారము

ప్రమాణము ద్వారా నిర్ధారణ అయిన విషయము, కథానికలలో అందుకు విరుద్ధంగా కనబడినను, ప్రమాణముగా తీసికొనగూడదు.

"ప్రామాణ్యచింతాయాం పురుషప్రవృత్తేః అదృష్టాన్తత్వాత్"

(ఛాందోగ్య శంకరభాష్యమ్)

మన ఉద్దేశ్యము వేరుగాను, నడవడిక వేరుగాను వుంటే, ఎప్పటికీ ఆ ఉద్దేశ్యము నెరవేరదు. నడవడిక వేరు అంటే ఆహారము లోను, సహవాసములోను గ్రంథపఠనములోను ఉద్దేశ్యమునకు విపరీత ముగా ఉండే నడవడిక. పైమూడు మన ఉద్దేశ్యమునకు అనుగుణంగా ఉండవలెను.

జైమిన్యాచార్యులవారు సత్యకామ సత్యసంకల్పాదులు, సర్వ జ్ఞత్వ సర్వశక్తిమత్త్వములు ఇవే భగవంతుని స్వరూపమంటారు. ఇదే మనకు బాగున్నదని తోచుచున్నది.

"ఈ నేననేవానికి జీవభావం పోయి పైవిధంగా బ్రహ్మభావము వచ్చును. ఇదే మోక్ష మంటారు." ఇది జైమినిమహర్షి అభిప్రాయము.

"జక్షః క్రీడః రమయాణ స్సః" – ఇట్లు విహరించడమే మోక్షము. అనగా షడ్రసోపేతమై దివ్యమైన మృష్టాన్న భోజనమును ఆరగించుట, ప్రియులతో కూడి బహువినోదలీలలతో తేలియాడుట, ప్రేమాస్పదులతో కలిసి వివిధవిచిత్రరతుల ననుభవించుట – ఇట్లు విహరించడమే మోక్ష మని కొంద అందురు.

ఇదే భాగుంటుంది మన కందరకు. ఇదే కావాలి అని ఉంటుంది. ఇదే పశుపక్ష్యాదుల పరిస్థితి.

జవాబు:– ఇది ఎక్కడ ఉంది చూపెట్టు? అని అడగాలి. ఎందు లోను మన అభిప్రాయం సుతరాం కూడదు

శాస్త్రంలో "జక్షన్ క్రీడన్" అని ఉంది గదా అంటే:-

"మమ ఆత్మా భద్రసేనః" అని ప్రభువు అంటాడు.

భద్రసేనుడు సేవకుడు, ప్రభువు అట్లా ఎందు కన్నాడో గమనించాలి. వానిచేత పని చేయించుకొనుటకే ఆయన అట్లా అన్నది గదా. వాని స్వంత స్థితినిబట్టి కాదు గదా! ఇదే బాగా గమనించాలి తెలివైన వాడు. లౌకికపరాఙ్ముఖుణ్ణి చేసి జీవునకు అపేక్ష కలిగించుటకే 'జక్షన్' క్రీడన్, ఇత్యాదులు చెప్పబడినవి. భద్రసేనుఁడు ప్రభువునకు యథార్థముగా ఆత్మ కానట్లే సత్యసంకల్పత్వాదివిభూతి కూడ మోక్షము కాదు.

పారమార్థిక చైతన్యమాత్ర స్వరూపం వేరు, ప్రతీయమానమగు వ్యావహారిక స్వరూపం వేరు.

బాదరాయణాచార్యులు గూడ "జక్షన్ క్రీడన్ రమమాణః, ఇత్యైశ్వర్య మావేదయతి, తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి ఇతి చ " జైమిన్యాచార్యుల అభిప్రాయమున వ్యావహారికంగా విరోధము లేదని అన్నారుగదా! కాని వ్యావహారికులు లౌకికులు భ్రాంతులు.

మనము ఈ విషయమును విచారించవలె. యావదధికార సూత్రభాష్యమునందు ఇట్లున్నది. "బ్రహ్మమునకు అనేకాకారత్వము ప్రతిషిద్ధము కదా. 'స్థానమువలన కూడ పరబ్రహ్మమునకు ఉభయ లింగము లేదు' అనుచోట ఇది ఉన్నది. కావున ఐక్షణము మొదలగు వానిని చెప్పుట దుఃఖాభావమును సూచించుటకే, ఆత్మరతి మొదలగు వానివలె స్తుతికొఱకే. ఈయణిమాదికమైన యైశ్వర్యము సాతిశయ మగుటచే సాంతమే యగును.

ప్రతిషిద్ధం హి బ్రహ్మణోఽనేకాకారత్వమ్ "న స్థానతోఽపి పరస్యోభయలిఙమ్" ఇత్యత్ర। అత ఏవ చ ఐక్షణాదిసంకీర్తన మపి దుఃఖాభావమాత్రాభిప్రాయమ్ స్తుత్యర్థం ఆత్మరతి రిత్యాదివత్। వామ దేవః సర్వాత్మభావమోక్షస్తుతయే। ఇతివత్.

ఏత దణిమాద్యాత్మక మైశ్వర్యం సాతిశయత్వా దంతవత్

యావదధికారసూత్రభాష్యమునందు ఇట్లున్నది – (3–3–32) "ఐశ్వర్యాదిఫలములు గల జ్ఞానాంతరములయందు మహర్షులు ఆసక్తు లగుదురు. వారు వానిని పొందినతరువాత ఐశ్వర్యము క్షయము నొందుటను చూచి నిర్విణ్ణులై పరమాత్మజ్ఞానమునందు పరినిష్ఠులై కైవల్యము పొంది రనుట యుపపన్నముగా నున్నది." కృతాత్ములైన వారు మహాప్రళయము సంభవించినప్పుడు బ్రహ్మదేవునితోకూడ పరమ పదమును ప్రవేశించుచున్నారు" అని స్మృతిలో నున్నదానిని బట్టి ఇట్లు గ్రహింపవచ్చును.

యాజ్ఞవల్క్యుడు లోకమున సాధారణ వ్యక్తియే అయినను ఆత్మ జ్ఞానబలమువలన భార్యపుత్రులు విత్తము మొదలైన సంసారమునందలి కోరికను వీడి ప్రజ్ఞానముచేత తృప్తుడై ఆత్మయందు సంతోషమును పొందువాఁ డయ్యెను.

సర్వపురుషార్థములకు కర్మ గదా సాధన మని లోకమున ప్రసిద్ధమై యున్నది. ఆ కర్మ విత్తముచేత సాధింపదగినది. కాని

దానివలన అమృతత్వము కలుగు నను ఆశ కూడ లేదు. ఈ అమృతత్వము కర్మయొక్క అపేక్షము లేకుండ కేవలమైన ఆత్మవిద్యచేత పొందబడుచున్నది.

"నైవ కించిత్ కరో మీతి"— "ప్రలపన్। విసృజన్ గృహ్ణన్"— అను శ్లోకములకు శ్రీశంకరులవారు ఇట్లు భాష్యమును రచించిరి. "నే నేమియు చేయుట లేదు; అని యోగయుక్తుడై సమాహితచిత్తుడై చింతింపవలయును." తత్త్వవిత్ అనగా ఆత్మనెఱిగినవాడు. ఆత్మయొక్క యథార్థమైన తత్త్వము నెఱింగినవాడు తత్త్వవేత్త, అనగా పరమార్థమును దర్శించినవా డని యర్థము.

ఎప్పుడు ఎట్లు తత్త్వమును గ్రహించి ఇట్లు తలంచు నన్నచో, "చూచుచు" ఆట్లు తలంచు నని చెప్పుచున్నారు. సకలకార్యకరణచేష్టలైన కర్మలయందు అకర్మనే చూచుచున్న సమ్యగ్దర్శియైన తత్త్వవేత్తకు సర్వకర్మసన్న్యాసమునందే అధికారము కలుగును. ఎండమావులయందు జలమున్నది అను తలంపుతో ఆనీరు త్రాగుటకొఱకు బయలుదేరినవాడు, దానియందు జలము లే దని తెలిసిన తరువాత కూడ అక్కడ దప్పిక తీర్చుకోవచ్చు నని తలంపడు కదా!

తత్త్వవేత్త కానివాడు కర్మయోగమునందు ప్రవృత్తు డగును.

కొందరు బ్రహ్మవేత్తకు కూడ ఏషణాసంబంధమును వర్ణింతురు. వారు బృహదారణ్యకమును వినియుండరు.

పారమార్థిక చైతన్య స్వరూపులై విధ్వస్తతమస్కులైన సమ్యగ్దర్శనుల విషయం వేరు.

యావదధికారసూత్రభాష్యే 3—3—32. "జ్ఞానాంతరేషు చ ఐశ్వర్యాది ఫలేష్వాసక్తా స్స్యు ర్మహర్షయః। తే పశ్చా దైశ్వర్యక్షయదర్శనేన నిర్విణ్ణాః పరమాత్మజ్ఞానే పరినిష్ఠాః కైవల్యంప్రాపు। రిత్యుప

పద్యతే। "బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే
పరస్యాన్తే కృతాత్మానః ప్రవిశన్తి పరంపదమ్"

ఇతి స్మరణాత్॥

"జ్ఞానం సన్న్యాసలక్షణమ్" భారతం అనుశాసనపర్వం

కేవలసన్న్యాససహితా అభిహితా అమృతత్వసాధనాయ జ్ఞానమ్ తస్మాత్ నాతః పరం పురుషార్థసాధన మస్తి। అపిచ ఏవం స్తుతా బ్రహ్మవిద్యా-'సర్వో హి లోకో ద్వంద్వారామః స వైనైవ రేమే, తస్మా దేకాకీ న రమతే," ఇతి శ్రుతేః॥

యాజ్ఞవల్క్య లోకసాధారణోపి సన్ ఆత్మజ్ఞానబలాత్ భార్యా పుత్రవిత్తాది సంసారరతిం పరిత్యజ్య ప్రజ్ఞానతృప్త ఆత్మరతి ర్బభూవ (శ్రీరంగం ఎడిషన్, వాణీవిలాస్, బృహదారణ్యకోపనిషద్భాష్యే బ్రా:5, క:16, 338 పేజి)

సర్వపురుషార్థానాం కర్మ హి సాధన మితి లోకే ప్రసిద్ధమ్। తచ్చ కర్మ విత్తసాధ్యమ్। తేన ఆశా పి నాస్త్యమృతత్వస్య। త దిదం అమృతత్వం కేవలయా ఆత్మవిద్యయా కర్మనిరపేక్షయా ప్రాప్యతే॥

జ్ఞానము సన్న్యాసలక్షణము - అని భారతమున అనుశాసనపర్వమున కలదు.

కేవలమైన సన్న్యాసముతో అమృతత్వసాధనముకొఱకు జ్ఞానము చెప్పఁబడినది. కావున దీనికి మించిన పురుషార్థసాధనము లేదు మఱియును బ్రహ్మవిద్య ఈ విధముగా స్తుతింపఁబడినది. లోకమంతయు ద్వంద్వమునందు సుఖమును పొందుచున్నది. అందువలన అతఁడు (ఈశ్వరుఁడు) సంతోషమును పొందలేదు. కావున ఒంటరిగా ఎవఁడును సంతోషమును పొందలేడు-ఇట్లు శ్రుతిచెప్పుచున్నది.

గీతా 5వ అధ్యాయం 8-9 శ్లోకభాష్యమ్॥

నైవ కించిత్ కరో మీతి
యుక్తో మన్యేత తత్త్వవిత్।

"పశ్యన్ శృణ్వన్ జిఘ్ర
న్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్॥ (8)
ప్రలపన్ విసృజన్ గృహ్ణ
న్నున్మిష న్నిమిషన్నపి।
ఇంద్రియా ణీంద్రియార్థేషు
వర్తన్త ఇతి ధారయన్॥" (9)

భాష్యమ్:- నైవేతి, నైవ కించిత్ కరోమీతి యుక్త స్సమాహిత స్సన్ మన్యేత చింతయేత్ తత్త్వవి దాత్మవిత్ ఆత్మనో యాథాత్మ్యం తత్త్వం వేత్తీతి తత్త్వవిత్ పరమార్థద ర్శీత్యర్థః।

అవ।- కదా కథం వా తత్త్వ మవధారయ న్మన్యేతేత్యుచ్యతే పశ్య న్నితి. మన్యేతేతి పూర్వేణ సంబంధః యస్యైవం తత్త్వవిదః సర్వకార్యకరణచేష్టాసు కర్మసు అకర్మైవ పశ్యతః సమ్యగ్దర్శినః తస్య సర్వకర్మసన్న్యాస ఏవ అధికారః కర్మణోఽభావ దర్శనాత్। న హి మృగతృష్ణికాయాం ఉదకబుద్ధ్యా పానాయ ప్రవృత్తః ఉదకాభావజ్ఞానేపి తత్రైవ పానప్రయోజనాయ ప్రవర్తతే॥

అవః-యస్తు పునః అతత్త్వవిత్ ప్రవృత్తశ్చ కర్మయోగే. "బ్రహ్మణ్యాధాయ కర్మాణి——————————"గీత.

కేచిత్తు బ్రహ్మవిదోఽప్యేషణాసంబంధం వర్ణయన్తి తైః బృహదారణ్యకం న శ్రుతమ్॥

అని, శ్రీశంకరులవారు:-

మనోవికారాలనే దేవతారూపంతో భక్తి చేయుచున్నాము. అనగా దృశ్యములనే భజించుచున్నాము. కాని 'దృక్' స్వరూపంతో వీడు నిలవడం లేదు. దీవ్యతి ఇతి దేవః ప్రకాశించువాడు. సర్వకాలములలో తానే ప్రకాశించుచున్నాడు. మూడుకాలములో:- ముందు-ఇపుడు-వెనుక తానే ప్రకాశించుచున్నాడు. జాగ్రత్స్వప్నసుషుప్తులలోను క్రమశః చః

శత్వమహిమ ప్రత్యగాత్మకే అన్వయిస్తుంది. "అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః"

అని శ్రీకృష్ణభగవానులు. మృత్తిక వెళ్ళి కుండతో తన్ను రక్షించుమని ప్రార్థించుచున్నది.

ప. ప. శ్రీ శ్రీ విమలానందభారతీస్వాములవారు కుర్తాళం శ్రీ శ్రీసిద్ధేశ్వరీ ప్రథమ పీఠాధిపతి (పూర్వాశ్రమంలో తాను విద్యార్థిగా ఉన్నప్పుడు) శ్రీశంకరభగవత్పాదులవారిని గుఱించి చెప్పినది:—

సీ॥ జైన కాపాలిక శాక్తేయ తంత్రముల్
మనుజులన్ పసులుగా మార్చివేయ,
అపరపారాశర్యుడటు నాదిశంకరుం
డాస్తికాధారుడై యవతరించి
వ్రాసె గ్రంథశతంబు, జేసె వాద
సహస్రమేసె ముందంజ వక్తృత్వమునకు
దేశదేశములందు దిరిగె ధర్మము గోరి
షణ్మతస్థాపనాచార్యుఁ డయ్యె
మును గతించిన ఇపుడున్న ముందువచ్చు
విబుధు లాశ్చర్యమగ్నులై బేలువడగ
యుక్తియుక్తంబు నద్వైత ముద్ధరించి
యాస్తికత్వము స్థాపించి యరిగె దివికి

"మూఢో నాప్నోతి తద్బ్రహ్మ యత్ భవితు మిచ్ఛతి"

'తాను బ్రహ్మము కావాలి' అని అనుకోవడమే భ్రాంతి. తాను బ్రహ్మమే అనుజ్ఞానం వల్లనే ఆభ్రాంతి పోతుంది. మరి దేనివల్లనూ పోదు అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః.

ఆత్మజ్ఞానవల్లనే సర్వదుఃఖములు పోవును. మరే యజ్ఞమువల్ల గానీ మరే తపస్సువల్ల గానీ పోవు తత్త్వసాక్షాత్కారమువల్లనే సర్వ దుఃఖములు పునరావృత్తి లేకుండా దగ్ధమైపోవును.

పూర్వపు అలవాటు లేక ప్రారబ్ధమువల్లను జీవునికి మంచి చెడ్డల సంకల్పము ఏది కలిగినా దానిని అమలులో పెట్టుకొనుటకు జీవునికే స్వాతంత్ర్య మున్నది. సంకల్పము పుట్టించువరకే ప్రారబ్ధము నకు స్వాతంత్ర్యము. తరువాత దానిని క్రియలో పెట్టడం జీవునిదే అయివున్నది.

"కర్తా శాస్త్రార్థవత్త్వాత్" – బ్రహ్మసూత్రములు 2–3–33

కొన్నిమాటలు మనం వింటూ వుంటామే గాని వానిఅర్థం మనకు తెలియుట లేదు. ఉదా:–

1 విషం తినకూడదు.

2. అసత్యం చెప్పకూడదు.

ఈ రెండింటిలో "విషం తినకూడదు" అనేమాటవలె "అసత్యం చెప్పకూడదు" అనే మాట అర్థం కాలేదు. ఎందువలన? పరలోక విశ్వాసం లేనందువలన. అదియే నాస్తికత్వము. అవసరం వస్తే అసత్యం చెప్పగలము కాని విషం మాత్రం ఏపరిస్థితిలోను తినము.

దేహం క్షణభంగుర మని చెబుతూ వుంటామేగాని అది అర్థమై కాదు. ఆమాట అర్థమై వుంటే నిత్యమై, సత్యమైన బ్రహ్మమును విచారణ చేయడానికి కృషి చేస్తాము. ఆపని చేయనపుడు దేహాము యొక్క క్షణభంగురత్వము అర్థమైనట్లు కాదు.

స్వప్నములో నంజువ్యాధివలన దుఃఖము, కలిగిన అది ఒక సంవత్సరమునకు గాని కుదరదు అని అంటూ ఉండగా మేలుకుంటూనే క్షణంలో అది లేకుండా పోతుంది గదా! అదే విధంగా బ్రహ్మవిద్య కూడా సమర్థులైనవారు అర్హులైన శిష్యులకి తెలియ చెప్పగలరు.

గురుశిక్షణ లేనివారు శాస్త్రములు చదివి తమ శ్రేయస్సును నిర్ణయించుకొనేవారిని శిక్షించుటకే గీతాశాస్త్రము బయలుదేరినది. అర్జునుని విషాదయోగము బాగుగా గమనించవలెను. "జాతస్య హి

ధ్రువో మృత్యుః" పైరు నాటటము, ఆపైరు బాగా పండినవెను కోయటము రెండూ అవసరమే

కర్మయోగము — కర్మసన్న్యాసము అయాకాలములలో, ఆయ వ్యక్తుల ననుసరించి రెండూ శ్రేయస్కరములే.

శ్లో॥ ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే।
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే॥
నీని గీతాభాష్యము చూడవలెను.

సంసార మనగా ఏమిటి?

సుఖదుఃఖానుభవమే సంసారము. అంతఃకరణములో ప్రతి ఫలించిన సుఖదుఃఖములను నే ననేవాడు తనవని అనుభవించడమే సంసారము సంసారిత్వము.

కః పున రయం సంసారో నామ; సుఖదుఃఖసంభోగః సంసారః. పురుషస్య చ సుఖదుఃఖానాం భోక్తృత్వం సంసారిత్వ మితి॥ అని శ్రీశంకరులవారి గీతాభాష్యం. ప్రకాశించుచున్న నేననే చైతన్య పురుషునియొక్క సాన్నిధ్యమువలన జడమై ప్రకాశించుచున్న అంతః కరణములో పుట్టిన సుఖదుఃఖములు నేననే జ్ఞాతకు ఏమాత్రమూ సంబంధించనే సంబంధింపవు.

మృద్వికారములైన ఘటశరావాది (కుండ, మూకుడు) మొదలగు వస్తువులయొక్క రమణీయత్వ వికారత్వములతో మృత్తుకు ఏలాటి ఇష్టానిష్టము లుంటవు. పై విషయముల మంచి చెడ్డలు వానిని ప్రకాశింపజేసే సూర్యునకు ఏమాత్రం ఉండవు. మరెవరికి ఈసుఖ దుఃఖములు? ఇక వీటి నివృత్తికొరకు ఏ దేవతలుగాని ఎందుకొఱకు, ఎవరు ప్రయాసపడవలెను?

దేహేంద్రియాదుల సుఖదుఃఖములు, ఘటశరావాది మంచిచెడ్డల వలె అంతఃకరణ మనే మృత్తికకు ఏవిధంగానూ ఎప్పటికీ లేవు. అసంగ

సూర్యప్రభవలె అసంగ చైతన్య పురుషునికి పై సుఖదుఃఖములు అసలే లేవు

కర్మకాండ, ఉపాసనాకాండ లన్నియును ఈ అజ్ఞానములోనే అవిచారితముగా ఇమిడియున్నవి.

"నాయందు కర్తృత్వ, భోక్తృత్వములు భాసిస్తూ వున్నా నేను అసంగచిద్రూపుడను, అకర్తను, అభోక్తను" అను భావములో వున్నవాడే జీవన్ముక్తుడు.

స్త్రీవేషం వేసిన పురుషుడు తాను స్త్రీగా వ్యవహరించుచున్నను ఇతరులకూ, అలాగే ప్రతీయమానం అవుతున్నా తాను పురుషుడ ననే భావానికి ఏమీ ఆటంకము లేదు.

పూర్వజన్మలలో చేసిన పుణ్యాపాపములవల్ల ఏర్పడిన ప్రారబ్ధముచే వచ్చినవే, ఈజన్మయందు సంభవించు సుఖదుఃఖములు. అవి కలుగుచున్నను తాను అసంగుడ ననియు, నిత్యానందస్వరూపుడ ననియు, నిర్వికారుడ ననియు, స్వానుభవములో తెలిసిన తత్త్వవేత్త వాటివలన ఏమాత్రము ఉద్విగ్నమనస్కుడు కాదు — React గాడు.

బాగా విచారించినచో ప్రపంచములో సుఖదుఃఖము లంటూ రెండు లేవు. అస లున్నది దుఃఖ మొకటే. సుఖరూపంగా ఉన్నది కూడా నిజంలో దుఃఖమే.

గీత:- "యే హి సంస్పర్శజా భోగా
దుఃఖయోనయ ఏవ తే।
అనిత్య మసుఖం లోక
మిమం ప్రాప్య భజస్వ మామ్।
మా ముపేత్య పునర్జన్మ
దుఃఖాలయ మశాశ్వతమ్।
నాప్నువంతి మహాత్మానః
సంసిద్ధిం పరమాం గతాః॥"

శ్రీశంకరులవారు చెప్పిన:—

జన్మ దుఃఖం జరా దుఃఖం ఇత్యాది.

దేహేంద్రియాదులచేత చేయబడునది పుణ్యము కాదు, పాపము కాదు. అయితే మరేది? చేష్ట మాత్రమే. ఇపుడు పుణ్య మేది? అంటే సంకల్పము జతపడ్డప్పుడే అవి పుణ్యంగా పాపంగా మారును. సంసారానికి కారణం సంకల్పమే. అన్నిటికీ కారణం కామమే. ఆ కర్మ ఫలము మళ్ళీ ఆకర్మమే చేయు మని ప్రోత్సహించి పోతుంది. అదే వాసన అంటారు.

కామం భాసించే చోటు తెలిసికొంటే కామప్రహాణం జరుగుతుంది. అజ్ఞానపరిణామం కామమ్ కామం తనదీ కాదు. అయితే ఎవరిది? అజ్ఞానముదే. ఆ అజ్ఞానం పోయే దెట్లా? తా నెవరో తెలిసికొంటే అది పోతుంది. అనగా తత్త్వజ్ఞానముచేతనే కామం పోతుంది. "పరం దృష్ట్వా నివర్తతే" జ్ఞానాగ్నిచేతనే కామం సమూలంగా పోతుంది. యోగాగ్నిచేత, తపోఽగ్నిచేత మొదలగు వాటి చేత పోయినా శేషం ఉండనే ఉంటుంది. "రసవర్జం." కామం ఎలా నెరవేరినా మరొకదానిలో దాగుకొని కనబడదు 10 రూపాయలు 100 రూపాయలలో దాగుకొన్నట్లు

అనుశాసన పర్వములో శ్రీకృష్ణభగవానుడు చెప్పిన కామ గీతలో చూడుడు.

ఆత్మ స్ఫురణ కలిగితే కామం పుట్టదు. ఆత్మకాముడే ఆప్త కాముడు. కోరిక నెరవేరినను అప్పటికి పోయి మరొక విషయములో మళ్ళీపుట్ట గలదు. విషయములమీద కోరిక, విషతుల్య మని తెలిస్తే ఆ కోరిక పోవును.

ప్రాణి ఏది అభిలషించిననూ సుఖముకొరకే గదా! ఆత్మయే సుఖస్వరూపు దని తెలిసికొని ఆత్మకాము డైతే ఇక ఆప్తకాముడే.

వాడు మరొకదాన్ని సుఖంకొఱకు కోరవలసినది లేదు. ఆత్మ "సత్యం, శివం; సుందరం." విషయములందు రమణీయతాదృష్టియే కదా సంకల్పం వచ్చుటకు కారణం. ఆత్మయే సర్వసుందర మని, ఆనందఘన మని తెలిసికొని సంకల్పరహితు డగువాడు కృతార్థు డగును.

సంసార మంటే జన్మాంతరమందు తాను చేసిన పుణ్యాపుణ్యములచేత వచ్చిన సుఖదుఃఖానుభవమే. అట్టి సుఖదుఃఖాకారములగు మేఘములు వస్తున్నా పోతున్నా ఆత్మ అనే ఆకాశానికి ఏలోటూ లేదని తెలిసికోవడమే తత్త్వజ్ఞానము.

తత్త్వజ్ఞాన మంటే ఉన్నది ఉన్నట్లుగా తెలిసికోవడమే, నిజం తెలిసికోవడము.

"ఆనందం బ్రహ్మణో విద్వాన్

న బిభేతి కుతశ్చన" శ్రుతి.

ఆత్మయొక్క స్వభావమైన ఆనందమునందు సుఖదుఃఖాదులు లేవు.

సర్వదా విధేయుడైన జనకచక్రవర్తిని మహత్తరమైన సంపదలను వదలి యాజ్ఞవల్క్యులవారు సన్న్యసించినారు.

"అథాత ఆదేశో నేతి నేతీతి"

ఆత్మ ఎప్పుడూ స్వప్రకాశముగానే ఉంది. శుక్తిక ఉండనే ఉంది. లేని రజతాన్నే తోసివేయాలి, "నేతి నేతీతి"

ఆనందం మరెక్కడా లేదు. ఆనందం తన స్వరూపమే. ఇక ఆ ఆనందం తెలియకుండా ఉండడానికి అడ్డమేమిటి? "అజ్ఞానమ్" దానిచేత ఏర్పడిన రాగద్వేషములు. వాటిని తీసివేస్తే ఇక సర్వత్ర ఆనందఘనమే. ఏ అన్యసాధన లేకుండా ఏది తెలుస్తుందో అది సాక్షాత్ అపరోక్షమ్.

"జ్ఞానాదేవతు కైవల్యమ్;" "నాన్యః పంథా విద్యతేఽయనాయ."

జ్ఞానంవలన మోక్షం వస్తుందనుట ఔపచారికమే. జ్ఞానంవల్ల అజ్ఞానం మాత్రమే పోతుంది. జీవుడు స్వరూపముచేత నిత్యముక్తుడే.

ఉపాసనముల స్థానము:— వేదాంతవాక్యార్థ తత్త్వము తెలియని లోపము ఉన్నవానికే ఉపాసనము. "ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున" తక్కిన లోకాలన్నీ భంగపాటుకు లోబడునవే. ఆ లోకాలలో వాటి మర్యాదకు భంగంగాను అడ్డదిడ్డాలుగాను ప్రవర్తిస్తే అక్కడనుండి పతనముకూడ కలుగును. సాక్షాత్తు మహావిష్ణువువద్దనున్న జయ-విజయుల సంగతే ఏమైనది.

పాపములు బ్రహ్మానుభూతి కలవానివద్దకు పోనేపోలేవు; స్వభావంలోనే ఉదా:— చీకటి వెలుతురువలె. అతనియొక్క సహజానందస్వరూపానికి బల మిచ్చే పుణ్యము ఏదియూ లేదు. ఆ ఆనందమునకు లోపము కలగించే పాపము ఏదియూ లేదు.

"న కర్మణా వర్ధతే నో కనీయాన్."

అజ్ఞాతార్థమును జ్ఞాపకము జేసే వేదములోని నాలుగు మహావాక్యములే పరమప్రమాణములు. అవే పరమశ్రేయస్సుకు కారణము. అపూర్వత ఫలము ప్రయోజనము, ఆమహావాక్యముల కున్నవి.

ముఖ్యబ్రహ్మచర్యము అనగా బ్రహ్మమును గురించి శాస్త్రయుక్త గురూపదేశప్రకారం విచారించుటే.

"న హి బ్రహ్మజ్ఞానం త్వరమాణేన లభ్యః."

అమనస్క రాజయోగ సమాధివలె గాఢసుషుప్తిలో మనస్సు లేకపోవుటచేతనే తాను తననే బాగా చూచుకొంటున్నాడు.

కం॥ స్వాపావస్థం బ్రకృతి క
దీపత వాటిల్లినపుడు తెలివెడలక తా
దీపించు పురుషు (డిమ్మెయి)
జూపు బ్రబోధంబు పరమ సూక్ష్మత పుత్రా॥

భారతము శాంతిపర్వము.

మనస్సు ఉన్నంతవరకు అది తనను గాకుండా మరొకరిని చూపెట్టుచున్నది. "నేను"ను అన్యంగా చూపెట్టే మనస్సు ఉపశమించి నపుడే ఆత్మదర్శన మవుతుంది. మనస్సు ఉన్నంతవరకు జాగ్రత్ స్వప్నములలో తనను వేరుగనే తలంచుచున్నాడు. నేననేవాడు మనస్సు లయించినను సుషుప్తిలో ఆనందస్వరూపంతో ప్రకాశించుచున్నాడు. కనుక మనం శాశ్వతంగా మనోనాశము చేసి వేస్తే నిరంతరం జీవన్ముక్తులుగా ఉంటాము. జాగ్రత్తగా సాధనానుష్ఠానము చేస్తూవుంటే కాలము పక్వ మైనపుడు మనకు సిద్ధి కలుగుతుంది. అవసరపడ కూడదు కాలపాకము కొరకు ఓర్పు వహించి యుండవలెను.

జాగ్రత్స్వప్నసుషుప్తు లనేవి ఎన్ని వచ్చినా ఎన్ని పోయినా నీ అఖండసచ్చిదానందమును నీవు మరవకూడదు. మనస్సు లేనిస్థితి ద్వైతప్రతీతి లేనిస్థితియే. మనస్సు నశిస్తే సుషుప్తివలె ఉంటుంది. అయితే జీవన్ముక్తు డెలా వ్యవహరిస్తాడు? మామూలు మనస్సంటే రాగద్వేషాలు కలది. వాటిని ఆమనస్సులో నుంచి తీసివేసి వ్యవహరిస్తే అపుడు అమనస్కుడే.

బహుశ్రమచేత మోక్షము వస్తుందనే అభిప్రాయము తెలివి తక్కువయే. మోక్షమునకు ఏప్రయత్నము అవసరమో అది చేయ వలెను. భగవదాజ్ఞా నిర్వహణయే భగవద్భక్తి, భగవత్సేవ. జ్ఞానమే పరమశ్రేయస్సు. అది తెలిసిన గురువులసేవ జేసి వారి ఉపదేశములను గ్రహించుటవల్లనే ముక్తి లభిస్తుంది. సద్గురువుల బోధలను గ్రహించే బుద్ధి మేధే కావలసినది. స్వాప్నికపీడ లన్నియు తొలగడమునకు ప్రబోధమే మార్గము. దేహేంద్రియాది సమూహముతో అవి సత్యము లని వ్యవహరించడమే స్వప్నము, అవన్నీ నిషేధించి తనను తెలిసి కొనుటయే మెలకువ.

శ్లో॥ "యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥"

మనలో కొన్ని గుహలు ఉన్నాయి. వాటిలో ఇంద్రియములనే భయంకరసర్పము లున్నవి. అవి మనకు తెలియకుండ ఎప్పుడో కాటు వేస్తవి. అవంతా దుఃఖానికే కారణ మవుతాయి. సుషుప్తిలో కేవల ఆనందం సంపూర్ణంగా ఉన్నది కదా! ఇంద్రియములు అడ్డులేని సుషుప్తిలోనే మనం కొఱతలేని సుఖం అనుభవిస్తున్నాము. ఇంద్రియ ములనే సర్పములను మనం నిరంతరం పోషిస్తూ వాటివల్ల దుఃఖమే అనుభవిస్తున్నాము.

నేననే సచ్చిదానందప్రత్యగాత్మకు, జననమరణాది దుఃఖములకు, సూర్యునకు చీకటికి ఉన్నంతదూరము. అయిననూ జీవుని పాపాధిక్యము చేత అజ్ఞానము చేతనే తాను జననమరణాది దుఃఖములు పొందునట్లు తలంచుచున్నాడు. శివుడైనా స్వయముగా వచ్చి మనకు తత్త్వబోధ చేయడు. శివుడు గురురూపమున వచ్చి మనకు తత్త్వజ్ఞానము అను గ్రహించగలడు.

బ్రహ్మము లేదనేవాడు నేను లేననే వానివలె పరిహాసాస్పదు డవుతాడు. బ్రహ్మము తస్వరూపమే గనుక, తన అభావాన్ని తాను వుంటే గదా చెప్పగలడు. తానే లేనిచో తన అభావాన్ని ఎలా చెప్ప గలడు.

"అసన్నేవ స భవతి, అసద్ బ్రహ్మేతి వేద చేత్"

సుషుప్తిలో నేను లేననేవాడే లేడు.

అనంతబ్రహ్మముయొక్క భూమస్వరూపంలో వైవిధ్యము ఉండుటకు వీలు లేదు.

"యత్ర నాన్యత్ పశ్యతి——————————

ప్రతిపదార్థనికి ప్రాతీతికరూపము ప్రామాణికరూపము అని రెండు రూపము లున్నవి. ఒకప్పుడు ప్రాతీతికరూపము అనగా వ్యావహారిక రూపము, లేకపోయినను ప్రామాణికరూపము మాత్రము సదా ఉంటుంది.

రజ్జువు అభయరూపమైనను సర్పప్రతీతి ఉన్నప్పుడు మనం అభయత్వమును అనుభవించలేక పోతున్నాము.

శాశ్వతానందమే ప్రతివాడు కోరుచున్నాడు. అయినను తాను ముందున్న స్రక్‌చందనవనితాదులను కోరుచున్నాడు ఈ మెలికలోనే లౌకికులు వైదికులు ఉన్నారు. కాని కోరే పురుషునియందే శాశ్వతానందము నిండుగానున్న దని శ్రుతి.

అజ్ఞానవశంచేత అది అర్థం గాకుండా ఉన్నది. తనకంటె అన్యముగా ఆనందము ఉన్నదనే అభిప్రాయముతోనే లౌకికులు, వైదికులు యిద్దరూ ఉన్నారు.

శ్రుతి యింత స్పష్టముగా చెప్పినను తెలివిగల మనము మాత్రము 'నీవు చెప్పినది అబద్ధము; మాఅనుభవంలో మాఆనందము ధనవనితాదులలోనే సమృద్ధిగా కనబడుచున్నది;' అంటే, 'అది చాలా సమృద్ధిగా స్వర్గంలో ఉందని యజ్ఞం చేయు మంటుంది శ్రుతిమాత కరుణతో.

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥"
"తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత।
తత్ప్రసాదాత్ పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥
గీత॥ 18 అధ్యాయం 61,62

అందు జీవునిదే పూచీగల పెత్తనము. జీవునకు ఈశ్వరాజ్ఞలను అను వర్తించుటో, తిరస్కరించుటో చేయుటకు అధికారము ఉన్నది. బుద్ధిలోని, కుసంస్కారానుసారంగా నడిచినాడంటే వాడే చెడతాడు. అకర్తృత్వ మంతా వీనిదే.

"కర్తా శాస్త్రార్థవత్త్వాత్॥"

మన మెప్పుడు పవిత్రమైన పనులలో శ్రద్ధ కలిగి చేస్తూ ఉంటామో అప్పుడు భగవత్కటాక్షము మన కున్న దని తలంచవలెను.

నేననేవాణ్ణి వదలిపెట్టి జాగ్రత్స్వప్నసుషుప్తులు లేవు. అతను (నేను) దాగకుండానే నిరంతరం దేదీప్యమానంగా వెలుగుతూ వున్నాడు అయితే ఈ నేననే వాడు పనికిమాలిన స్వభావముతో అర్థమౌతున్నాడు. వీడే ఉత్తమోత్తమ స్వభావంతో సకల పుణ్యపాపములకు అతీతుడుగా అస్పృష్టుడుగా వెలుగుచున్నాడను యథార్థము గుర్తించుటకే వేదాంత శ్రవణము.

భగవదనుగ్రహం ఉందంటే సర్వవస్తువులయందు వైరాగ్యం కలిగి ఉండటమే.

వైరాగ్యము ప్రశాంతికి కారణము. ఎంతవఱకు వేదాంత మనే సింహము గర్జింపదో, అంతవఱకు నక్కలు అడవిలో కూయునట్లు, ఇతర శాస్త్రములు గర్జించుచుండును.

"తావత్ గర్జన్తి శాస్త్రాణి జంబుకా విపినే యథా।
న గర్జతి మహాశక్తిః యావత్ వేదాంతకేసరీ॥"

బ్రహ్మేంద్రాదులు తమలోకాల సుఖములను గూడా పాటించకుండా ఈ బ్రహ్మవిద్యనే కోరుచున్నారంటే దీని ప్రభావము ఎట్టిదో తెలిసికొనవచ్చును.

మన మెక్కడ ఉన్నామిపుడు?

మహాదుఃఖమయములైన ఘోరసముద్రమునందలి జన్మవ్యాధి జరామరణసుడిగుండములలో పరితపించుచున్నాము. మరొక వ్యాసంగములో బుద్ధిని పోనివ్వవచ్చునా!

శివధ్యానంవల్ల, విష్ణుధ్యానంవల్ల మొదటిదుఃఖం పోయి తృప్తి వస్తుందే గాని, అసలు వస్తుదర్శనం మాత్రము బ్రహ్మాత్మవిచారణ వల్లనే కలుగుతుంది.

అష్టాంగయోగసమాధులు (సవికల్ప నిర్వికల్ప సమాధులు) ఎంత అనుభవానికి వచ్చినా కృతార్థత లేదు.

ఐశ్వర్యమువల్ల గాని, విషయసుఖాలఅనుభవంవల్ల గాని వచ్చే సంతోషము మనస్సులో కలిగితే నాకు కలిగింది అనుకొంటున్నాము. సుఖాకారముగా దుఃఖాకారముగా ఈ వృత్తులు పర్యాయముగా కలుగుతూ వుంటాయి. చీమలు దోమలు మొదలగువాటి అనుభవం గూడా ఇంతే. మనకు నిర్వికల్పసమాధి అనుభవము గూడా ఈ సంబరముతో కూడుకొనినదే. ఇవన్నీ బుద్ధితో ఏకీభవించినందువల్ల కలిగినవే కాని యివి ఏమీ వస్తుతః సంక్రమించ లేదు, జపాకుసుమస్ఫటికమువలె.

కనుక చీమయొక్క బ్రతుకు మహాయోగిబ్రతుకు ఇంత మాత్రమే. కాలప్రవాహంలో, యివన్నీ పర్యాయంగా వస్తూ వుంటాయి.

తత్త్వవిచారణవల్ల ఉన్నది ఉన్నట్టుగా ఆత్మదర్శనము చేస్తేనే ఆత్యంతికదుఃఖనివృత్తి కృతార్థత కలుగును. అయితే ఈ యోగ సమాధులను శ్రుతి ఎందుకు అంగీకరించినది అంటే క్రమంగా వానివల్ల వైరాగ్యం కలిగి ఆత్మవిచారణకు మనబుద్ధి అభిముఖం కావడమునకే. కనుక జాగ్రత్తగా బుద్ధిని పరిశీలించుకొని ప్రమాణం మీద ఆధారపడి బ్రహ్మాత్మానుభవం పొందవలెను. ఇదియే కృతార్థత. ఇదియే మోక్షసిద్ధి.

అలవాటువల్ల అర్థమైన దానిని ప్రమాణమర్యాదచేత అర్థమైన విషయం తిరస్కరిస్తుంది. ఆక్షేపణచేస్తుంది. అదే సబబు.

ఉదా:— విశ్వామిత్రుడు — వారితపస్సు.

మేనకాదర్శనము—రాగము కలుగుట ప్రమాణంచేత తెలిస్తే మేనక కాగితంలో బొమ్మయే. విశ్వామిత్రుడు వేలకొలది సంవత్సరాలు తపస్సు చేసినందువల్ల వచ్చిన లాభవిశేషము గమనించదగినది.

మనోనిగ్రహమునకు మహావాక్యవిచారణచేత జనించిన జ్ఞానమునకు తారతమ్యములో వేయిరెట్లు తేడా ఉన్నది.

తత్త్వవిచారమే మహాతపస్సు.

అఖండాద్వితీయచైతన్యప్రకాశము ఆ యా అంతఃకరణ ఉపాధుల పద్ధతి ననుసరించియే కనబడుతూ ఉంటుంది. వీటిని మినహాయించి చూడటమే వివేకసంపత్తియొక్క వైభవము. చచ్చే పుట్టే దేహమునందు చావక పుట్టక యున్న బ్రహ్మమే ఉన్న దని అద్వైత వేదాంతము చెప్పుచున్నది.

స్వయంప్రకాశమై నిత్యానందఘనమై వున్న ప్రత్యగాత్మ యీ దేహము నిండా దేహవికారములు ఏమియు లేకుండ చావుపుట్టుకలు లేకనే ఉన్నది.

"మాయాసంఖ్యాతురీయం పర మమృత మజం బ్రహ్మ య త్తన్నతోఽస్మి"

"యద్బ్రహ్మ" ఏ బ్రహ్మము అనుటలో వేదాంతములైన ఉపనిషత్తులచే ఏ బ్రహ్మము చెప్పబడినదో ఆ బ్రహ్మము అని అర్థము. (మాండూక్యోపనిషత్తు)

## అనాత్మశ్రీ విగర్హణ ప్రకరణము

శ్రీ శంకరాచార్యుల కృతికి తెలుగు అనువాదము—

శ్రీరామానంద భారతీస్వామివారు.

"అందె రాజపూజ్యము విద్య నైన నేమి?
అలఘుసంపద లార్జించె నైన నేమి?
అందమగు భార్యనే పొందె నైన నేమి?
అతని కాత్మసాక్షాత్కార మబ్బ దేని॥

"అలరు ధర్మభూషణముల నైన నేమి?
చీనిచీనాంబరము లున్న నైన నేమి
అతులమృష్టాన్నభోజియు నైన నేమి
అతని కాత్మసాక్షాత్కార మబ్బ దేని॥

అఖిలదేశములన్ జూచె నైన నేమి?
అఖిలబంధువర్గము బ్రోచె నైన నేమి?
అడచె దారిద్ర్యదుఃఖమ్ము నైన నేమి?
అతని కాత్మసాక్షాత్కార మబ్బ దేని॥

"స్నానమొనరించె గంగలో నైన నేమి?
అరుపదియు దానము లిచ్చె నైన నేమి?
అలఘుమంత్రకోటి జపించె నైన నేమి?
అతని కాత్మసాక్షాత్కార మబ్బ దేని॥

"అతడు వంశభూషణు డయ్యె నైన నేమి?
అలదె భూతి దేహ మ్మంత యైన నేమి?
అలుత దాల్చె రుద్రాక్షదు లైన నేమి?
అతని కాత్మసాక్షాత్కార మబ్బ దేని॥

"అన్నముల విప్రులన్ దన్పె నైన నేమి?
యజ్ఞముల దేవతల గొల్చె నైన నేమి?
యశ మఖిలలోకముల నిల్పె నైన నేమి?
అతని కాత్మసాక్షాత్కార మబ్బ దేని॥

"అంగ ముపవాసకృశ మయ్యె నైన నేమి?
అధికగుణుల బుత్రుల గాంచె నైన నేమి?
అభ్యసించె బ్రాణాయామ మైన నేమి?
అతని కాత్మసాక్షాత్కార మబ్బ దేని॥

"ఆహవముల శత్రుల గెల్చె నైన నేమి?
అందరున్ మిత్రు లాతని కైన నేమి?
అందె యోగసిద్ధుల నెన్నొ యైన నేమి?
అతని కాత్మసాక్షాత్కార మబ్బ దేని॥



"అబ్ధి లంఘించె బదముల నైన నేమి?
అనిలు బంధించె లోపల నైన నేమి?
హస్తమున నెత్తె మేరువు నైన నేమి?
అతని కాత్మసాక్షాత్కార మబ్బ దేని॥

"హాలహల మారగించినా డైన నేమి?
అగ్ని లాజలవలె మ్రింగె నైన నేమి?
అంబరమ్మున జరియించు నైన నేమి?
అతని కాత్మసాక్షాత్కార మబ్బ దేని॥

"అఖిల దిక్పాలకుల గెల్చె నైన నేమి?
అమర బరుసవేదియు బొందె నైన నేమి?
అంజనమున నిధుల గొనె నైన నేమి?
అతని కాత్మసాక్షాత్కార మబ్బ దేని॥

"అవని సార్వభౌముం డయ్యె నేమి?
అందె నింద్రాధిపత్యమ్ము నైన నేమి?
అయ్యె మౌనిలోకశ్రేష్ఠు డైన నేమి?
అతని కాత్మసాక్షాత్కార మబ్బ దేని॥

"అమ్ములన్ లక్ష్యముల దుల్చె నైన నేమి?
అఖిలమున్ మంత్రముల నాపె నైన నేమి?
అందె మరియు గాలజ్ఞాన మైన నేమి?
అతని కాత్మసాక్షాత్కార మబ్బ దేని॥

"అణచి పైచె గామావేశ మైన నేమి?
ఆగ్రహమ్మునున్ గెల్చినా డైన నేమి?
అవలద్రోచె లోభాశ్లేష మైన నేమి?
అతని కాత్మసాక్షాత్కార మబ్బ దేని॥

"అడగె మోహతమ మ్మంత యైన నేమి?
అవని నిర్మదుడై వెల్గె నైన నేమి?
మానె మాత్సర్యపీడయు నైన నేమి?
అతని కాత్మసాక్షాత్కార మబ్బ దేని॥

"అరిగె బ్రహ్మలోకమ్మున కైన నేమి?
అరసె విష్ణులోకము కూడ నైన నేమి?
హరునిలోకమ్మునున్ బొందె డైన నేమి?
అతని కాత్మసాక్షాత్కార మబ్బ దేని॥

"కల్గు ని ట్లనాత్మశ్రీవిగర్హణమ్ము
సత మెవనియెద నాత్మదర్శనము కూడ
అందె కల్గు; మాయామోహితాత్ము లన్య,
లిది నిజమ్ముగా నాత్మ య దెట్లు దొరకు?

సంసారమునకు కారణం కామమే దాని నివృత్తి కారణం:—

"జ్ఞానవైరాగ్యే ససన్న్యాసే గీతాశాస్త్రే ప్రసిద్ధమ్." అని శంకరులవారు భాష్యమున గీతాశాస్త్రమే ప్రమాణముగా చెప్పుచున్నారు.

అశ్వమేధపర్వములో శ్రీకృష్ణభగవానుడు చెప్పిన కామగీత యందు కాముడు చెప్పిన విషయ మిది:—

"ఎవడు ఎయ్యది కోరి ప్రవృత్తిలో దిగినా అది నాచేష్టయే. తపస్సు, యోగము మొదలగునవి ఏది తలపెట్టినను అందులో నేనే దాగియున్నాను. అది వా డెఱుగడు."

సర్వం క్షణభంగుర మని బోధిస్తే ఏమి లాభము? శాశ్వతమైన ఆత్మ లభించనిదే ఎలా తృప్తి ఉంటుంది.

"తరతి శోక మాత్మవిత్" అనిశ్రుతి.

ప్రతి ప్రాణి కోరే ఆనందమే—సుఖమే బ్రహ్మ మను పేరుతో శాస్త్రమునందు వ్యవహరింపబడియున్నది. బ్రహ్మానందము అనంతము

నిత్యము. ఎపుడూ తరుగు, విసుగు లేనిదే మోక్షము, బ్రహ్మవ
దీనికి వేదశాస్త్రములలో చెప్పిన ధర్మమే మార్గము. "ప్రథమె
దైవ్యో భిషక్."

జీవులకు పరమేశ్వరు డంటూ ఒకరిని పట్టుకొని ఏడవట
అలవాటు. 'నీవే పరమాత్మవు' అంటే, వానికి తృప్తి వుండ
"త దేవ త్వం విద్ధి॥ నేదం య దిద ముపాసతే" అనగా ఉపాసిం
దలచుకొన్న ఆ చైతన్యజ్యోతియే ప్రత్యగాత్మ. బ్రహ్మము, నిర
శయము, భూమము. "పరమానందైక భూమారూపో ఽహమ్. బ్రహ్మ
సర్వవ్యాపకము, 'త దేవ త్వం విద్ధి' నిర్విశేషమైనబ్రహ్మను మాత్ర
తెలియుము. సకలోపాధులను తొలగింపుము. 'ఇది యని ఉపాధివిశి
మైన ఏ ఈశ్వరుని అనగా అనాత్మలను ఉపాసింతువో అది బ్రహ్మ
గాదు. సోపాధికులైన ఈశ్వరాదులు అనాత్మలు ఆత్మ గాదు. ఉపా
కులు అట్టి అనాత్మలను ఉపాసింతురు. వారు ఉపాసించునది బ్రహ్మ
గాదు. "నేదం య దిద ముపాసతే."

ముఖ్యముగా మానవజన్మలో ప్రయత్నించి తెలిసికొనదగిన
ఏద్ది? ఎయ్యది తెలిస్తే మరొకటి తెలిసికొనదగినది యిక ఉండద
ఆదియే అయితే దానివలన లాభ మేమిటి? ఏది లాభిస్తే మరొక
పొందవలసిన లాభము లేదో అది అదియే నిత్యమైన అఖండానందమ
తెలివిద్వారానే దీనిని తెలిసికొనవలెను. "జ్ఞానా దేవ తు కైవల్యమ్.
ఎవనికి? ఎవడు దీనికి అర్హత సంపాదించుకొన్నాడో వానికే అ
తెలుస్తుంది.

ఈనామరూపప్రపంచము తన కాశ్రయమైన వస్తువును కప్పి
పుచ్చి తానే ప్రతీతికావటము దీనికి స్వభావము.

ఉదా — పంచదారచిలుక. తనలోనిపంచదారను మరుగుపర
చిలుకే తన అవయవములతో ప్రతీతి అవుతూ ఉంటుంది. బు

తోనే ప్రధానంగా విషయనిర్ణయం చేయాలి. "బుద్ధి గ్రాహ్య మతీంద్రియమ్" ఇంద్రియముల కర్థ మయ్యేదే యథార్థ మని అనుకొనే వాళ్లు అజ్ఞానులు. ఇంద్రియాతీతమైన వస్తువును తెలిసినవాడే తత్త్వజ్ఞుడు. ఇంద్రియములకు ఎంత ఉపయోగంగా, ఎంత మనోహరంగా కనుబడినా అంతా అబద్ధమే. దాని బ్రతుకే అంత అని తెలిసినవాడే తత్త్వజ్ఞుడు.

అఖండచైతన్యమే ఏకరసముగా ప్రకాశించుచున్న దనియు, అదియే ప్రత్యగాత్మగా 'సర్వానుభూః' సర్వులఅనుభవములో ఉన్న దనియు శ్రుతులయొక్క ముఖ్యోద్దేశము.

'నేను' యొక్క సహజస్వరూపము తెలియక నేను మనుష్యుడ ననియు క్షత్రియుణ్ణి బ్రహ్మచారిని అనియు విరుద్ధముగా జీవుడు భావించుచున్నాడు. ఇందులో ఏది నిజము? ఏదియు కాదు. అయితే మరేది నిజము? అంటే అఖండసచ్చిదానందబ్రహ్మమే. కాని అది–ఆ మహామాయ–"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా" – ఈ జీవుణ్ణి ఏదైనా ఉపాధిసహితంగా ప్రకాశింపజేయుచు, అదియే నే నని తెలియజేయుచు, నిరంతరం దానిరక్షణకొరకు ప్రయత్నశీలునిగా జేయుచున్నది. అసలు శ్రీమన్నారాయణమూర్తి గూడ, ఆయనను శంఖచక్రగదాద్యాయుధములతో ఉన్నా డని ప్రార్థించినను, అది తప్పే అని ఆయనయే నారదమహర్షితో చెప్పినాడు.

మామూలుగా భాసించే స్వరూపము నేను గా దని తెలిసికొని, తత్త్వజ్ఞతతో తన నిజస్వరూపమును ఎఱిగి ఆనందముగా ఉండటమే జీవన్ముక్తులయొక్క పద్ధతి. అదే బ్రహ్మవిద్య. అది గాకుండా, నేను ఫలానా అని ఎవరైనా కీర్తించినపుడు నేను సంతోషపడ్డానంటే నేను అజ్ఞాని ననియే శాస్త్రము.

జ్ఞాని అనుభవించునది కేవలనిర్వికార అఖండచైతన్యమే. అదే పారమహంస్యస్వరూపము. అదే తన నిజస్వరూపము. జ్ఞాని అయిన వాడు ఏవికారస్వరూపము తనది కాదని తెలిసికొనే వర్తించుచున్నాడు.

ఈ ప్రత్యగాత్మయే పరమేశ్వరు డనియు ఈ సృష్టి అంతయు కనబడటమే గాని నిజము గా దనియు, సృష్టిప్రకరణము లన్నియు ఈ ప్రత్యగాత్మనే తెలియజేయుటకు వచ్చిన వనియు గ్రహించవలెను.

ఆత్మకు అజ్ఞానము ఉన్నదంటే దేహేంద్రియాదులను ఆత్మగా భావించుటే లక్షణముగా గలది. అజ్ఞాను లంటే దేహేంద్రియాదుల సాకల్యవైకల్యములవల్ల తమకు సుఖదుఃఖములు కలుగుచున్న వని భావించువారే. తనసుఖము దేహేంద్రియాదులలో వున్న దని అజ్ఞాని భావము. శాస్త్రములో తనసుఖము తన స్వస్వరూపమునందే యున్న దని చెప్పబడుచున్నది.

ఆత్మా, శాశ్వతః శశ్వత్ భవః, నిత్యనూతన మైనది. ఒకప్పుడు గూడ శక్తి తగ్గనిది.

"య స్యానందలవే నైవ
జగ దానంద మశ్నుతే।
తం వందే ప్రత్యగాత్మానం
అసంగం నందనందనమ్॥

దేహేంద్రియాదులను 'నేను'గా అర్థం చేసికోవడమే సర్వానర్థ ములకు మూలము.

ఆత్మ నిరంతరము నిత్యసుఖస్వరూపుడుగానే ఉన్నాడు. ఇది తెలియడమే కావలసినది.

శ్రవణ మనగా శ్రుతియుక్తులచేత వేదాంతవాక్యములను విచారించుట. దీనికి అర్హత కలిగించుటకే కర్మోపాసనలు. ఇది భరత ఖండభాగ్యమే. దేవతలకు గూడ లేనిది. "తదుపర్యపి బాదరాయణ

స్సంభవాత్" అనడంలో వ్యాసాచార్యులవారి 'సిఫార్సు' కావలసివచ్చి నది, దేవతలు గూడ దీనిని సకృత్తుగా పొందవచ్చు నని.

దారాపత్యధనకనకవస్తువాహనాదులను చాలా జన్మలనుంచి ఉపాసనచేయుచున్నాము. ఇపుడు వాటిని వదలుటకే వేదాంతవిచారణ చేయవలెను. భగవంతుని స్వరూప విచారణ చేయుట ఎందుల కనగా పై వాటిని అనగా సంసారబంధమును తొలగించుకొనుటకే.

పునరావృత్తన రహితంగా బంధం పోవాలంటే జ్ఞానంవల్ల—అద్వైతులు చెప్పినట్లు-రజ్జు—సర్పములోనియథార్థజ్ఞానము సాక్షాత్కార మైతేనే కుదురుతుంది. సేతుదర్శనంచేత పాపం పోయినట్లు, గరుడ మంత్రస్మృతిచేత సత్యమైనపాముౘిషం పోయినట్లు గాదు. వీటి అన్నిటి యందును పునరావృత్తన భయం ఉన్నది.

సచ్చిదానందవస్తువును 'నేను'గా గుర్తిస్తే మరణంలేని అమృతత్వం లభిస్తుంది. అట్లు గాక చచ్చేటటువంటి దేహేంద్రియములను నేనుగా గుర్తిస్తే ఇక చచ్చా డన్నమాటే.

వాడు వాడు చేసికొన్నపుణ్యముల ననుసరించియే గురువులు దొరుకుతారు. దేహం ఆరోగ్యంగా వుండి చిత్తము ప్రశాంతముగా సత్త్వ గుణంచేత నిర్మలముగా ఉన్నప్పుడు వచ్చేతృప్తి తనస్వరూపతృప్తి గాదు. ఇది వివేకముచేత ఆత్మజ్ఞానంవల్లనే కలుగును. సమాధిలోని తృప్తి గూడ నిజమైన తృప్తి గాదు. ఆ వైలక్షణ్యము బాగుగా గ్రహించవలెను.

శాస్త్రము చెప్పునట్టి కేవలకర్మసాధనములవల్ల సంసారము తొలగదు. కాని ఆ సాధనములను ఆశ్రయించ కుండా వుంటే అది తొలగనే తొలగదు, అయితే ఎట్లా? ఆసాధనములవలన కలిగే చిత్తశుద్ధివలన వివేకప్రజ్ఞవలన అసలు కర్తృత్వభోక్తృత్వ సంసారమే నాకు ఎప్పుడూ లే దని తెలుస్తుంది. నే నెప్పుడూ సంసారము లేనివాణ్ణే.

"న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః।
న కర్మఫలసంయోగం స్వభావ స్తు ప్రవర్తతే॥

న కరోతి, న కారయతి చ దేహీ, కర్తృత్వం కుర్వన్ కారయం శ్చ ప్రవర్తత ఇతి, ఉచ్యతే–స్వభావస్తు, స్వో భావః స్వభావః, అవిద్యా లక్షణా ప్రకృతి, ర్మాయా ప్రవర్తతే, "దైవీ హ్యేషా గుణమయీ" త్యాదినా వక్ష్యమాణా

అవ. పరమార్థతస్తు-

"నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః।
అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః॥

"జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః।
తేషా మాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥

గీత ౫వ అధ్యాయం శంకరభాష్యం చూడుడు

"జ్ఞానా దేవ తు కైవల్యమ్" జ్ఞానము మోక్షమును కలిగింపదు. అది అజ్ఞానమును మాత్రమే తొలగించును. ఆత్మ ఎప్పుడు సిద్ధమై యున్నది.

అద్వైతసిద్ధాంతము:– ప్రపంచమిథ్యాత్వముతో ఆత్మసత్యాను బోధము కలిగి ఉండుట.

శ్రీశంకరులవారు గీతాభాష్యముద్వారా ఉపనిషత్సమ్మతమైన భగవత్హృదయమును బాగా ప్రకాశింపజేసినారు. వక్తతో పరిచయం ఉన్నపుడే అతని ఉపదేశముల భావము మనము తెలిసికొనగలము. సాక్షాత్విష్ణ్వంశసంభూతులైన వ్యాసాచార్యులవారి హృదయము సాక్షాత్ శంకరులైన శ్రీశంకరాచార్యులవారు బాగా ఎఱుగుదురు.

జలములో తరంగము ఏర్పడినట్లు చిద్రూపమైన ఆత్మయందు చిత్తము ఏర్పడినట్లు తోచుచున్నది. చిత్తము ఎప్పుడును బహిర్ముఖమై

నకనకవస్తువాహనాదులమీదికే సహజంగా పోతూ వుంటుంది. బుద్ధి అంతర్ముఖ మైతేనే భగవంతునిదర్శన మౌతుంది. విషయభోగవాంఛలు ఉపశమించినపుడే బుద్ధి అంతర్ముఖ మౌతుంది.

చిత్తము యొక్క సంకల్పములు ఉపశమిస్తే అదే చిద్రూపంగా ప్రకాశిస్తుంది. యోగాభ్యాసాన్ని బ్రహ్మానుభూతికి ఉపయోగించుకొన వలెను. యోగాభ్యాసకాలములో తీవ్రమైన సంయమనస్థితియందు అణిమాద్యష్టసిద్ధులు వచ్చినను వాటిని దాటి గమ్యస్థానమే చేరవలెను.

క॥ లోకంబులు లోకేశులు,
లోకస్థులు తెగినతుది నలోకంబగు పెం
జీకటి కవ్వలి నెవ్వం,
డేకాకృతి వెలుగు నతని నే సేవింతున్॥"
————————"సమస్తాంతరాత్మ

ఆ॥ డై వెలుంగు,వాని కచ్చిన్నునకు, భగ
వంతునకు, తనూజపశుని వేశ
దారసక్తులయిన వారి కందగరాని,
వాని కాచరింతు, వందనములు॥"

బుద్ధి తీసికొన్న ఆకారాన్నిబట్టే మనకు సుఖదుఃఖములు వచ్చు చున్నవి. కాని కనబడేవస్తుస్వభావాన్ని అనుసరించి కాదు. నన్ను చూచినప్పుడు నేను ఏవిధంగా నాబుద్ధికి గోచరిస్తానో ఆవిధంగానే ఆ బుద్ధి నిశ్చయించుచున్నది. ఎట్లనగా నేను బ్రహ్మచారిని. నేను గృహస్థును అని తన బుద్ధియే స్వర్గబ్రహ్మాదిలోకముల ఆకారమును తీసికొని తత్తదనుభవములను పొందుచున్నది. నీబుద్ధిలోని పుణ్యపాపములే స్వర్లోకాలను సృజించి, తత్తత్భోగ్యవస్తువులను గూడ సృజించి నిన్ను భోక్తగ తయారుచేయుచున్నవి.

'నేను'కు కర్తృత్వారోపణ లేనపుడు అది చేసిన పుణ్యపాపము లకు ఫలము ఉండదు. అనగా తత్త్వవేత్త అయిన 'నేను'కు చిత్తమే లేదు. చిత్ + జడగ్రంధియే చిత్తము. ఆ చిత్తమే తత్త్వజ్ఞునకు విచారణవల్ల చిత్తము లేదనే తేల్చును. చిత్ + జడము కలియుటకే వీలు లేదు; అవివేకము, అజ్ఞానమువల్ల తప్ప. లోకములోని సర్వపుణ్యపాపములు అజ్ఞానమువల్ల ఏర్పడినవే. చిత్తమే లేనపుడు అక్కడ మరేమున్నది? చిన్మాత్రమే ఉన్నది. సత్యవస్తువుమీదనే భ్రాంతి వచ్చుచున్నది. ఉన్న 'త్రాడు'మీదనే "పాము" అను భ్రాంతి. ఏభ్రాంతి లేనపుడు సత్యమే ఉంటుంది.

ప్రశ్న:— అయితే ఈభ్రాంతి ఎవరికి?

"య ఏష పురుషో మాయాపరిభ్రామితః"

"విశ్వం పశ్యతి" శ్రీశంకరులవారిదక్షిణామూర్తి శ్లోకము చూడండి. అజ్ఞానము కలవానికే భ్రాంతి.

మరణభీతి తీసివేసికొనుటకే బుద్ధిమంతులు వేదాంతవిచారణ చేయుచున్నారు కొందరు రసాయనఔషధములు పుచ్చుకొనుచున్నారు. కొందరు యోగమును అవలంబించుచున్నారు. వివేకవంతులు కొందరు వేదాంతవిచారణచేసి మరణభయము తీసివేసికొనుచున్నారు. వీటిలో వేదాంతవిచారణయే మరణమును తొలగించుకొనుటకు సరియైన మార్గము. ఇదియే ఉపనిషన్మార్గము; భగవదాదేశము. దీనివల్లనే తప్పక అమృతత్వము లభించుచున్నది. దేహము 'నేను' క్రింద అర్థముచేసికొనడమే చావునకు మూలము.

చిత్తము గైకొనే ఆకారమువల్లనే జన్మలు, స్వర్గనరకములు వచ్చుచున్నవి. చిత్తము అజ్ఞానమువల్లనే పుట్టుచున్నది. ఆ అజ్ఞానము ఆత్మజ్ఞానమువల్లనే పోవును. అట్టిజ్ఞానము వేదాంతవిచారణవల్లనే కలుగుతుంది.

"నాన్యః పంథా విద్యతేఽయనాయ"

మేల్కొన్న వెనుక స్వప్నము లేనట్లు జ్ఞానమువల్ల అజ్ఞానము తొలగుతుంది.

దేవతలు గూడ పాపము! అమృతమువలన మరణము లేకుండా చేసుకొందా మనుకొన్నారు. బ్రహ్మవేత్త అయిన గురువుయొక్క సేవజేసి తత్త్వవిచారణచేత ఆత్మసాక్షాత్కారము పొందవలెను.

మూడుకాలములయందు త్రాడు త్రాడే గాని సర్ప మెప్పుడూ లేదు.

"కాలత్రయే యథా సర్పో రజ్జౌ నాస్తి తథా మయి।
అహంకారాదిదేహాంతం జగ న్నా స్త్యహ మద్వయః॥"
ఆత్మబోధోపనిషత్తు

అట్లే చిత్తము పుట్టనపుడు గాని, పుట్టినపుడు గాని, ఉపశమించి నపుడు గాని నీవు ఎప్పుడూ, "సముడవు, అద్వయుడవు, అమృతుడవు, సదా ఆనందఘనుడవు, చిన్మాత్రుడవు, కేవలసత్‌స్వరూపుడవు" అయి ఉన్నావు. ఇది బ్రహ్మాత్మజ్ఞానమువల్లనే తెలియగలదు.

విషయములు అను అద్దమునందు నాముఖప్రతిబింబము కనబడు చున్నది. అద్దము పోయినపుడు గూడ నాముఖము యథాపూర్వముగానే యున్నది. మరేమీ కాలేదు. అలాగే విషయములు పోయినను నా ఆనందమునకు ఏమియు లోపము లేదు. చేతనుడనగు నాయందు సుఖ దుఃఖములు కనబడుచున్నవి గాని విషయములగు గృహారామక్షేత్రము లైన అనాత్మలందు లేవు. ఆనందము ఏ విషయములందు కనబడినను అది నాలోని ఆనందమే. ఆవిషయములు పోయినను, ఉన్నను నా స్వరూపమైన ఆనందమునకు ఏమియు లోపము లేదు.

పరలోకసుఖములకొరకు పుణ్యము చేసెద ననుకొన్నచో ముందు మరణమనే అమంగళమును ఒప్పుకొనుటయే. మోక్షముకొరకే సర్వ

పుణ్యములు నిష్కామముగా శ్రద్ధగా చేయవలెను. నాస్వరూపః
తెలియకపోవుటచేతనే, నేను నన్ను దేహేంద్రియములుగా భావిం
నిరంతరము వాటిరక్షణయందు నానావస్థలు పడుచున్నాను. అవి బా
న్నచో నేను బాగుండెద ననుకొనుటయే భ్రాంతి. ఆ అజ్ఞానము పోగొ
కొన్నచో నిర్విశేషమైన నా ఆనందస్వరూపముతో నేను సర్వదా సు
ముగా ఉండగలను. స్వస్వరూపస్థితియే అభయప్రాప్తి. అంతయే గా
భ్రాంత్యారోపితమైన అసత్యవస్తురక్షణచేత అభయప్రాప్తి రాద
అనృతాభినివేశమువలననే దానికి అనుగుణమైన మన చిత్తముయొక్క
ప్రవర్తన మంతయు సంభవించుచున్నది.

స్థూలదేహమునందు నే నను భావము వచ్చినపుడే సుఖదుఃఖాః
భవము గల సకలసంసారము వచ్చుచున్నది.

ఈ సుఖదుఃఖములుగల సంసారము పూర్వస్థితిలో గూడ అహ
కారమునందు ఉండనే ఉన్నది. ఎట్లనగా తండులములలో పూర్వతే
అన్నమయ్యే గుణము ఉన్నందువలననే మనం అన్నంకొరకు బియ
మును తెచ్చుకొనుచున్నాము. సుషుప్తిలో మనము అహంకారమున
పొందదగిన అజ్ఞానముతో ఉన్నాము గనుక మేలుకొనగానే మనవ
అహంకారముతో విజృంభించుచున్నాము. కనుక మనము స్థూలదేహః
దాత్మ్యముతో వుండి, అనగా "నేను" దేవదత్తుడను అని, యజ్ఞము
యోగాభ్యాసము, సన్న్యాసము ఎన్ని చేసినను ముక్తి రాదు. కారణ పే
మన, స్థూలదేహములోని "నేను"ను తీసివేసికొనకుండ ఏమి చేసినన
నిష్ప్రయోజనమే. అయితే ఇది ఎక్కడనుండి వచ్చినది? ఇది అహమ
కారములోనే ఉన్నది నా కేమియు తెలియలే దను అనుభవములో
ఇమిడియున్నది. "నాహం కించి దవేదిషమ్." నిజములో దానికి గూ
నేను సాక్షిగా ఉన్నాను. నాకు తెలియబడే అజ్ఞానం గాని, మరి యే
వస్తువు గాని నన్నేమియు చేయలే దను విమర్శనజ్ఞానమే కృతార్థతక

ము_క్తికి కారణము. సాక్షికి తెలియబడే లాభనష్టములవల్ల మంచిచెడ్డల వల్ల సాక్షికి ఏమియు సంబంధము లేదు. ఇదియే తెలిసికొనవలసినది. ఇదియే ఆత్మజ్ఞానము.

## 2. సాక్షి భావము

ఇపుడు దేహమునకు నేను సాక్షిగా వున్నాను. గనుక దాని జరావ్యాధిమరణములకు నేను సాక్షిగనే వున్నాను. వానికి నాకు సంబంధము లే దనే జ్ఞానము, ఆనిశ్చయమే కావలసినది. ఈ అనర్థ మంతయు విషయసంయోగము విషయతాదాత్మ్యమువలననే వచ్చు చున్నది.

1. జీవభావము
2. సాక్షి భావము
3. అఖండాద్వైత భావము

అఖండాద్వైతభావములో సాక్షి + దృశ్యము ఏదియు లేకుండ పోవును. సాక్షిలోని చైతన్యమువల్లనే జడములైన సాక్ష్యములు (విష యములు) అన్నియు భాసించుచున్నవి.

నీవు చత్తు వని ఎవరైన అన్నప్పుడు, నేను చచ్చేవాడనుకాను, నేను అమృతుడ అను నిశ్చయము, అనుభవము కలిగియుండుటయే విద్వదనుభవము.

కర్ణుడు = సూతపుత్రుడు
మనుష్యుడు = చచ్చేవాడు

నిజంలో కర్ణుడు సూతపుత్రుడు కాదు. మనుష్యుడు చచ్చేవాడు కాడు "అజో నిత్య శ్శాశ్వతోయమ్" అని తేలినపుడు అప్పటివఱకు ఉన్న అజ్ఞానమును తలంచి పైగా లోపల నవ్వుకుంటాడు. ఈజ్ఞానం ఎట్లా కలుగుతుంది?

వేదమాత—తల్లి

తత్త్వవేత్త అయిన గురువు—తండ్రి

వీరి అనుగ్రహంవలన చిత్తముయొక్క వికారములు ఉపశమించును. అపుడు చిన్మాత్రమే మిగులును. చిత్తవికారములు ఉపశమించుట ఎట్లన? చైతన్యమే లేదని తేలవలెను. తర్వాతి అసలు చిత్తమే లేదు అని తేలును.

చిత్రపటములోని వంట, ఫలాహారము వంటవాళ్లవలె ఈ ప్రపంచమంతా మిథ్య అని తెలియవలెను. అపుడు వీనికి అందులోని ఫలాహారములు తినవలె నని సహజముగానే ఉండదు.

వేదాంతములో తెలియబడు బ్రహ్మము సర్వుల అనుభవములో స్వయముగా ప్రకాశించు ప్రత్యగాత్మయే.

"అహ మాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః" గీత.

అని సాక్షాత్ భగవానుడే చెప్పుచున్నాడు. నేనే స్వయముగా సుషుప్తిలోను, సమాధిలోను త్రిపుటరహితముగా ప్రకాశించుచున్నాను.

"స్వయంజ్యోతిః"

త్రిపుటి అనగా చూచేవాడు చూడబడేది చూచేసాధనము.

"ఏత త్తది త్యనిర్దేశ్యాయై నమః" (త్రిశతి)

మిథ్యాభినివేశంవల్లనే అజ్ఞాన మనే మద్యపానంచేత కైపెక్కి విషయములను కోరుట సంభవించుచున్నది.

శ్లో॥ యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవతే।
ఆద్యంతవంతః కౌంతేయ, న తేషు రమతే బుధః॥

దీనికి శ్రీశంకరభాష్యం చూడండి.

బుధః—వివేకీ—అవగత పరమార్థతత్త్వః

అత్యంతమూఢానా మేవ హి విషయేషు రతి ర్దృశ్యతే, యథా పశుప్రభృతీనామ్॥

వస్తుస్వభావము మరొకదానివలన తీసివేయుటకు గాని, తెచ్చి పెట్టుకొనుటకు గాని, అడ్డగించుటకు గాని వీలులేనిది.

ఆత్మ తానంతట అదే వుంటూ స్వయంగానే ప్రకాశిస్తూ (స్వయం జ్యోతిః) నిరంతరం దుఃఖస్పర్శయే లేని ఆనందఘనమే తాను అయివున్నది. "స ఏష పరమో ఆనందః" ఇదంతయు మన అనుభవానికి విరుద్ధముగా వున్నది. దీనిని సరి జేయుటకే భాష్యకర్తలైన శంకరభగవత్పాదులు వచ్చినారు. వారు వీనిని చక్కగా మీమాంసాన్యాయముల ననుసరించి, విమర్శించి కేవల అనుగ్రహముతో ఆ అమృతమును మనకు అందించుచున్నారు.

"నైతేషాం వాక్యానాం పౌనరుక్త్యం చోదనీయమ్। తత్ర యదే వాత్మవిషయం కించి దుచ్యతే, త దేతస్మాద్వాక్యార్థా న్నాతిరిచ్యతే, కించి చ్ఛబ్దతః పునరుక్తం, కించిదర్థత ఇతి. దుర్బోధత్వా దాత్మవస్తునః ప్రసంగ మాసాద్య శబ్దాంతరేణ తదేవ వస్తు నిరూపితమ్।

శ్రీశంకరులు.

ఈ వాక్యములు మరల మరల చెప్పబడినవని తలంచవలదు. అచ్చట ఏ ఆత్మవిషయం చెప్పబడినదో అది శబ్దమువలన మరియు అర్థమువలన రెండు విధములుగా పునః పునః వివరించబడినది. ఆత్మ వస్తువు దుర్బోధము కనుక అనేక వాక్యములతో విశదముగా నిరూపించబడినది.

బుద్ధిని ఉపయోగించవలనసిదే గాని దాని పెత్తనం ఆత్మ స్వరూప నిర్ణయానికి ఉపయోగపడదు. ఆత్మకు అడ్డుతీసివేయుటకే బుద్ధిని ఉపయోగించవలె, దానికి ఆత్మస్వరూపమును నిర్ణయించుపని పెట్టవలదు. ఆత్మ 'ఇట్లున్నది, అట్లున్నది' అని నిర్ణయించవలదు.

సుషుప్తిలో చూచుకొనుము. అచ్చట ఉన్నది ఉన్నట్లుగా చూచుచున్నావు. హాయిగా ఉన్నానంటావు అది 'ఇట్లున్నది, అట్లున్నది'

అనజాలవు. సుషుప్తిలోను, బ్రహ్మానుభవమునందును అనుభవము ఒకటే గాని, సుషుప్తియందు అజ్ఞానమువలన నా కేమియు తెలియలేదనుభావము ఉన్నది. నా స్వరూపము సమ్యగ్విధంగా తెలియనందువల్లనే దుఃఖము. అదియే స్వాత్మాఽజ్ఞానము. దానిని శాస్త్రాచార్యోపదేశవివేకజ్ఞానముచేత పోగొట్టుకొనుటవల్లనే ముక్తి.

నేను భక్తుడను అనుకొనుట, నేను శిష్యుడను అనుకొనుట, ఇవియే స్వరూపవిస్మృతికి కారణము. ఆత్మసాక్షాత్కారమువరకు అవి ముఖ్యముగా ఉపయోగపడును. తర్వాత ఆత్మానుభవములో అవి అంతర్హితములై అద్వితీయ ఆత్మప్రకాశమే మిగులును.

శ్లో॥ న మే బంధో న మే ముక్తిః న మే శాస్త్రం న మే గురుః।
మాయామాత్రవికాసత్వాత్ మాయాతీతోఽహ మద్వయః॥

అయినను, గురువునందును, ఈశ్వరునియందును భావాద్వైతమే గాని క్రియాద్వైతము ఉండకూడదు.

ఆత్మానాత్మవివేకమే వివేకము. అన్నములో నలుసు. తీసివేయగల బుద్ధిమంతుని వివేకి అనదు శాస్త్రము. పదును గలిగిన బుద్ధియే ఆత్మదర్శనమునకు ఉపయోగపడును. పదునులేని బుద్ధి ఆత్మదర్శనములో మొక్కబోవును. వజ్రసారముగా ఉండవలెను పదును. ఊహాపోహాత్మకమైన తర్కము బలంగా వుండవలెను. శాస్త్రాచార్యోపదేశము ననుసరించి ఆత్మతత్త్వమును ఆలోచించడమే గొప్పతపస్సు, "తప" ఆలోచనే.

"త మేతం వేదానువచనేన యజ్ఞేన దానేన తపసాఽనాశకేన" ధర్మమునకు ఇతరఫలములు కేవలబహిర్ముఖులకు ప్రరోచనార్థము చెప్పబడినవి

సర్వమతసామరస్య మనగా ఎదుటవాని మతమును రక్షించుచు తనమతమును తాను జాగ్రత్తగా రక్షించుకోవడమే.

ఆత్మదర్శనమునకు సాధనచతుష్టయసంపత్తితో కూడిన విశుద్ధమైన బుద్ధియే సాధనము.

ఆత్మానాత్మవిభాగముకంటె దృగ్దృశ్యస్వభావమును గమనించుటయే శ్రేష్ఠము. ద్రష్టృ–దర్శన–దృశ్యములలో దృక్స్వభావము సర్వత్ర కలిసివున్నది.

వర్ణాశ్రమధర్మప్రకారము ఎవనిస్వధర్మమును వాడు ఆచరించవలెను. వాడే భగవంతునకు ప్రీతిపాత్రుడగును. శ్రుతి స్మృతులు ఈశ్వరునియాజ్ఞలు. అందులోనివే, వర్ణాశ్రమధర్మములు. గురువులు చెప్పినపనిచేస్తే వారు సంతోషించెదరు. తర్కము లేనిచో జీవితమే నడవదు.

విశుద్ధమైనపదునుగలబుద్ధి అను పలుగుచేత ఆత్మస్వరూపమును మెలకువగా తీయవలెను.

వేదాంతములో బ్రహ్మమును దాచినారు. అనగా బ్రహ్మము ఉపనిషద్వాక్యములలో నిక్షేపింపబడియున్నది.

"తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి"

"ఔపనిషదుడైన పురుషునిగూర్చి అడుగుచున్నాను."

అని శిష్యుడు అడుగుచున్నాడు

ధర్మముయొక్క స్వరూపము వేదపురుషుడైన పరమేశ్వరునికి తప్ప మరొక్కరికి, వారెంతగొప్పవారైనను, స్వయముగ తమబుద్ధికి తెలియడానికి వీలులేదు. అందువలననే గురువులు "వేదమొక్కటియే మాకు శరణము" "వేదైకశరణావయమ్" అని చెప్పుచున్నారు.

భగవద్గీత–అర్జునుని సందేహము.

సొంతనిర్ణయము–భగవంతుని తీర్మానము. వీరు నావారు, నేను వీరివాడను. అను భావాన్ని తొలగించుకొన్నవారికే ధర్మస్వరూపము సరిగా అర్థము కాగలదు.

తన కుమారునకు బ్రాహ్మణకుఱ్ఱవానికి కలిగిన వివాదములో ప్రహ్లాదుడు, తనకుమారు డను మమకారమును పెట్టుకొనక ఆ వివాదము లోని ప్రతిజ్ఞప్రకారము తనకుమారుని ప్రాణము పోవుచున్నను ధర్మానుసారమే తీర్పుజెప్పుట గమనించతగినది.

"వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ।
తాసు తేష్వ ప్యనాసక్త స్సాక్షా ద్భర్గో నరాకృతిః॥"

బ్రహ్మానుభూతి వచ్చుట అందరికీ సమానమే గాని అందుకు సాధనమైన ధర్మస్వరూపము వేరు వేరుగా ఉన్నది.

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥

భగవద్గీతలో భగవానుని వాక్యము.

రోగులలో ఏమందు ఎవడు తినవలెనో వాడే ఆమందు తిన వలెను. ఒకనిది మరొకరు తినుటవలన అపాయము వచ్చునని శాస్త్రము చెప్పుచున్నది. ధర్మము ఔషధసేవవంటిది. మోక్షము ఆరోగ్యము వంటిది. ధర్మమును ఆచరించవలెను. మోక్షమును అనుభవించవలెను. ఔషధసేవ దేహేంద్రియములకు చేసినచో ఆరోగ్యమును "నేను" అనే వాడు అనుభవించును. భగవద్భక్తి కలవానికి భగవత్కటాక్షము ఎపుడును ఉండును. అట్టివానియొక్క "యోగక్షేమములను వహింతును" అని భగవంతుని ప్రతిజ్ఞ

ఉపాధులఎక్కువ తక్కువలవలన వస్తుస్వరూపము తెలియదు. మహిమలు మొదలగువాటిచేత మనము భ్రాంతిలో పడకూడదు. మహిమ లయందు బుద్ధిని ప్రసరించనీయ కూడదు. శ్రీకృష్ణభగవానుడు ఉద్ధవు నకు ఉపదేశించిన సంగతులు చూడవలెను.

భాగవతము ఏకాదశ స్కంధము.

శ్రద్ధాభక్తులతో గురువులను సేవించినయెడల వారు ఉపదేశించు తత్త్వబోధలు సాధనచతుష్టయసంపత్తి గలవానికి, ఈశ్వరానుగ్రహము

కూడ తోడ్పడినచో, చక్కగా స్వానుభవానికి రాగలవు. బహిరంగ సాధనలకంటే అంతరంగసాధనలు చాలా ముఖ్యము. అజ్ఞానమును తొలగించుకొని ఆత్మజ్ఞానమును పొంది కృతార్థుడు కావలెనే గాని పక్షి జన్మలలో గూడ సహజంగా వుండునట్టి ఆకాశగమనాదులు మొదలగు మహిమలందు ఆసక్తిని పెట్టుకొనగూడదు.

నిర్దోషమైన పుణ్యములు గల శిష్యుని ప్రజ్ఞయందే గురువులసదుపదేశములు చక్కగా అనుభవానికి రాగలవు.

ఉదా:- ఇంద్రుడు-విరోచనుడు.

సద్గురువుల ఉపదేశము ఒక దీపముతో మఱియొక దీపమును వెలిగించునట్లే ఉండును. కల్పవృక్షము ఆశ్రయించినవానిని భాగ్యవంతుని చేయగలదు గాని తనవలె కల్పవృక్షముగా చేయలేదు. అహో! గురుకరుణ.

అజ్ఞానబంధురమైనట్టియు, జన్మ-జరా-మరణము లను భయంకరకూపములు గలిగినట్టియు, అహంకార మను వ్యాఘ్రము కలట్టియు సంసారగహనమునుండి తప్పించుకొని నిరంతరభద్రమైన అమృతస్థానమునకు గురుకరుణచేత చేరగలము.

సచ్చిదానందమై స్వప్రకాశాత్మకమైన చైతన్యమహిమచేతనే ప్రపంచమును అందలిజడవర్గమును అంతయు చూచుచున్నాము. కాని మనము ప్రపంచమును చూచుచున్నా మందుమే గాని బ్రహ్మమును చూచుట లేదని చెప్పుదుము. అసలు దీపప్రకాశములేనిదే వస్తువులు కనబడవు. వస్తువులు కనబడుచున్న వందుమే గాని దీప ప్రకాశమును గుర్తించుట లేదు.

ధర్మాధర్మములు వాటిస్వభావముచేతనే, ఫలితములను ఇచ్చుచున్నవి. దేవతలమధ్యస్థము ఇందులో అనవసర మని జైమినిమహ

క్ష్యాదుల ఉద్దేశము. సర్వకర్మఫలాధ్యక్షుడైన పరమేశ్వరుని, లెక్కకు తీసికొనకయే వీరు మాటలాడెదరు.

స్వధర్మముచేత చిత్తము పవిత్రీకృతము కావలెను. అపుడు ఆత్మ జ్ఞానము లభించుటకు అవకాశమున్నది.

భరతఖండమునకు ఒకప్రత్యేకమైనట్టి శాశ్వతమైన ఐశ్వర్యమున్నది. అదియే మోక్షసంపత్తి. 'నేను, నేను' అని జీవభావములో సుఖ దుఃఖాలు అనుభవించు వీడు 'వేదాంత మను' 'సైన్సు'చేత అఖండసచ్చిదానంద మను మహైశ్వర్యమును అనుభవించుచున్నాడు.

భగవంతుని ఆజ్ఞలను నెరవేర్చుటవల్లనే భగవంతుని అనుగ్రహమునకు మనము పాత్రుల మగుదుము. కాని వేరేవిధంగా భగవంతునికి ఏమి చేసినా ఆయన సంతోషించడు. భగవదాజ్ఞను త్రికరణశుద్ధిగా అనుసరించుటవల్లనే ఆయన సంతోషించును. భగవదాజ్ఞ అనగా ధర్మమే; స్వధర్మమే.

మానవుడు ప్రపంచములో ఉన్న వస్తువులను మామూలు రీతిగా కాక శాస్త్రరీత్యా అనగా "సైన్సు"చేత వాటిని విశేషప్రయోజనముకొరకు తయారుచేసుకొని అనుభవించుచున్నాడు. అట్లే శరీరేంద్రియాదులను వేదోక్తప్రకారంగా సంస్కరించుకొన్నచో బ్రహ్మలోక పర్యంతము భోగములను సాధించుకొని అనుభవించవచ్చును. అచ్చట ఇంటింటిలో కల్పవృక్షములు, కామధేనువు అమృతము కాలువలుగా అనుభవించ గలము. ఇదంతయు "ఇద మర్థమే" "అహ మర్థము" వేరే ఉన్నది. వేదాంతముచేత అనగా ఉపనిషత్తులచేత "అహ మర్థము"ను సంస్కరించుకొని అనంతమైన సుఖమును శాశ్వతముగా అనుభవించవచ్చును.

వేదవ్యాసులవారు వేదాంతసూత్రములను ఎత్తుగడజేసినప్పుడే "అథ" అని ఒక కవాటము "గేటు" నాలుగు గుణములు కలిగినది పెట్టినారు, అవి ఉంటే లోపలకు రమ్మన్నారు. అజీర్ణము, నాలుకఅరుచి,

ఉన్నవారు పంచభక్ష్యపరమాన్నము లున్న గదిలోనికి వెళ్లినచో ఏమి అనుభవించగలరు? వేదాంతవిచారణ జేయుసమయములో నైనా ఆ నాలుగు గుణాలు అలవరచుకొనివుంటేనే కొంత మంచి దని కలిలో అనుమతించినారు. అదియే సాధన చతుష్టయ సంపత్తి.

అఖండానందము స్వయంజ్యోతియు నైన సత్యమైన పరమాత్మయే నేను. కాని పామరుడు అజ్ఞానమధిరాంధతచేత కొమ్మను బట్టుకొని "ఇప్పటికి వదులు తర్వాత వస్తాను" అన్నట్లు బ్రహ్మానందము నకు చాలదూరుడై ఉన్నాడు.

బ్రహ్మవేత్తలు చిన్నపిల్లలవలె ఆకలిదప్పులు లెక్క జేయకుండ క్రీడాసక్తులై ఉన్నట్లే, పామరులుకూడ విషయభోగానందవారాశిలో మునిగి అందులోనే సక్తులై ఉంటారు. సచ్చిదానందలక్షణమైన బ్రహ్మ సక్తతచేత ఆకలిని మరిస్తే గొప్పవిషయమే గాని విషయభోగాసక్తత చేత ఆకలిని మరిస్తే ప్రయోజనం ఏమియు లేదు. విషయాసక్తుడైన వాడే అన్నియు మరచుచున్నాడనగా ఇక బ్రహ్మసక్తుని విషయం చెప్పవలెనా!

ఒకేసుఖము, అభ్యుదయముగా, నిశ్శ్రేయసముగా అనుభవింపబడుచున్నది. అభ్యుదయము అనగా పరాధీనమై వానివానియిష్టమైన వస్తువులద్వారా సుఖము అనుభవించుటయే. అది స్వతంత్రమైన కేవల సుఖము గాదు నిశ్శ్రేయససుఖ మనగా అది కేవలమై, స్వవశములో వుండునట్టి అవ్యయమైన నిరంతరసుఖము; స్వస్వరూపముగా ఉండునట్టి శాశ్వతానందఘనము.

వేదపురుషనిరక్షణ అనగా వేదముయొక్క ఆజ్ఞలను నిర్వర్తించుటయే. వేదస్వరూపపరిపాలన వేదోద్దేశానుసరణ, రెండూ వుండవలె

నిర్వికార అఖండ ఆత్మతత్త్వాన్ని నేను నిరంతరము అనుభవించుచున్నాను. కనుక నాశరీరింద్రియాదుల బాగోగులవల్ల నాకేమియు లోపము లేదు.

అది గాఢాంధకారము, నట్టదివి, పైగా అమావాస్యరాత్రి, అందలిబాధలు, సూర్యోదయమైనది. ఇక అప్పుడు ఆ అంధకారము ఎందులోనికి పోయినది? అలాగే అజ్ఞానము ఆత్మజ్ఞానము రాగనే అంతర్హిత మవుతుంది.

సచ్చిదానందఘనమైన "నేను" ఈదేహేంద్రియాది సంఘాతము నందు కలిసిపోయి వీనిసత్తా స్ఫురణలు వానియందు భావించి వాని హెచ్చుతక్కువలవల్ల ఆ బాగోగులను పామరుడు తనయందు భావించు కొని, సుఖదుఃఖములను అనుభవించుచున్నాడు. ఉన్నది, తెలియు చున్నది. అనుభావము మాత్రము, వస్తువులరాకపోకలవల్ల ఏమాత్రము మారుట లేదు. ఉపాధిసంబంధములవల్ల ఆకాశమునందు హెచ్చు తక్కువలు నిర్ణయించకూడదు ఉండుట, ప్రకాశించుట, పరమాత్మ స్వరూపమైన తనప్రత్యక్తత్త్వమునకే అన్వయించును. ఈ విషయము తెలియకుండ ఉండుటలో అజ్ఞాన మొక్కటే అడ్డమై ఉన్నది, సత్యము తెలిసిన క్షణము అజ్ఞానము ఉండుటకు వీలులేదు.

అభ్యాసమువల్ల ఎంతమహత్తరమైనది కూడ కాలక్రమేణ సాధ్య మౌతుంది. అలాగే బ్రహ్మవిద్యకూడ స్వాధీన మవుతుంది. ఏపాత్ర యందు మనవస్తువు వినియోగపడుతుందో ఆఫలితము మనకు వస్తుంది.

"విప్రునికుక్షియందు ఎవనియన్నము వేదాభ్యాసముచేత జీర్ణ మగునో, ఆ అన్నము, అన్నదాతయొక్క పూర్వతరములవారిని తరు వాత పదితరములవారిని తరింపజేయును"

"కుక్షౌ తిష్ఠతి యస్యాన్నం వేదాభ్యాసేన జీర్యతే।
తత్తారయతి దశపూర్వాన్ దశాపరాన్॥"

బ్రహ్మవిద్య ఎందు కనగా తనకా పద లేకుండాజేసికొనుటకే. దేహము నే ననుకొంటున్నాము గనుక దీనిని జాగ్రత్త చేసు కొంటున్నాము.

ఏనాడైతే దేహము నేను కాదని స్పష్ట మౌతుందో ఆనాడే దేహముయొక్క యోగక్షేమములజాగ్రత్త క్షీణించును. తనను ఎవరుగా అనుకొంటున్నాడో వానినే నిరంతరం రక్షించుకొనుచున్నాడు. ఇది సహజము.

దుఃఖము లేని సుఖమే మన అందరిగమ్యస్థానము మన మా మార్గములో వెళ్ళే బాటసారులము; బయలుదేరిన ఉద్దేశము మరచిపోయినాము. అజ్ఞుడు తాను ఎందుకు వెళ్ళుచున్నాడో మరచిపోయి, తాను ఎక్కడికి పోవలయు నని అందరిని అడుగుచున్నాడు.

రాగద్వేషము లను చోరులు దారాపత్యధనకనకవాహనాదుల రూపములతో ఉన్నారు వారే మనకు విరోధులైన చోరులు. వీరిని తప్పించుకొని గమ్యస్థానము చేరుటకు కృషి చేయవలెను.

'ధనకనకవస్తువాహనాదులవల్ల నీకు సుఖము లేదురా' అని వేదాంతము చెప్పుచున్నది. వేదాంతము లను మాటలతో పిలిచి భగవంతుడు మనకు చెప్పుచున్నాడు. మన మా మాటలు చెవిని వేసుకోకుండానే మన సంసారములోని చిక్కులు తొలగించ మందుము. అయ్యో! ఆయన సంసారమే ఆయనకు బరువుగా వున్నది. సంసారచక్రము ఏ మాత్రము జారిపోకుండ అట్టే ఉంచమంటే ఆయనవల్ల కాదు. సుఖము కావాలని కోరవచ్చును గాని మనము కోరినరీతి సుఖము కావాలంటే వల్ల కాదంటాడు.

తాను పరమాత్మగా అనుభవమునకు రావడానికి తా ననుసరించవలసిన ధర్మము ఉపయోగపడుతుంది. భగవంతుని ఉద్దేశము ననుసరించి ఈ దేహమును మనకు ఎందు కిచ్చినాడో అందుకే ఉపయోగపెట్టుకొనవలెను.

వైరాగ్యమే మహాభాగ్యము ఆభాగ్యము కలవారికే వేదాంతము యొక్క ఫలితము దక్కుతుంది. శృంగి శాపము, పరీక్షిత్తు నిర్ణయము నెమరువేసుకోవాలి. (భాగవతము)

భారతీయులమగు మనము పుణ్యాత్ములము గనుకనే వాసిష్ఠ రామాయణము, వివేకచూడామణి మొదలగు వేదాంత బోధలు మనకు దక్కినవి. దుఃఖానుభవమే బంధము. శాశ్వతానందమే మోక్షము.

సర్వజీవులు తమకు హానికరమైన జన్మ-జరా-మరణములను తప్పించుకొనవలెనని ఎప్పుడును ఆలోచించుచు వుందురు. దీని విషయమై చాలామంది ఆలోచించి ఈ దేహమును గట్టిపరచుకుంటే అది నెర వేరుతుం దని తలచి తమకు తోచిన మార్గము కనిపెట్టియున్నారు; ఇంకను కనిపెట్టుచున్నారు. మాస్టరు సి.వి.వి. శ్రీఅరవిందులు మొదలగువారు "ఇడ్డెన"తిని ధ్యానములో కూర్చుంట, "డివైన్ ట్రాన్స్ఫర్మేషన్" మొదలగుసాధనములతో ఇక్కడనే ఈ దేహముతో జరామరణములు లేకుండ వుండుటకు ప్రయత్నము చేసినారు. "జాతస్య హి ధ్రువో మృత్యుః" అని చెప్పిన శ్రీకృష్ణభగవానునిమాటను వారు లెక్కచేయ లేదు. ఈపద్ధతి క్రిమికీటకాదులకు, పశుపక్షిమృగాదులకు గూడ తెలిసినదే. శరీరముతో అక్కఱ లేకయే మనము అట్టి అమృతత్వమును పొందే మార్గము శ్రుతిమాత చెప్పుచున్నది.

1. పుణ్యమువల్ల పుణ్యాత్ములు.
2. జ్ఞానమువల్ల పరమహంసలు.

గొప్పపుణ్యములవలన దివ్యశరీరాలతో సుఖించు పద్ధతి ఒకటి.

దేహేంద్రియాదులతో ఉండి కూడ దేహముతో సుఖించకుండ ఆత్మతోనే సుఖించేమార్గము పరమహంసలది. దీనికి ఉపయోగపడే ఉత్తమపుణ్యాలు వేరే వున్నవి. వారికే పాపపుణ్యములు తగులు లేకుండ శాశ్వతానందముగా ఉండడానికి అవి ఉపయోగపడుచున్నవి. దీనికి ఎట్లు కృషి చేయుట? 'నేను'-అనే వానిని ఉన్నది ఉన్నట్టుగా తెలిసికోవడమువల్లనే అది నెఱవేరుతుంది. అనందచైతన్యమే ఏక రసముగా ప్రకాశించుచున్న దనియు, అదియే సర్వుల అనుభవములో వున్న ప్రత్యగాత్మ అనియు శ్రుతులయొక్క ప్రధాన ఉద్దేశము.

## 3. మరణభీతి

నే ననే వానికి మరణభీతి వచ్చినది. దానిని తీసివేసికొనుటకు మరణమునకు మూలకారణము తీసివేసినచో అది శాశ్వతముగా నివారణ మగును. "అజాతస్య కుతో మృత్యుః" "నాజాతం గ్రసతే మృత్యుః, కురు యత్న మజన్మని"

ఆశయకృత సన్న్యాసము:— శరీరమును ప్రారబ్ధమునకు వదలి ఆత్మజ్ఞానమునకు ప్రయత్నించుట. ఆశ్రమసన్న్యాసమునకైనా చేయ వలసినది యిదియే.

"సన్న్యస్య శ్రవణం కుర్యాత్"

శరీరమే నే ననే భావము వల్లనే జీవభావము ఏర్పడినది. సుషుప్తిలో శరీరం నే నని లేనందువలన మరణభయం లేకున్నది. దేవతలు గూడ శరీరము నే ననుకొనియే మరణభయము తీసివేసికొను టకు బహుశ్రమపడి అమృతమునకై సముద్రమథనము చేసినారు! పాపము!

మరణభీతి కలిగినవారు శరీరతాదాత్మ్యమును అట్టిపెట్టికొనియే మరణమును తీసివేసికొనుటకు ప్రయత్నించుచున్నారు.

ఎట్లన:— నిప్పును ముట్టుకొంటే కాలినది గదా! ఆ నిప్పును విడువకుండానే కాలటం తీసివేసికొనవలె ననుటమే తెలివితక్కువ. ఆశ్చర్యము!! సుషుప్తిలో నీవు సుఖముగా వున్నావంటే అపుడు దేహము నే ననే భావన లేదు. అంతేనా!

శరీరము నే ననే భావము లేకుండా చేసికొనటమే బుద్ధిమంతుని లక్షణము.

జాగ్రత్–స్వప్న–సుషుప్తు లను మూడు అవస్థలను బ్రహ్మ దేవుడు గూడ ఆపలేడు. ఇక మనము చేయవలసిన దేమిటి? అనగా

జాగ్రదవస్థలో గూడ దేహము నే ననే భావన లేకుండా చేసికొనటమే. ఇదియే వివేకవంతునిపని. అది ఎట్లా?

తనయిల్లు అమ్మివేసినతర్వాత ఆ యింట్లోనే తాను ఉన్నప్పటికీ ఆ లాభనష్టములు తన కేమీ లేవు. ఈపద్ధతిలో మనము వేదాంతమును విచారించాలి. వేదాంతం వినడానికి నాకు తీరిక లేదంటాడు ఒకడు. మంచిదే ఎందువలన? నావాళ్లు, బంధువులు ఉన్నారు; ఇండ్లూ, వాకిళ్లూ మొద లగునవి ఉన్నవి. వారినిగూర్చి విచారించవలె.

అందుకు సమాధానము — అవి ఏవీ లే వనియే తెలిసికొనుము.

నీ వొక్కడవే ఉన్నావు. నీవే నిజమైన వస్తువు మిగతవన్నియు అబద్ధాల వస్తువులు. ఉపయోగం లేనివి; మారుతూ వుండేవి. నీవే శాశ్వతుడివి.

"అజో నిత్య శ్శాశ్వతోఽయమ్"

"బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః"

నీవే నిజమైనమేడ; చిత్రంలోని మేడ నిజము కాదు. అవసరం వచ్చినపుడు అదుకొనేదే నిజమైనమేడ. దేహము అబద్ధము. నేను నిజము. నేనును ఆశ్రయించడమంటే నేనును గురించి వేదాంత విచారణచేయుట. దేహమును ఆశ్రయించడమంటే దానిపోషణలో దాని అలంకారములో రతుడగుట. మెలకువ రాగా నా స్వరూపమును గురించి ఆలోచించాలి. ఏమి చేసినా దీనిని మరువకూడదు.

శ్లో॥ "ప్రాతః స్మరామి హృది సంస్ఫుర దాత్మతత్త్వం
సత్‌చిత్‌సుఖం పరమహంసగతిం తురీయమ్।
యత్ స్వప్నజాగరసుషుప్తి మవైతి నిత్యం
తద్బ్రహ్మ నిష్కల మహం న చ భూతసంఘః॥

శ్లో॥ "ప్రాత ర్భజామి మనసాం వచసా మగమ్యం
వాచో విభాంతి నిఖిలా యదనుగ్రహేణ।

యం నేతి నేతి వచనై ర్నిగమా అవోచన్
తం దేవదేవ మజ మచ్యుత మాహు ర్గ్ర్యమ్॥

శ్లో॥ "ప్రాత ర్నమామి తమసః పర మర్కవర్ణం
పూర్ణం సనాతనపదం పురుషోత్తమాఖ్యమ్।
యస్మి న్నిదం జగ దశేష మఖండ మాద్యం
రజ్జ్వాం భుజంగమ ఇవ ప్రతిభాసతేఽదః॥

శ్లో॥ "శ్లోకత్రయ మిదం పుణ్యం
లోకత్రయవిభూషణమ్।
ప్రాతః కాలే పఠే ద్య స్తు
స గచ్ఛేత్ పరమాంగతిమ్॥

ఉపక్రమోపసంహారములలో దేనిని గురించి ఆలోచిస్తామో మధ్యలో గూడ దానినిగురించే లెక్కవేసుకొంటాము అంటారు. ఎట్లనగా? నీ వేమి చేస్తున్నా వంటే ఉద్యోగం చేస్తున్నాను. లేక వ్యాపారం చేస్తున్నా నంటావు. ముఖము కడుగుకొనుట, స్నానంచేయుట, భోజనం చేయుట మొదలగునది అంతా వానిక్రిందనే లెక్కవేసికొందుము. ఆ ఉద్యోగమో వ్యాపారమో మానినపుడు, ఏమి చేస్తున్నా వని అడిగితే ఏమీ లేదందువు.

కృష్ణభగవానుని—కాళియమర్దనకథను చూడండి. ఆయన సర్పము మీద ఉన్నాడు గదా, నేనుకూడ ఉంటాను అంటే, అది మహామాయా సర్పము. ఆ మంత్రం తెలిసినవాడు పామును పట్టుకొని ఆడిస్తాడు. నీవు పట్టుకుంటే అది చంపుతుంది.

వేదాంతము ఉన్నది ఆత్మను విచారించుటకే. నేను గాని దృశ్యములను ఆశ్రయించుట వేదాంతవిరుద్ధము.

"స్టేజి" మీద ఆడవేషం వేసినవాడు ఎప్పుడు మగవాడే. అలాగే జీవుడు ఎప్పుడూ బ్రహ్మముగానే ఉన్నాడు.

"తరుణివేషంబు గైకొన్నపురుషుఁ డరయ పురుషుఁ డగుఁగాక, పరికింపఁ దరుణి యగునే?"

"జీవభావంబు గైకొన్నబ్రహ్మ మరయ బ్రహ్మ మగుఁగాక పరికింప జీవుఁ డగునె?"

ఈ సంగతి ఎఱిగి వ్యవహరిస్తే ఇక భయం లేదు.

"పుణ్యాత్ములు సుఖులు, పాపాత్ములు దుఃఖితులు. ఈ ఆవర్తములో ప్రాపంచికులు తగుల్కొని ఎడతెరపిలేకుండా నానావస్థలు పడుచున్నారు. వేదాంతికి ఈ రెండూ అబద్ధము.

కలలో అమృతము బంగారపుగిన్నెలో త్రాగినను, దొన్నెలో త్రాగినను, మేలుకొన్నచో రెండూ అబద్ధమే.

పుణ్యం చేస్తే మంచిజన్మ వస్తుంది.

ఇక ప్రారంభించింది ఈ మాయావిజృంభణ.

జన్మ ముందా పుణ్యం ముందా?

పుణ్యం ముందా దేహం ముందా?

వినేవాని తాహత్తు ననుసరించి శ్రుతి చెప్పుతుంది. సత్యనారాయణవ్రతం చేస్తే మోక్షం వస్తుంది; మొదలగునవి.

మరొకటి? నేను పెండ్లి చేసుకొంటే మంచిదా? అనే ప్రశ్నవలె ఎవరికి తెలియాలి? నీకే తెలియాలి. ఇదంతా హేతుఫలాపేక్షోభ.

"సోక్రటీసు"ను ఒకడు అడిగా డట:— "నేను పెండ్లి చేసుకొంటే మంచిదా? బ్రహ్మచారిగా వుంటే మంచిదా? అని

వారి జవాబు:— "రెండు విధముల నీకు విచారమే కలుగుతుంది"

ప్రపంచములో భోక్తృభోజ్యభావములు గల ప్రాణు లన్నియు పుట్టి చచ్చునట్టివే.

తనశరీరం అసలు లేదని తెలిసేంతవరకు, ఈశ్వరసేవ, గురుసేవ, తత్త్వవిచారణ చేస్తూనే వుండాలి. శరీరం లేదని తెలిపినదానికి

గుర్తు ఏమిటి? దానికి కలిగిన సాకల్యవైకల్యములను తాను అనుభవించకుండా హాయిగా వుండుటయే.

లోకంలో మరే పాపాలకైనా ప్రాయశ్చిత్తాదులు ఉన్నాయి గాని నే ననేవానిని తెలుసుకొనుటలో పొరబాటు వస్తే యిక ప్రాయశ్చిత్తమే లేదు, దానిని మళ్లీ సరిగా తెలిసికొనుటే తప్ప. ఇదే రీతిగా లోకంలో మరే సంగతి అయినా దానిని తెలిసికొనుటలో పొరబాటు రాకూడదు. బంగారమును ఇత్తడి అనుకొంటే దానికి ఏప్రాయశ్చిత్తము చేస్తే అది సరిపడుతుంది?

ఈశ్వరుడు వేదశాస్త్రరీత్యా నిర్ణయించిన వర్ణాశ్రమధర్మాలవల్లనే చిత్తశుద్ధి కలిగి వస్తుతత్త్వమును సమ్యగ్విధంగా తెలిసికోగలము.

పూర్వము పెద్దపెద్దసత్రయాగములలో ఉన్నవారు వేదాంత విచారణ చేసేవారు. అందరూ తుల్యశ్రుతశీలఆచారములు కలిగిన వారే. సహస్రవర్షముల సత్రయాగములు కూడ ఉండేవి. వారివారి స్వధర్మములు విధ్యనుసారము చేసుకొంటూనే వేదాంతవిచారణ మాత్రము అందరు కలిసి సమానంగా చేసికొనెడివారు. యథా యోగ్యంగా. చేతిలో ఒక ఆలంబన పెట్టుకొనే పైదానిని పట్టుకొన ప్రయత్నించాలి. ఆ ఆలంబనమే స్వధర్మము.

శరీరమును మనం వాడుకొనుచున్నప్పటికీ శరీరం లేదని శ్రుతులు చెప్పుచున్న వని బ్రహ్మజ్ఞానులు చెప్పుచున్నారు; సుఖ దుఃఖాలు వస్తున్నా లేవనియే చెప్పుదురు.

అద్వైతులు ప్రపంచము పుట్టుటకు మాయ కారణం అంటారు. మిగతావారు తలా ఒకటి చెప్పారు; పరమాణువు లని, ప్రకృతి అనీ రకరకాలుగా చెప్పుచున్నారు. పుట్టటంలో అందరికీ, ఐక్యమత్యమే. కారణంలోనే తేడా భేదము కలుగుచున్నది. అయితే నీవు కూడ పుట్టటం అంగీకరించినావు కదా అంటే నేను మాయచేత పుట్టినదన్నాను.

అసలు లేదన్నా, ఒకటే అర్థం. కనుక జాగ్రత్త! మాయచేత పు
దన్నా లేదనియే అర్థము. కారణవైలక్షణ్యమువల్ల పుట్టనే లేదని
అర్థము. మాయచేత నైనా పుట్టిన దన్నావు గదా అంటే మాయే లే
తెలిసికోనుము. మాయ అంటే త్రికాలములలో లేనిదని అర్థము.

బ్రహ్మాశ్రయముగా శక్తి వున్న దంటే అది రెండవది గా
ఏలాగన:-

మనిషి-అతనినీడవలె=ఆత్మ-మాయా. మాయకు ప్రత్యేకమై
ఉనికి లేనట్లే. తనకంటే వేరే లేని తననీడవల్ల తన కేమీ భయ
లేదు అది రెండవది కాదు గనుక. మాయవల్ల పుట్టిన మామిడికాయ
పండులో వగరు. తీపిగా భేద మున్నది అయినను రెండూ మాయం
అదే విధంగా పుణ్యము, పాపము గూడ. మాయావృక్షమును పోనీకుం
పట్టుకోవాలి (ఉంచుకోవాలి), అని ప్రయత్నంచేసే అజ్ఞానివలెనే మ
గూడ శరీరాన్ని పోనీకుండా పట్టుకోవా లని ప్రయత్నిస్తున్నాము.

సచ్చిదానందలక్షణమైన సత్యమును అనుభవపూర్వకంగా తెలి
కొన్నవానికి కైవల్యమే రావాలి. బ్రహ్మమునుగురించి చెప్పినవాక
ములే సత్యమైనవి. బ్రహ్మజ్ఞుడు సత్యవంతుడు. హరిశ్చంద్రుడ
అబద్ధమాడ లేదంటే, మాయామయమైన వాటిలోనే అబద్ధ మాడలేద
అందువలన మాయామయమైన బ్రహ్మలోకము వచ్చినది అయన
గూడ. ఆయన తత్త్వవేత్తలలోని సత్యవంతుడు కాదు.

జ్ఞానస్వరూపుడైన తత్త్వవేత్త చావడు. జ్ఞానము చావని
జ్ఞానము చచ్చిన దని జ్ఞానంచేతనే చెప్పవలసివస్తుంది. అందువల
జ్ఞానమునకు చావు లేదు.

చైతన్యమాత్రస్వభావునియందు గోచరించిన వస్తువులవల
వానిలో ఏమాత్రం మార్చరాదు; అద్దములో భాసించినవస్తువులవలె.

మహావాక్యములను గురువులు ఉపదేశించినపుడు బాగుగా తెలిసి కొన్నచో తన కేవలత్వ–నిర్మలత్వ–నిత్యత్వము తనకే తేలుతుంది.

నీకు బుద్ధి వుందని తెలుసునే గాని, దానిసత్తా ఎంతయో నీకు తెలియలేదు. దానిశక్తి ఎంత అంటే వస్తువే లేనిచోట నానావిధములైన బ్రహ్మాండములను చూపెట్టుచున్నది. ఆచిత్తమే నిన్ను నీకు తెలియ నీయకుండా వేరువిధంగా కనిపింపజేసి నిన్ను నానావస్థలు పెట్టుచున్నది గదా!

"నీబుద్ధే నిన్నీవిధంగా బాధపెట్టుచుండగా భగవంతుని పట్టు కొని నాకు దుఃఖము తీసివేయు మని ఏడుస్తా వేమిరా" అంటారు పెద్దలు. బుద్ధిని తర్ఫీదు చేసికొనుటకే శ్రుతి చెప్పిన వర్ణాశ్రమధర్మ ములు, సాధనచతుష్టయసంపత్తి మొదలగునవి. "మమైవ అజ్ఞాః శ్రుతి స్మృతయః" అని పరమేశ్వరవాక్యము.

స్వాప్నికాజ్ఞానము వచ్చి జాగ్రత్తలో వున్న తన అనుభవాన్ని ఆటంకపరచుచున్నది. బాగా భోజనంచేసి తృప్తిగా వున్నవానికి స్వప్నంవచ్చి తాను చాలా ఆకలిగా వున్నట్లు బాధపడుతూ అన్నం ఎవరు పెట్టుదురా అని నానాప్రయత్నాలు చేయుచున్నాడు. అంతే గాని స్వాప్నికావిద్యవలన నాకు ఈబాధ వచ్చిన దని తెలియదు.

శివుడు గురురూపమునవచ్చి చెప్పతున్న తత్త్వము తెలియదు. అట్లు గాక శివరూపంతో మనకు అనుగ్రహించడ మేమిటంటే, ఈ స్మరణం నాకెందుకు వచ్చిన దని ప్రశ్న పుట్టుటవరకే అబోధ.

శ్రీకృష్ణుడు + అర్జునుడు.

ఈశ్వరుడుగాను, గురువుగాను ఉపదేశము జరిగి తరింపు జరిగినది.

"శిష్య స్తేహం శాధి మాం త్వాం ప్రపన్నమ్" అని అర్జునుడు ప్రార్థించెను.



నేను భక్తుణ్ణి అని ఉండేవరకు ఆపరమాత్మ ఈశ్వరుడుగా వుంటాడు. నేను శిష్యుణ్ణి అనేటప్పుడు తానే గురురూపమున ఉపదేశి స్తాడు. ఈ జననమరణబాధ నా కెందుకు వచ్చిన దని వివిదిష వచ్చిం దంటే ఈశ్వరానుగ్రహం పూర్తిగా వచ్చినట్లే.

తాను కోటీశ్వరుడుగా వుండియు కలలో తానే దరిద్రుడుగా బాధపడుచున్నాడు; ఇదంతయు స్వాప్నికావిద్యచేతనే.

స్వాప్నికాజ్ఞానం తనస్వరూపాన్ని మరిపించినదే గాని తీసివేయ లేకపోయినది.

ఇట్లాగే సచ్చిదానందస్వరూపుడవై నీవే ఈజాగ్రదవస్థ అనే కలలో దానిని మరచి జన్మవ్యాధి జరామరణలక్షణుడవుగా బాధపడు చున్నావు. ఇందులోనుంచి, గురువు అనుగ్రహంవలన మేల్కొన వలెను.

ఇది ఇలా ఉండగా స్వప్నంలో జరిగినవాటికి ఫలితా లేమిటి? అని జ్యోతిష్కుని అడుగుచున్నావు.

అసలు ఈ కలేమిటి? అనే ప్రశ్నరాదు. నిజంలో నే నెవడను అని ప్రశ్న రావటమే బహుజన్మపుణ్యఫలము — ఈశ్వరాను గ్రహమూను.

వేదపురుషుడు సత్పురుషులను ఆశ్రయించమంటాడు.

"సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వమ్।
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః॥"

## 4. జ్ఞాన లక్షణము

చీమ చంద్రునిచేరటం శివునితలపై ఉన్న మారేడు పత్రిద్వారానే కదా! కష్టసాధ్యమైనదానిని కూడ విమానంలోవలె సమ్యక్సాధనవలన సులభంగా చేరవచ్చును. ఆశ్రయబలమువలన ఏదైనా బహుసులభము.

శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడు అయిన సద్గురువుయొక్క కృపా విశేషమహిమవలన సర్వము సుసాధ్యమే.

స్వప్నద్రష్ట ఒక్కడే నిజము. వాడే మేల్కొని ఉన్నవాడు. కలలోని మనుష్యులు అంతా అబద్ధమే. "చిత్ చిత్"గానే ఉంటూ మహా మాయాప్రభావమువలన తాను చిత్తముగా మారినట్లు కనబరస్తూ వున్నది. "చిత్"నకే విషయాకారము ధరించినపుడు చిత్తము అను పేరు వచ్చినది. చైత్యము ఉన్నపుడే చిత్తము విషయాకారము ధరించును; చిత్తము విషయాకారము ధరించినపుడే చైత్యము ఉన్నది. ఇవి అన్యోన్యాశ్రయములు ఈ రెండు లేనపుడు "చిత్" మాత్రమే ఉన్నదన వలెను.

ఈ జీవుడు పుట్టలేదు. చావ లేదనవలెను.

"న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితావా న భూయః।
అజో నిత్య శ్శాశ్వతోయంపురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥" (గీత)

జ్ఞానలక్షణము ఉన్నది ఉన్నట్లుగా తెలియజేయడమే. వస్తువు యొక్క యథార్థత్వము ప్రకాశింపజేయడమే. వస్తువును తీసివేయదు; క్రొత్తది తెచ్చిపెట్టదు.

స్వప్నవృత్తాంతముచేత జాగ్రత్త గూడ అదే విధంగా అసత్యమని చెప్పుటకే, "స్వప్నజాగరములు సమములు." అని భాగవతము చెప్పినది.

స్వప్న మనగా మనోవికారమే జాగ్రత్తగూడ మనోవికారమే. ఆత్మ అట్టిది కాదు. సుషుప్తిలోని నీస్వరూపమే సత్యము. అపుడు మనస్సు లేదు కదా! కనుక మనస్సుమీదనే సర్వద్వైతప్రపంచము ఆధారపడియున్నది.

సుషుప్తిలో మనం ప్రతిరోజు బ్రహ్మలోకంలో కలుస్తున్నాము. అదే ఆనందస్వరూపము. ఆస్థితియే జాగ్రత్తలో గూడ కలిగియుండు టనే అద్వైతవేదాంతము చెప్పుచున్నది.

విషయములమీద దోషము కనిపెట్టే దానికంటే తనబుద్ధిలోను, ఇంద్రియములలోను దోషము ఉన్న దేమో నని కనిపెట్టవలెను, సరియైన బుద్ధిమంతుడు.

ఉదా॥ శంఖము పచ్చగా కనబడితే కంటిలో ఏదో దోషము ఉన్న దని తెలిసికొనవలెను. బుద్ధిలోనే, దోష ముంటే సద్గురువు కని పెట్టి దిద్దవలెను.

సుసూక్ష్మమైన ఈ సత్యమును అసూయ లేకుండా తెలిసికొన వలెను. అట్లే స్త్రీలమీద ధనముమీద దోషము కనిపెట్టేదానికంటే నీ బుద్ధిలోనే దోష మున్నదేమో చూడుము

ఆత్మ నిరంతరం దుఃఖసంస్పర్శ లేకుండనే ఆనందముయొక్క ఎడబాటు లేకుండనే ఉన్నది. ఇది అర్థం కాకపోవుటకు కారణం అజ్ఞానమే.

మన సర్వప్రయత్నాలు ఆత్మకు దుఃఖం తీసివేయుటకు ఆనందం సంపాదించుటకున్ను అయివున్నవి. కాని ఆత్మ నిత్యానందము, నిత్య పరిపూర్ణము, అద్వయము, అజము, అమృతము.

ఆత్మకు దుఃఖము ఉన్న దనే వారందరూ పొరబాటుపడ్డవారే. అగ్నికి ఉష్ణము ఎట్లు స్వభావమో అట్లే ఆత్మకు ఆనందమే స్వభావము. తలమీద కుంపటి పెట్టి గజ్జులు కాల్చుట, తలమీది వెంట్రుకగూడ కమిలి పోకుండ, ఇది తాత్కాలిక మణిమంత్రౌషధ మహిమ.

అద్వైతులు ఒక్కరే ఈ రహస్యము తెలిసికొన్నవారు. ఆత్మకు ఎపుడూ దుఃఖము లేదు ఆనందము ఎపుడూ లేకుండా లేదు. అది ఎపుడూ నిత్యానందమే.

దేహమును శుష్కింపజేయుట మనస్సును ఏకాగ్రము జేయుట, ఈ ఉపాయాలు చెప్పేవారు కొందరు. తిన్నకుక్క పోనేపోయింది. (కనిపించిన) కన్నకుక్కకు దెబ్బలు పడ్డాయి పాపము! దేహేంద్రియాల దోష మంతా ప్రపంచాసక్తి కలిగి వుండుటయే. పుణ్య మంతా ఆత్మయాథార్థ్యము తెలిసికొనుటకే.

ఆత్మకు ఏవిధంగాను సుఖదుఃఖములు అతుక్కుండే పద్ధతి లేనే లేదు.

బుద్ధిలో అశుద్ధికలవారు తమ ఇష్టానిష్టములువల్లనే సుఖదుఃఖములను తదాకారములను తీసికొని అనుభవించుచున్నారు. వీరే వేదోదిత కర్మానుష్ఠానమువలన దీనివిషయమై చక్కగా కృషిచేయవలెను. ఆత్మయందు సుఖదుఃఖములు భాసించినా ఆత్మలో ఏమీ మార్పు లేదని వేదాంతిఅయిన బుద్ధిమంతుడు తెలుసుకొనుచున్నాడు.

వస్తుసహజస్థితిని కనుగొనుటయే తత్త్వజ్ఞానము. ఆత్మకు సుఖదుఃఖములు భాసిస్తున్నాయి గాని అందులో అవి ఏమార్పు తేలేవు అద్దమునందు వలె.

ఆత్మకు జన్మమరణములవల్ల గాని, సుఖదుఃఖములవల్లగానిఏ మార్పు రాదు. అందులో అవి భాసిస్తున్నాయి గాని మార్పును తేలేవు. ఈ సంగతి తెలిసికొన్నవానికి మరొక కర్తవ్యము ఏదియు లేదు. వీడు మరొకపని ఏమీ చేయవలసినది లేదు. ఏమీ చేయడు. ఆత్మ వస్తువునందు ఏమీ లేనేలేనిదాన్ని ఉన్న దని నానాబాధలు పడేవాడు మూఢుడు.

ఈవిషయము తెలిసికోకుండా మరేమి చేసినా వీడు బాగుపడడు.

నిజంలో సుఖదుఃఖాలు ప్రపంచములో లేనే లేవు; ఆభగవంతుని సృష్టిలో యివి లేనేలేవు; ఏ వ్యాపారస్థునికొట్టులోనూ లేవు.

బుద్ధికల్పనలోనే ఈసుఖదుఃఖములు శీతోష్ణములు, జన్మమరణములు గూడ.

ఇవి అన్నీ జీవసృష్టే.

అసలు ఈపృథివ్యాదులు, శీతవాతాతపములు ద్వైతప్రపంచమంతా లేనే లేవు.

నీ బుద్ధివికారమునే, నీ చిత్తవికారమునే దేవునిమీద పెట్టుచున్నావు.

చిన్మాత్రస్వరూపమైన ప్రత్యగాత్మయే పరబ్రహ్మము. విషయాకారమును ధరించిన చిత్తే చిత్తము అయినది. అసలు విషయాకారము చిత్ ఏలా ధరించడము అజ్ఞానంవల్ల తప్ప.

ఈ చిదచిద్గ్రంధి నశించడమే మోక్షము.

ఇదియే తన్ను ఉద్ధరించుకొనే మార్గము.

"న కశ్చి జ్జాయతే జీవః సంభవోఽస్య న విద్యతే।
ఏత త్త దుత్తమం సత్యం యత్ర కించి న్న జాయతే॥

ఏవిధముగా చూచినను ఆత్మకు బంధము ఉన్నదని ఋజువు చేయుటకే వీలులేదు. నీవు బద్ధుడ వని అనుకొన్నపుడు గూడ నీవు బద్ధుడవు గావు.

"చిత్తస్పందిత మే వేదం గ్రాహ్యగ్రాహకవద్ ద్వయమ్"

అసలు భాసించినవి అయినను భానమైన అద్దమునందు అతకపు, చక్కనిముఖము గాని వికారముఖము గానీ. అలాగే ఆత్మయందు సుఖము గాని, దుఃఖము గానీ, ఇష్టము గానీ, జన్మ గాని, మరణము గానీ, ఏవియు సంబంధించవు

విషయాకారమును ధరించినచిత్, చిత్త మైనది అపుడు చిత్తము చైత్య మైనది.

అసలు చిత్, విషయాకారము ఎట్లు పొందినది? అని ప్రశ్న.

త్రాడు త్రాడుగానే ఉంది, పాము ఎలా అయినది? అవివేకంచేత అదే మూలావిద్య. ఇదియే తెలిసికొనవలసినది.

శాస్తా, శాస్త్రం, శిష్యుడు వీళ్ల సంగతి ఏమిటి? ఉండటం వేరు ఉపయోగంపడటం వేరు.

ఉపయోగపడినంతమాత్రంచేత ఉన్న వని మేము అన మని ఆద్వైతి

లేనివి ఉపయోగపడును. ఉండియు కొన్ని ఉపయోగం లేకుండాను పోవును. కనుక ఉండుటకు, ఉపయోగపడుటకు సంబంధము లేదు. త్రాడు , పాము. కల్పితసంవృత్త్యా = కల్పితవ్యవహారముచేత; అని త్యము — ఉన్నపుడు ఉంది; పోయినపుడు లేక పోవడము.

అసత్యము — ఉన్నపుడు గూడ లేకపోవడము. సత్య మంటే ఒకటి మిగిలితేనే సత్యము. నిరంతరం ఉండునది. వేదాంతము చెప్పేది సత్య మైనను ఆ సత్యము మనబుద్ధితో చూచుకొంటేనే గాని మనకు నిజంగా ఏర్పడి తృప్తినీయదు. మనముఖం మనము చూడలేము గాని, అద్దములో చూడగలము. అయినను తూర్పుముఖంగా ఉన్న ముఖమును పడమరగా చూస్తాము. పడమరగా చూచి కూడ దానిని సహజంగా మనం సవరించుకొని తూర్పుగా తెలిసికొనుచున్నాము. అట్లే మన ఆత్మ శుద్ధాంతఃకరణములో ప్రతిఫలించి గోచరము అవుతుంది. అనగా ఆత్మజ్ఞానము కలుగుతుంది.

"నేను"ను దేహముక్రింద అర్థము చేసికొనడమే చచ్చుటకు మూలము.

చిత్తాకారమువల్లనే జన్మలు, స్వర్గనరకములు వచ్చుచున్నవి. ఆ అజ్ఞానము జ్ఞానమువల్లనే పోతుంది. అట్టిజ్ఞానము వేదాంతవిచారణవల్లనే కలుగుతుంది.

"నాన్యః పంథా విద్యతేఽయనాయ"

మేల్కొన్నవెనుక స్వప్నము లేనట్లు జ్ఞానంవల్ల అజ్ఞానం పోతుంది.

దేవతలుగూడ పాపం! అమృత-ఔషధంవల్ల తమకు మరణం లేకుండా చేసుకొందామనుకొన్నారు.

బ్రహ్మవేత్త ఇతర డాక్టర్లవలె చచ్చేవాడు కాదు. అట్టిగురుసేవ చేసి తత్త్వవిచారణచేత ఆత్మసాక్షాత్కారము పొందవలెను.

మూడుకాలములయందు త్రాడు త్రాడే గాని సర్ప మెపుడూ లేదు.

"కాలత్రయే యథా సర్పో రజ్జౌ నాస్తి తథా మయి।
అహంకారాది దేహాంతం జగన్నాస్త్యహ మద్వయః"

ఆత్మబోధోపనిషత్.

అట్లే చిత్తము పుట్టనపుడు గాని, చిత్తము పుట్టినపుడు గాని చిత్తము ఉపశమించి నపుడు గానీ నీవు ఎపుడూ సముడవు, అద్వయుడవు, అమృతుడవు, ఆనందుడవు, చిన్మాత్రుడవు కేవలసత్స్వరూపుడవు.

ఇది బ్రహ్మాత్మజ్ఞానంవల్లనే కలుగును.

ఇదియే బ్రహ్మవిద్య.

చిత్, ప్రకాశము యిస్తుంది.

చిత్తు కుండయొక్క ఆకారమును కనబరుస్తుంది. అపుడే కుండను తెలుసుకోగలము. స్వయముగా భోజనముచేసి తృప్తిని పొందినట్లే వేదాంతవిచారణ గూడ తానే చేయవలెను. తృప్తిని, సాక్షాత్కారమును పొందవలెను. చిత్తము చైత్యాధీనము గాదు. చైత్యము చిత్తాధీనముగా వున్నది. చిత్తమే అసలు భ్రాంతి. చిన్మాత్రము అసలు అసంగము. ఇది ఎందులోను కలవదు. గురుశాస్త్రాదిద్వైత మంతా గూడ అసత్యమైనప్పటికీ సత్యమైన పరమార్థమును తెలియజేస్తుంది.

ఇద్దరు ప్రభువులు ఒక తావున జేరి రహస్యము మాటలాడుకొనుటకు, ఉభయులు తమతమ పరివారముతో వచ్చినను, ఆతావున చేరి మాటలాడుకొనునపుడు ఆపరివార మంతా ఆగిపోవలసినదే, వధూవరులనిషేకమునందు వలె.

బుద్ధికి ఇష్టములైన వస్తువులు లభిస్తే బుద్ధి తదాకారము జెంది సుఖము పెందుతుంది; అదే జీవునకు గోచరిస్తుంది. ఇదే విధంగా అనిష్టములైన వస్తువులవల్ల బుద్ధి తదాకారము జెంది దుఃఖము పొందు తుంది. అదే జీవునకు గోచరమౌనట్లుగా నుండును. కనుక బుద్ధివికార ములే జీవుడు అనుభవించుచు

"నేను"కు కర్తృత్వారోపణ లేనప్పుడు అది చేసినపుణ్యపాపాలకు ఫలితము లేదు. అనగా తత్త్వవేత్త అయిన నేనుకు చిత్తమే లేదు. చిత్ + జడగ్రంథియే చిత్తము తత్త్వజ్ఞానకు విచారణవల్ల చిత్తము లేదనే తేలుతుంది. చిత్ + జడము కలియుటకే వీలు లేదు; అవివేకము వల్ల. అజ్ఞానంవల్లతప్ప. లోకములోని సర్వపుణ్యపాపములు అజ్ఞానం వల్ల ఏర్పడినవే. చిత్తమే లేనపుడు అక్కడ మరేమున్నది? చిన్మా త్రమే ఉన్నది. సత్యవస్తువుమీదనే భ్రాంతి వచ్చినది.

ఉన్న తాడుమీదనే పాము అను భ్రాంతి గాని, మరొక భ్రాంతి గానీ వచ్చుచున్నది. భ్రాంతి లేనపుడు సత్యమే ఉంటుంది. మరణభీతి తీసివేసుకొనుటకే బుద్ధిమంతులు వేదాంతవిచారణ చేయుచున్నారు. కొందరు ఔషధము పుచ్చుకొనుచున్నారు. కొందరు యోగము చేయు చున్నారు, కొందరు బుద్ధిమంతులు వేదాంతవిచారణచేసి మరణభీతి తీసివేసుకొనుచున్నారు. కనుక వేదాంతవిచారణయే మరణమును తొల గించుకొనుటకు సరియైన మార్గము, ఇదియే ఉపనిషన్మార్గము; భగవ దాదేశము. దీనివల్లనే తప్పక అమృతత్వము లభించును,

బుద్ధికి వచ్చే సుఖదుఃఖములే జీవునకు సంక్రమిస్తున్నవి, ఇదంతా బుద్ధి విషయాభిముఖము అగుటవల్లనే, బుద్ధిలోనికి చేరనిలాభనష్టములు మన కేమీ సంబంధించవు,

బుద్ధి సుషుప్తిలో లేదు. గనుక అపుడు మన కేమీ దుఃఖము లేదు. అదే విధంగా బుద్ధిలో జ్ఞానయోగముచేత పరమాత్మనే ప్రకాశిం

పజేసికొంటే నిరంతరం ఆత్మ ఆనందంగానే ఉంటుంది. శరీరమును నేను బాగుజేసికొని ఆరోగ్యంగా ఉంటానంటే ఆశరీరం ఎప్పుడైనా చచ్చేదే గనుక "జాతస్య హి ధ్రువో మృత్యుః" (దుఃఖాంత నాటకం) తనకు దుఃఖము తప్పదు. శరీరధ్యానం లేకుండా అనగా విషయధ్యానం లేకుండా బ్రహ్మధ్యానమే కలిగివుంటే నిరంతరం నిర్ణయంగా ఆనం దమే అనుభవిస్తాము. బ్రహ్మానుసంధానంచేత దేహానుసంధానం తగ్గి పోతుంది, ఇది సర్వత్ర సహజమైనది. కాని వేదాంతము చెప్పిన దేమనగా ఆత్మకు సొంతస్వభావము అసలు ఆనందమే. బుద్ధివల్ల తనకు ఆఆనందము సుఖము దుఃఖము వచ్చినపుడు పోతుంది. అసలు తన ఆనందము బుద్ధియొక్క సుఖదుఃఖములచేత ఏమీ తరగదు.

స్వర్ణముయొక్క సహజస్వభావము మెరుగుపెట్టినపుడు గాని, మట్టికప్పినపుడు గాని మారదు. ఈలాగే ఆత్మానందము బుద్ధియొక్క బాగోగులవల్ల తగ్గదు, పెరగదు.

శాస్త్రము చెప్పిన మార్గోపదేశమున శ్రోత తనయొక్క బుద్ధిని గూడ ఉపయోగించి, దానిని సరిగా వినియోగించుకొని తనలక్ష్యమును పొందవలెను. కాని దానిని సరిగా అర్థము చేసుకొననివాడు దాని ఫల మును పొందలేడు.

ఉదా:- వంటపాకము చూచుకొంటూ మంట వేయవలెను గాని తెలివి తక్కువగా మంట నెల్లప్పుడు వేయకూడదు.

తనకు మరణరహితోపదేశములు చేయునపుడు నిద్రరావటము, తనకు మరణం తెచ్చేమాటలు వినుటలో ఆసక్తి, ఇది అంతా శ్రద్ధా లోపమే గాక ఆహారశుద్ధి గూడ లేకపోవటమే.

బుద్ధి తీసికొన్న ఆకారాన్ని పట్టే మనకు సుఖదుఃఖములు వస్తు న్నాయి గాని గోచరించే వస్తుస్వభావాన్ని అనుసరించి కాదు. ఆ

బుద్ధియే అనగా నాబుద్ధే. నన్ను చూచునపుడు నేను ఏవిధంగా నాబుద్ధికి గోచరిస్తానో ఆవిధంగానే అబుద్ధి నిశ్చయించుకొనుచున్నది.

ఎట్లనగా:— నేను బ్రహ్మచారిని నేను గృహస్థును మొదలుగా తనబుద్ధే స్వర్గబ్రహ్మాదిలోకముల ఆకారమును పొంది ఆ యనుభవమును పొందుచున్నది.

నీబుద్ధిలోని పుణ్యపాపములే సర్వలోకాలను సృజించి, తత్తద్భోగ్యవస్తువులను గూడ సృజించి నిన్ను భోక్తగా తయారుజేయుచున్నవి.

విషయములాంటి అద్దమునందు నాముఖప్రతిబింబము కనబడుచున్నది. అద్దము పోయినపుడును నా ముఖము నావద్దనే ఉన్నది. మరేమీ కాలేదు. అలాగే విషయములు పోయినను నా ఆనందమునకు ఏమీ లోటు లేదు.

సుఖదుఃఖములు చైతన్యపురుషుడైన నాకే ఉన్నవి గాని విషయములగు గృహారామక్షేత్రవిత్తములైన అనాత్మలందు లేవు.

ఆనందము ఏవిషయములందు కనబడినను అది నాలోని ఆనందమే. ఆవిషయములు పోయినను, ఉన్నను, నాస్వరూపమైన ఆనందమునకు ఏమీ లోటు లేదు.

ఆకలిదప్పులు ఆరోపిత వస్తువునకే గనుక అవి తీర్చుకొంటే అది తృప్తి జెందుతుంది.

పరలోకసుఖముకొరకు పుణ్యము చేస్తానంటే ముందు మరణమనే అమంగళమును ఒప్పుకోవటమే. మోక్షముకొరకే సర్వపుణ్యములు శ్రద్ధగా చేయవలెను. నాస్వరూపము తెలియమి చేతనే నేను నన్ను దేహేంద్రియములుగా భావించి వాటి రక్షణయందు నానావస్థలు పడుచున్నాను. అవి బాగుంటే నేను బాగుంటా నని అనుకొనుటే భ్రాంతి. ఆ అజ్ఞానము తీసివేసికొన్నచో నిర్విశేషమైన నా ఆనంద

స్వరూపస్థితియే అభయప్రాప్తి. అంతే గాని భ్రాంత్యారోపిత అసత్య వస్తురక్షణచేత అభయప్రాప్తి రాదు.

అభూతాభినివేశంవల్లనే దానికనుగుణమైన మనచిత్తము యొక్క ప్రవర్తన మంతా స్థూలదేహమునందు నే నను భావము వచ్చి నపుడే మనకు సుఖదుఃఖానుభవము గల సకలసంసారము వచ్చుచున్నది. ఈ సుఖదుఃఖములు గల సకలసంసారము పూర్వస్థితిలో గూడ స్వభావతః వుండనే ఉన్నది.

ఎట్లనగా:— తండులములలో పూర్వమే అన్నమయ్యే గుణము ఉన్నందువల్లనే మనం అన్నముకొరకు బియ్యమును తెచ్చుకొనుచున్నాము.

సుషుప్తిలోనే వీడు అహమాకారమును పొందదగిన స్వభావము తోనే ఉన్నాడు గనుక మేలుకొంటూనే వీడు అహమాకారముతో విజృంభించుచున్నాడు. కనుక మనం స్థూలదేహతాదాత్మ్యతో వుండి యజ్ఞము యోగాభ్యాసము, సన్న్యాసము ఎన్ని చేసినను ముక్తి రాదు. కారణ మేమన స్థూలదేహములోని నేనును తీసివేసుకోకుండా ఏమి చేసినను నిష్ప్రయోజనమే. అయితే యిది ఎక్కడినుండి వచ్చినది? అంటే ఇది అహమాకారములోనే ఉన్నది. అది ఎక్కడినుంచి వచ్చినది? సుషుప్తిలోని నా కేమీ తెలియలేదనే అనుభవములోనే యిమిడివున్నది.

నిజంలో దానికి గూడ నేను, అది కాకుండా, సాక్షిగా ఉన్నాను. నాచేత తెలియబడే అజ్ఞానం గానీ, అసలు ఏవస్తువు గానీ నన్నేమీ చేయలే దను విమర్శనజ్ఞానమే కృతార్థతకు, ముక్తికి కారణము.

సర్వమునకు సూర్యునిసాక్షిత్వమువలె సాక్షికి తెలియబడే మంచిచెడ్డలను గురించి సాక్షికి ఏమీ సంబంధము లేదు. ఇదే తెలిసికో దగినది. ఇదియే ఆత్మజ్ఞానము.

దేహమునకు నేను సాక్షిగా ఉన్నాను గనుక దానిజరావ్యాధి మరణములకును నేను సాక్షిగానే ఉన్నాను. వాటికి నాకు సంబంధము లే దనే

జ్ఞానము, తన్నిశ్చయమే కావలసినది. అయితే ఈదుఃఖమంతా ఎక్కడి నుంచి వచ్చినది అంటే విషయసంయోగము, విషయతాదాత్మ్యమువల్లనే వచ్చుచున్నది.

శాస్త్రాచార్యోపదేశ సంస్కృతబుద్ధిచేత సకలనామరూపఅనాత్మఅధ్యారోపణ వృత్తిని నేతి–నేతీతి వృత్తిచేత తీసివేసి తాను గూడ అంతర్హితమై నపుడు "అహం బ్రహ్మాస్మి"అను అనుభవము ఉంటుంది.

ఆత్మ "ఇట్లున్నది, అట్లున్నది" అను నిర్ణయము లేనిది.

"ఏత త్తది త్యనిర్దేశ్యాయై నమః"

"ఏవ మిత్యాగమ దోధ్యాయై నమః" — లలితాత్రిశతి

సుషుప్తిలో చూచుకొనుము.

అచ్చట ఉన్నది ఉన్నట్లుగా చూచుచున్నావు. హాయిగా వున్నావు. అది "ఇట్లున్నది, అట్లున్నది" అనజాలవు. సుషుప్తిలోను నిర్వికల్పసమాధిలోను అనుభవం ఒకటే గాని, సుషుప్తిలో అజ్ఞానం వలన నా కేదీ తెలియలేదనే భావము ఉన్నది.

"తత్త్వమసి" అను మహావాక్యముచేత ఆ అజ్ఞానము పూర్తిగా నశించి బ్రహ్మాత్మజ్ఞానమునందు స్థిరపడిఉంటావు. ఏషా బ్రాహ్మీస్థితిః. ఇదియే బ్రాహ్మీస్థితి. స ఏష పరమ ఆనందః. ఇదియే పరమానందము.

నాస్వరూపము మరవటమే దుఃఖము, అదియే స్వాత్మాఽజ్ఞానము. దానిని స్వరూపజ్ఞానముచేత పోగొట్టుకొనుటయే ముక్తి. ఇదియే బ్రహ్మవిద్య, జీవన్ముక్తి.

నేను భక్తుడను అనుటయే, నేను శిష్యుడను అనుటయే స్వరూప విస్మృతికి కారణము.

ఆత్మసాక్షాత్కారముపరకే అవి ఉపయోగపడుచున్నవి. తర్వాత అవి లేకుండ పోవును. ఆత్మప్రకాశములో అవి ఏవీ లేవని తెలియును.

అద్వితీయ ఆత్మ ప్రకాశమే మిగులును అయినను గురువు నందును ఈశ్వరునియందును భావాద్వైతమే గాని క్రియాద్వైతము ఉండకూడదు.

పరాఞ్చి ఖాని వ్యతృణత్ స్వయంభూ
స్తస్మా త్పరాఙ్పశ్యతి నాంతరాత్మన్;
కశ్చి ద్ధీరః ప్రత్యగాత్మన మైక్ష
దావృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్॥

తన యింద్రియములు తన విషయము ఆలోచించక యితరములను గురించియే ఆలోచించుచుండును ఒకానొక ధీరుడే లోపలికి తిరిగి తన్ను గూర్చి ఆలోచించి కృతకృత్యు డగును.

శుద్ధాశుద్ధములైన పాపపుణ్యాపావము లన్నియు చిత్తమందే పుట్టి చిత్తమందే అస్తమించుచున్నవి. అట్టి చిత్తమునకు తానే అవభాసకుడు కనుక అవి యేవియు తనను సమీపించ లేవు ఇక్కడనే జ్ఞానాగ్నిచేత సర్వకర్మదహనము అయిపోయినది. ఇక్కడే పరమేశ్వరునివాస స్థానము.

"ఆసుప్తే రామృతేః కాలం నయేత్ వేదాంతచింతయా" నిద్ర వచ్చువరకు, మరణమువచ్చువరకు వెదాంతమననముచేతనే కాలము గడపవలయును.

నిరంతరము దేహపోషణయే మనము చేయుచున్నాము. ఇపుడిక దానిని వదలి బ్రహ్మవిచారమే చేయవలెను. మాట్లాడుచున్నను, వ్యవహరించుచున్నను దేహాత్మవాదులవలెనే బ్రహ్మాత్మవాదులు గూడ తమయందే లక్ష్యముంచవలెను.

"యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా"

యోగముచేత నిరుద్ధమైన చిత్తము వ్యవహారమునుండి ఉపరమించును. శాంతిశమదమాదులుగల అంతఃకరణములో చైతన్యము ప్రతిబింబించినపుడు, యోగి తన్ను శాంతియుతునిగా కృతార్థునిగా తలంచుచున్నాడు.

అసలు యోగప్రభావము ఎట్టి దనగా సర్వప్రపంచము దగ్ధమై పోయినను యోగియైనవాడు హాయిగా పరమసుఖంగా ఉండును. ఇది నిరోధసమాధివలన వచ్చును. అపుడు ఆస్థితియందు బ్రహ్మవిష్ణు మహేశ్వరు లైనను లెక్క లేదు. తానే ఆనందఘనముగా ఉండును. కాని సమాధివ్యుత్థానములలో గూడ తాను అట్లు సుఖంగా వుండునట్టి సర్వ బ్రహ్మాత్మజ్ఞానము వలన వచ్చును.

శాంతి, శమదమాదులు, రాగద్వేషాదులు నిత్యాఖండ–ఆనంద రసస్వరూపుడైన తన ఆత్మ చైతన్యమువల్లనే అవభాసింపబడు చుండును. కాన తాను నిరంతర ఆనందఘనుడే; నిత్యానందస్వరూపుడే. "స ఏవ ధీరః" ఆశ్చర్యవత్ పశ్యతి కశ్చి దేనమ్.

సర్పము నిండా త్రాడే ఉన్నది. అంటే అర్థ మేమిటి? సర్ప మెప్పుడును లేదనియే గదా! అధిష్ఠానమైన త్రాడును తెలిసికొంటేనే అభయస్థితి వచ్చును. అట్లే ఈనామరూపప్రపంచమునిండ బ్రహ్మము ఉన్నదంటే జాగ్రత్తగా పై ఉదాహరణాన్ని అర్థము చేసికొని బాగు పడవలెను.

మంత్రములోనిశక్తి మహత్తరముగా ఉంటుంది. అయినను దానిని బయటికి తీసికొనివచ్చి ఉపయోగించుకొనే మెలకువ కావాలి. పొలమునందు చక్కగా కృషిచేస్తే గొప్పఫలితము వచ్చును. లేనిచో ఆశక్తి అందులోనే అంతర్నిహితమై ఉండిపోతుంది.

భండాసురుడు, శివుణ్ణి, తనతపస్సు అను పాశముతోనే ఏ లోకంలో ఉన్నా లాగి రప్పించుకొందు నన్నాడు. తపస్సుకు మించి నది లేదు.

"య ద్దుష్కరం యద్దురాపం య ద్దుర్గం య చ్చ దు స్తరమ్।
త త్సర్వం తపసా ప్రాప్యం తపో హి దురతిక్రమమ్॥

ఏది దుష్కరమో, దేనిని పొందుట కష్టసాధ్యమో, ఎచ్చటికి పోవుట కష్టమో, దేనిని తరించుట కష్టమో, అది యంతయు తపస్సు చేత పొందవచ్చు. తపస్సును అతిక్రమించుటకు వీలులేదు.

దేవుని చూడాలని అనుకొన్నవా డెవరో వానిని తెలిసికోవలె. ఇది అన్నిటికంటే గొప్ప తపస్సు.

ఓం "పూర్ణ మదః పూర్ణ మిదం పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే।
పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణ మే వావశిష్యతే॥

అర్థము – అది పూర్ణము, ఇది పూర్ణము. పూర్ణమువలన పూర్ణము ఉద్భవించినది. పూర్ణమునుండి పూర్ణము తీసివేసినచో పూర్ణమే మిగులును. అనగా ఏమిటి తాత్పర్యము? పరబ్రహ్మము పూర్ణము, ఈకనబడుప్రపంచము పూర్ణము. శ్రుతి:– "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఈ కనబడు సర్వము బ్రహ్మము. ఈ సర్వము నందు బ్రహ్మము ఉన్నది అనియే గదా!

ఉదహరించెదము– త్రాడు మందాంధకారములో కొందరికి సర్పముగా, కొందరికి పూలమాలగా కనబడును. దానినిండ నిజంలో త్రాడే ఉన్నది అన్నట్లు. ఇక పూర్ణమునుండి పూర్ణమును తీసివేయుట ఏమిటి?

ఈ నామరూపములనిండ. ఆ బ్రహ్మమే ఉన్నది. అని గ్రహించవలెను.

శ్లో॥ "అతిస్వల్పతరాయుశ్శ్రీ ర్భూతేశాంశాధిపోఽపి యః।
స తు రాజాహ మస్మీతి వాదినం హన్తి సాన్వయమ్॥

శ్లో॥ కర్తాఽపి సర్వలోకానా మక్షయైశ్వర్యవా నపి।
శివ శ్శివోఽహ మస్మీతి వాదినం యం చ కం చన
ఆత్మనా సహ తాదాత్మ్యభాగినం కురుతే భృశమ్॥

శివ గీత.

శ్లో॥ సుఖస్య దుఃఖస్య న కోఽపి దాతా, పరో దదాతీతి కుబుద్ధి రేషా।
అహం కరోమీతి వృథాభిమానః స్వకర్మసూత్రగ్రథితో హి
లోకః॥

అత్యంతము అల్పమైనయాయువు సంపద కలిగి, రాజేశ్వరుని యొక్క అంశమునకు అధిపతియే యైనను, నేను రాజును అను పలుకు వానిని (పరమేశ్వరుఁడు) వంశసహితముగ సంహరించును.

సర్వలోకములకు కర్తయై అక్షయమైనయైశ్వర్యము కలిగి, "నేను శివుఁడను; నేను శివుడను" అని పలుకువానిని ఎవని నైనను (శివుడు), తనతో తాదాత్మ్యము కలవానినిగా తప్పక చేయును.

సుఖమును దుఃఖమును మనకు ఇచ్చువాఁడు ఎవడును లేడు. ఎవడో మనకు వీనిని కలిగించుచున్నా డను కొనుట కుత్సితమైన బుద్ధి. నేను కదా ఈ పనిని చేయుచున్నా నని అనుకొనుట వ్యర్థమైన అభి మానము. లోకము అంతయు తాను చేసిన కర్మములయొక్క సూత్ర ముచేతనే కట్టబడియున్నది.

వేదాంతప్రమాణజ్ఞానంవలన వచ్చినది, ఏ మనగా? తనకు మాత్రమే జననమరణములు లే వని కాదు; మ రెవ్వరికి గూడ లేవనే తెలిసినది.

అజ్ఞాననివర్తనమునకే ప్రమాణము ఉపకరించును; అంతే గాని ప్రత్యగాత్మప్రతీతికొరకు గాదు. అజ్ఞానము పోగానే తనస్వరూపమును తత్త్వతః తెలిసికొనుచున్నాడు.

సముద్రమును గుర్తింపజేసిన గంగాగోదావరీ నదులవలెనే సృష్టి వాక్యా లన్నియు బ్రహ్మమును గుర్తింపజేయుటకే ఉప యోగించును.

సముద్రమును గుర్తింపజేసిన నదు లన్నియు అందులోనే అంతర్హితములై కలిసిపోవుచున్నవి. ఏకము అద్వితీయము అయిన బ్రహ్మము ఒక్కటియే యున్నది.

ఏక మేవాద్వితీయం బ్రహ్మ

అద్వైతులమగు మేము బ్రహ్మవాదులము; మాయావాదులము కాము. మీ రందరు పొరబాటు పడడానికి మాయయే, అజ్ఞానమే కారణ మందుము. మీఅనుభవాన్ని సరిదిద్దడానికి మేము మాయ (అజ్ఞానము) ఉన్న దని చెప్పినామే కాని దానిని సిద్ధాంతీకరించుటకు గాదు అజ్ఞానము కుదరదందువేని, అది మాకు సమ్మతమే. ఉన్నది బ్రహ్మమే అని మావాదము; మాసిద్ధాంతము. అయితే ఆ మాయకు (అజ్ఞాన మనుకొన్నను) దాని కొరకు అధిష్ఠానము ఉండవలెగదా! అ అజ్ఞానము ఎవరికి? అజ్ఞానము బ్రహ్మకే ఉన్న దనుట సమంజసము కాదు. అది బ్రహ్మఅధీనములో ఉన్నది. దీపమునకే వెలగుట వెలుగకపోవట చెల్లును కాని కుండకు చెల్లదు. అయినను ఒక్కమాట. మనలోమాట! ముక్కుమీద ఉసిరికకాయ నిలువబెట్టుట ప్రచండమార్తాండునియందు చీకటి చూపెట్టుటవలె బ్రహ్మమందు అజ్ఞానము ఉండటం ఎలా?

ఒకపేద బ్రాహ్మణుడు సూర్యునిగూర్చి తపస్సుజేసి ప్రత్యక్షము జేసికొని తనయింట్లో చీకటిని పోగొట్టు మని వరముకోరుట, "అట్లాగే చూపెట్టు ఆ చీకటిని" అని సూర్యు డడుగుటవలె బ్రహ్మమునందు అజ్ఞాన ముండుట సంభవము కాదు. అయినా దీనిని ఎవరికి కట్టిపెట్టదాము ఈ అజ్ఞానాన్నో; మాయనో? జీవునికందామా అంటే; పూర్వమే సిద్ధమై యున్న అజ్ఞానమునకు తరువాత వచ్చిన జీవుడు ఎట్లు ఆశ్రయ మగును. ఇక బ్రహ్మ కందామా అంటే అది దుర్ఘటమని పైన చెప్ప బడే ఉన్నది గదా! కాబట్టి అజ్ఞానము జీవునియం దున్నదో బ్రహ్మ మునం దున్నదో చెప్పవలె. భగవంతుడే స్వయముగా చెప్పుచున్నాడు

గీతలో :—

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా"

"ప్రకృతిం స్వా మధిష్ఠాయ సమ్భవా మ్యాత్మమాయయా"

ఈ గుణమయి యైననామాయ దైవికమైనది; అతిక్రమింప రానిది. నామాయచేత నేను నాప్రకృతిని అధిష్ఠించి సంభవించుచున్నాను

"అథోఽపిసన్"

"యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసా శ్చ యే।
మ త్త ఏవేతి తాన్ విద్ధి న త్వహం తేషు తే మయి॥"

ఏవి అయితే సాత్త్వికభావములు ప్రాణులయొక్క స్వకర్మల వలన పుట్టుచున్నవో అవి అన్నియు నావలననే పుట్టుచున్నవి అయి నను సంసారులవలె నేను వాని అధీనములో లేను, కాని అవి మాత్రము నావశములో ఉండును.

"మాయ" అనగా ఏమిటి? అన్ని అనటంవల్ల నే అది అంతర్ధాన మవుతుంది. "యా మా సా మాయా" అనదేవ స దివావభాసతే"

అవతారపురుషులు మాయను స్వాధీనమ్ముగా చేసికొన కలిగినవారు.

భగవంతుడు "నేను" అన్నప్పు డెల్ల ప్రతివాడు తననే అర్థము చేసుకోనవలె,

"అహ మాత్మా గుడాకేశ। సర్వభూతాశయస్థితః"॥ గీత॥
త్రిభి ర్గుణమయై ర్భా వేభి స్సర్వ మిదం జగత్,
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్॥

త్రిగుణమయములైన భావములచేత మోహితమైన యీజగత్తు, వీనికి పరముగా నున్న నన్ను తెలిసికొనలేకున్నది.

ప్రమాణమర్యాదచేత చూస్తే ఆత్మ సహజంగానే నిత్యానంద ముగా ఉన్నదని అద్వైతవేదాంతము. ఏదో చేస్తే ఆత్మకు ఆనందము వచ్చునని ఇతరమతస్థు లందురు, దుఃఖము గనుక ఆత్మలోనిదే అయితే దుఃఖము పోగొట్టుకొందు నని ఆత్మకు అభిప్రాయమే పుట్టదు, సుఖము వద్దనువాడే లేడు గనుక ఆత్మకు సుఖమే స్వరూపము, సుఖమే స్వరూపమైన ఆత్మను కనుగొనుటే మనము చేయవలసిన పని, సాధ నానుష్ఠానము ఫలపర్యంతమే ఉండవచ్చును, తర్వాత ఉండనే కూడదు, అన్నము తయారైనతర్వాత నిప్పును పరిహరించిన విధముగా "సాధన ముల నాదరింపరు దర్శనానంతరమున." (భారతము).

ఆత్మకు సహజముగా ఉన్న స్వభావము సుఖమే. ఎప్పుడూ దుఃఖలేశము కూడా లేదు పాపములు లేని బుద్ధిలో తనస్వరూపము సుఖస్వరూప మని నిశ్చయము ఏర్పడుచున్నది. దేహమే తానై, తనను జరామరణములు లేకుండ చేసుకోవలె నని కోరుట ప్రాణ మప్పగించి నను కుదరదు. ఎంతో కృషిచేసి సంపాదించినరత్నాన్ని ఎలా జాగ్రత్తగా మనము ఉపయోగించుకొందుమో అట్లే బహుజన్మార్జితమైన సుకృతముచేత లభించిన సజ్జనసాంగత్యమును అట్లు ఉపయోగించుకో వలెను ఒక్కజ్ఞానంచేత తప్ప మరొకదానిచేత దేనిచే నైనను మరణ భయం తీరదు. అనాత్మపదార్థము లనేకములలో ఆత్మ అన్న రత్నము కలిసి ఉండడంవల్ల దానిని తెలిసికొనుటకు బహుమెళకువ అవసరము. దానిపరిచయస్థులసాంగత్యము కూడ చాలా అవసరము.

బహుశ్రమచేత మోక్షము వస్తుందన్న అభిప్రాయము తెలివి తక్కువయే మోక్షమునకు ఏప్రయత్నము అవసరమో అది చేయ వలెను. భగవదాజ్ఞానిర్వహణమే భగవద్భక్తి, భగవత్సేవ. జ్ఞానమే పరమశ్రేయస్సు. అది తెలిసినగురువులసేవ జేసి, వారి ఉపదేశములను గ్రహించుటవల్లనే ముక్తి లభిస్తుంది. సద్గురుబోధలను గ్రహించునట్టి బుద్ధి మేధే కావలసినది స్వాప్నికపీడలన్నీ తొలగుటకు ప్రబోధమే మార్గము దేహేంద్రియసమూహముతో అవి సత్యము లని వ్యవహ రించుటయే స్వప్నము. అవన్నీ మిథ్యగా భావించి, తనను తెలిసి కొనుటే మెలకువ. పుణ్యపాపఫలములు రెండూ బంధహేతువులే. సత్యమైన తాను కేవలుడుగా ఉండుటయే ముక్తి. పుణ్యఫలములను మార్చుకొని మోక్షము ననుభవించు నేర్పు కావలెను. ఫలాభిలాషతో చేసినపుణ్యము గూడ పాపఫలముతో సమానమే. కాని "యేషాం త్వంతగతం పాపం, జనానాం పుణ్యకర్మణామ్। తే ద్వంద్వమోహ నిర్ముక్తాః, భజంతే మాం దృఢవ్రతాః॥" అనగా నిష్కామ్యమైన

చిత్తశుద్ధికికారణమైన పుణ్యధనము ప్రభూతముగా ఉన్నవారికే మోక్ష మను శాశ్వతానందమును సంపాదించ వీలగును.

బ్రహ్మసాక్షాత్కార మను సూర్యోదయానికి బ్రహ్మభావన, అరుణోదయము.

శాస్త్రాచార్యోపదేశమైన బ్రహ్మవిద్యయందు శ్రద్ధ, విశ్వాసము ముఖ్యములు బ్రహ్మజ్ఞానము హస్తప్రాప్తమైనప్పటికిని అదృష్టహీనుడు దానియందు విశ్వాసము లేక అనుభవించుటకు నోచుకొన లేకుండపోవును. "సంశయాత్మా వినశ్యతి" సంశయాత్ముడు నశించును. చింతామణి ప్రత్యక్ష మయినను ఒకానొకదౌర్భాగ్యుడు దానిని నమ్మలేక సంశయించి పోగొట్టుకున్నవానివలెనే పై సందర్భముకూడ.

బ్రహ్మ మనగా ఒకవ్యక్తి గాదు. అది శాశ్వతానంద మను వస్తువే. భ్రాంతివల్ల కన్పించు సర్పమునందు పూర్తిగా రజ్జు వున్నట్లు ఈ సర్వబ్రహ్మాండములయందు ఆ పరమాత్మ నిండియున్నది. క్షీర మును వేడిజేసి తోడుపెట్టి పెరుగుచేసి, మథనచేసినచో దానినుండి వెన్న వచ్చును. అట్లే ఈశరీరాన్ని గూడ చాంద్రాయణాదివ్రతాదులవల్ల తపింపజేసి పరమాత్మను తెలిసికోవచ్చునా? సాక్షాత్కరింప జేసికొన వచ్చునా? అన్నచో అది సుతరాము సరిపడదు. అయితే మరి ఎట్లు అంటే రజ్జుసర్పమును దీపప్రకాశముచేత ఎట్లు రజ్జు దర్శనముచేసి నిర్భయతను పొందుదుమో అట్లే ఆత్మజ్ఞానముచేత ముక్తిపొంది పర బ్రహ్మాత్మగా వుందుము.

శరీరాభిమానమువల్లనే మనము ధర్మోల్లంఘనచేసి పాపపంకిల ములో పడిపోయి అధోగతికి పోవుచున్నాము. జ్ఞానోదయ మను దీప మును వెలిగించినచో సత్యదర్శనము అగును. కేవలము మాటలచేత గాదు. జ్ఞానోదయము కలుగుటకు నిష్కపటమైన బహుపుణ్యములు కావలెను. జయాపజయములు, లాభాలాభములు పాటించకుండ స్వధర్మ

మును ఆచరించుచున్నచో పరమార్థసాక్షాత్కారానికి ఉపయోగపడే పుణ్యము పుట్టుకొనివస్తుంది. మహాపుణ్యశీలురకథలు, పతివ్రతలు, బ్రహ్మనిష్ఠులు మొదలగువారి చరిత్రలు నిరంతరము వినుచుండవలెను.

అజ్ఞాన మను పిశాచము పట్టినవానికి ఎన్ని ఉపచారములు చేసినను వాని కేమియు ప్రయోజనము లేదు. అవి అన్నియు పిశాచానికే చెందును విషయభోగాశ తగ్గుకొలది ఆ దయ్యము చిక్కిపోయి క్రమముగా వానిని విడిచివెళ్లిపోవును. కనుక నిత్యానందస్వరూపమైన ముక్తిని పొందగోరువారు ముందు భోగాశను వదులుకోవలెను. సమూలముగా భోగాశను త్యజించివేయవలెను. లేనిచో మళ్లీ మళ్లీ వచ్చుచుండును.

ఎవడు ఏవిద్యలో నిపుణుడుడో వాడు అవిద్యయందలి మెలకువలు చెప్పగలడు. కాని మరొకరు సంవత్సరానికి ఒకతడవ తలుపులు తీసి కనబడినను వానికి ఆ మెలకువ తెలియదు. మోక్షము వచ్చుటకు క్రింద నేలమీద పడుకొన్నచో వచ్చునా? అజ్ఞాన మను పిశాచము పోవుటకు భోగాశ వదలుటయే మార్గము. అసలు నీవు ఏమి త్యాగము చేసినావో చెప్పుము. "త్యాగే నైకే అమృతత్త్వ మానశుః" "ఏకే కుశలినః". కొందఱు త్యాగముచేత అమృతత్వమును పొందిరి. వీరు మోక్షసంపాదనమున కుశలులు.

త్రాడుమీద అవివేకంచేత సర్పముగా తోచిన భావమును బాగుగా చూచి తెలిసికొన్నపుడు ఆసర్పము ఎక్కడికి పోయినది? త్రాడులోనే లీన మైనది.

ఈ, లేని, దేహమును కాపాడుకొనుటకు దీనిని పోకుండ పట్టడానికే మనము చేసేకృషి అంతా.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని వేదాంతం ఎత్తుగడ చేస్తుంది. ఉపనిషన్మాత సత్యం చెప్పుచున్నా నని ప్రారంభించింది.

చూచువాని తెలివితక్కువచేత త్రాడులో సర్పము కన్పించినది. అట్లే తెలియని నేనే ఈ సర్వజగత్తుకు కారణము. నాకు తెలియదనే దానికి నేనే అవభాసకుడను గా నేనే ఎప్పుడూ స్వప్రకాశమానముగా వున్నాను. శివము సర్వమంగళప్రద మైనది. అఖండైకరస మద్వైతం. శివవిష్ణువులతత్త్వానుభూతిని పొందటమే మనజీవితోద్దేశము అసలు సచ్చిదానందపరబ్రహ్మమే లేనిదేహముగా భాసించుచు ఉన్నది. ఆత్మ విచారణ చేయు సమయ మంతయు సమాధియే. అపుడు పుణ్యములు పుణ్యములే వర్షించుచుండును.

ఆత్మదర్శనము కాలేదనే బెంగపుట్టుటయే శుద్ధమైన పుణ్యము యొక్క ఫలము.

చిత్తములోని దోషములను నాశనముచేసికొనుటకే వేదాంత శ్రవణము.

జాగ్రత్తగా సాధనానుష్ఠానమును చేయుచూ ఉన్నచో అది పక్వమైనప్పుడు మనకు సిద్ధి కలుగును. తొందరపడకూడదు కాలపాకము కొరకు ఓర్పు వహించి యుండవలెను.

జాగ్రత్, స్వప్న, సుషుప్తు లనునవి ఎన్ని వచ్చినను ఎన్ని పోయినను నీఅఖండసచ్చిదానందమును నీవు మరువకూడదు. మనస్సు లేనిస్థితి ద్వైతప్రతీతిలేనిస్థితియే. మనస్సు నశిస్తే సుషుప్తివలె వుంటుంది ఐయితే జీవన్ముక్తు డెట్లు వ్యవహరించును? మామూలు మనస్సు అంటే రాగద్వేషాలు కలది వాటిని ఆమనస్సులోనుంచి తీసి వేసి వ్యవహరించువాడు అమనస్కుడే.

పరమహంసలు మాత్రమే అఖండసచ్చిదానంద దృష్టికలవారు. రజ్జుజ్ఞానముచేత సర్పము పోయినట్లు ఆత్మజ్ఞానముచేత సర్వపుణ్యపాపములు దగ్ధమైపోవును. ఇది నిశ్చయం. ఇదియే నిర్లేపలయము. అపుడు భయరహితమైన త్రాడే కనిపించును.

జీవన్ముక్తులైనవారి విజ్ఞానములో బ్రహ్మేంద్రాదులు వారి బ్రహ్మాండములు అన్నియు పోవును. అఖండాత్మదర్శనములో సర్వద్వైతము పోవును. ద్వైతప్రపంచము కొందరిని ప్రేమ చేత, కొందరిని ద్వేషముచేత ఆత్మస్థితినుండి లాగివేయుచున్నది.

నిత్యనిర్వికారమైన చైతన్యమూర్తి, దీపమువలెనే, సర్వద్వైత ప్రపంచమును ప్రకాశింపజేయుచున్నది. అది తన కేదియు అంటు కోకుండ ప్రకాశించుచున్నది. ఇదియే మోక్షస్థానము.

ఇంద్రియములకు కనబడు భిన్నభిన్ననామరూపములుగల వస్తువుల నన్నిటిని బుద్ధిచేత ఏక మని తెలిసికొనుతెలివి సంపాదించుటయే గొప్పతపస్సు; సమాధి.

కనిపించు వస్తుస్వభావాన్నిపట్టి బంధమోక్షములా? వానిని బుద్ధి చేత అర్థంచేసుకొను స్వభావాన్నిపట్టి బంధమోక్షములా? ఎట్లన.– కనబడు నాగాభరణమును–సర్పమువలె ఉన్న వెండితీగను చూచి, అది సర్పరూపముగా కనబడినను బుద్ధితో వెండిగా అర్థచేసికొనుటే తత్త్వ జ్ఞానము.

ఆకారాన్ని మినహాయించి అసలు స్వరూపమును చూడగలిగిన వానికి ఇక భయము లేదు. అలాగే సకలచరాచరప్రపంచములోని వివిధ నామరూపములు మినహాయించి భిన్నభిన్నముగా కనబడుచున్నవానిని కేవలసచ్చిదానందపరబ్రహ్మముగానే చూడవలెను. అన్నియు సచ్చిదానందలక్షణమగు ప్రత్యక్ పరబ్రహ్మమయిన నేనే. సముద్రములో కనబడే సకలతరంగాలు కేవలజలమే అని తెలిసికొనుటే వివేకము.

మోక్ష మను ఫలము, భోజనముచేసినవెంటనే తృప్తి వచ్చినట్లు వెంటనే కలుగవలెను. కాని అది దేశాంతర–కాలాంతర–లోకాంతరము లలో అనుభవించునది కాదు.

## 5. వేదప్రామాణ్యము

కృష్ణం వందే జగద్గురుమ్.

సర్వజీవులు అభిలషించునట్టి శాశ్వతానందము ననుగ్రహించు గురువే జగద్గురువు. వారే శ్రీశంకరాచార్యులవారు.

వేదములోని అపరవిద్యలు పలువిధములు. కనుకనే శ్రీమచ్ఛంకరభగవత్పాదులు తమ వేదపాదస్తవములో ఇట్లు చెప్పినారు. ఈ జగత్తులో సంసారభ్రమహేతువులైన విద్యలు ఉండును గాక. ఏ విద్యచే విద్వాంసుడు అమృతత్వమును పొందుచున్నాడో, అట్టి నిన్ను భజించుచున్నాను.

సంతు విద్యాః జగ త్యస్మిన్, సంసారభ్రమహేతవః।
భజేఽహం త్వాం యయా విద్వాన్, విద్యాయా విందతేఽమృతమ్॥

ప్రమాణముచేత నిర్ణయింపబడు స్వభావము ప్రతీతిచేత కనబడు స్వభావాన్ని తిరస్కరించును.

శ్రీరామకృష్ణాదుల ఉపాధులు ప్రాతిభాసికములు. ఆధికారిక ఉపాధికి కర్మసంబంధమైన ఉపాధికి చాల భేద మున్నది. అవివేక కాలములో సంసారరూపముగా కనబడిన శరీరాద్యుపాధులే వివేకకాలములో, వైభవముగా ఉండును. దుఃఖాదిసర్వభావములు జ్ఞానికి రసములుగా ఉండును. నాటకపాత్రధరించినవారికి ఆవేషము పోతే అయ్యో! పోయినదే అని ఉండదు. ఈ మెలకువే సర్వవేదాంతములు చెప్పునది.

సంసారము బాగా విడువదలచుకొన్నవారు వస్తువు తెలియనపుడు, వస్తువు ఉన్నదివున్నట్లు తెలిసినపుడు, ఎంతవిశేష మున్నదో ఆలోచించండి. అజ్ఞానమూలకమైన అన్యథాభావము జ్ఞానము రాగానే పోతుంది. ఇందుకు స్వప్నము ఉదాహరణము.

బ్రహ్మాత్మైకత్వప్రతిపత్తి అనగా వ్యాధిగ్రస్తుడైనవాడు ఆరోగ్యము వచ్చినతర్వాత తన్ను గుర్తించుట అన్నమాట.

మనకు, మనలో వుండు చైతన్యఆత్మను మన ఉపాధులకంటే భిన్నముగా చూచుట తెలియదు.

"అహం బ్రహ్మాస్మి" అని మూడుపదములు కలిసినపుడు అఖండ మేలాగు? ఉల్లేఖించినపుడు ఉన్నభిన్నస్వభావము తర్వాత ఉండవలసిన పనిలేదు. ఉదా:– నేను ఆరోగ్యవంతుడను. ఇందులో "నేను" వేరు ఆరోగ్యవంతుడు వేరా? శబ్దములు భిన్నమే కాని అర్థము అఖండమే.

బ్రహ్మకాండచేత అపేక్షింపబడు చిత్తశుద్ధిని పూర్వకాండ సమర్పించును. అందువలన పూర్వోత్తరకాండలు ఒకటే. ప్రత్యక్ష అనుమానాలవలన ఇష్టప్రాప్తికి అనిష్టనివృత్తికి ఆత్యంతికోపాయము దొరకదు జననమరణనివృత్తికి ఆత్యంతికోపాయము వేదమే చెప్పుచున్నది. అందువల్లనే అది పరమప్రమాణము.

1) దేహేంద్రియాదులయందు అధ్యాస, జలతరంగములవలె, మరుమరీచికలవలెను, జ్ఞానము వచ్చినను ఉంటుంది.

2) అహంకార అధ్యాస–రజ్జుసర్పమువలె పూర్తిగా పోతుంది

బ్రహ్మేంద్రాదులు తమలోకాలసుఖమును గూడ పాటించకుండా శః బ్రహ్మవిద్యయందు రమించుచున్నారంటే దీనిప్రభావము నిక నేమి చెప్పవలెను. మన మెక్కడ ఉన్నా మిప్పుడు? మహాదుఃఖ మయములైన ఘోరసముద్రములోని జరామరణముల సుడిగుండము లలో పరితపించుచున్నాము. మరొకవ్యాసంగములో బుద్ధిని పోనివ్వ వచ్చునా? సాక్షాత్శంకరులు, "ఆయితే కానిమ్ము" అని మనుష్య దేహముతో కైలాసములో నుండి మనకొరకు దిగివచ్చినారు.

సత్యసంకల్పము అంటే అవశ్యంభావి అన్నఅర్థమే. అనగా అవశ్యము ఫలకారి. అంతే గాని నిరంతరము ఉండును అని కాదు.

కూటస్థనిత్యము అని కాదు. తప్పకుండ ఫలము వచ్చుననియే, దాని యర్థము. మనస్సు సర్పము. ధ్యానముచేత దానిని కట్టుట, దానికి యిష్టము లేనిపని. అది ఎప్పుడో కసితీర్చుకొంటుంది. ప్రపంచసర్ప మిథ్యాత్వజ్ఞానమువల్లనే కృతార్థత ఈ ప్రసంగమే సర్వోత్తమ మైనది. ఇదియే పరా విద్య. ఉపాధులను మినహాయించి, కేవలవస్తువును చూడ కలిగినవారే ధీరులు. దృశ్యమును తిరస్కరించివారు దృక్ మాత్రమే చూడగలుగుదురు.

"నాహం దేహో నాహం దేహో," "నేను దేహము కాదు" అని ఎంతకాలము జపము చేసినను – దానిభావము అనుసరించక పోతే ఎంతమేధతో ఆమాట అనవలెనో గుర్తించకపోతే ఏమీ ప్రయోజనము లేదు.

మన హృదయము పవిత్రసంస్కారం గల క్షేత్రము కావలెను. లేనిచో ఈ వేదాంతబీజాలన్నియు "గాదె"లో ధాన్యమువలె నిలువ వుంటే ప్రయోజనము లేదు; చచ్చినా మొక్క మొలవదు జాగ్రత్త. బాధితాధ్యాస గురువున కుంటుంది. సత్యత్వాధ్యాస అజ్ఞానికి ఉంటుంది.

ద్రష్టయొక్క అజ్ఞానముచేత శుక్తికయందు రజతము పుట్టినది. అని అంటారు అద్వైతులు ఇతరులవాదములు అనేకరకాలు వున్నవి.

కృష్ణం వందే జగద్గురుమ్; శంకరం చ జగద్గురుమ్. "కరతల నవనీత మివ ఏతా వేవ జ్ఞానదాతారౌ'. చేతిలో వెన్నముద్దనువలె అందరికి కావలసిన దుఃఖరహితశాశ్వతసుఖమును వా రిచ్చెదరు.

సృష్టివాక్యములప్రయోజనము అఖండబ్రహ్మముయొక్క అస్తిత్వమును చెప్పుటకొరకే. అందుకొరకే సృష్టివర్ణన చేయబడినది. సృష్టి వాక్యములు సృష్టిహేతువైన వస్తువును లక్షణసహితముగా చెప్పుట కొరకే ప్రవర్తించినవి. కాని సృష్టియథార్థత్వమును గాని దాని ప్రయోజనమును గాని చెప్పుటకొరకు గాదు.

అఖండమై, ఏకరసమై, ఆనందఘనమై వున్న ఒక్కవస్తువే ప్రకాశించుచున్నది. తనను గురించి తనకే భ్రాంతి ఎట్లా వస్తుం దనగా స్వప్నములో వస్తూ వున్నది కదా!

మేము బ్రహ్మవాదులము; మాయావాదులము కాము మీ రందరు పొరబాటుపడుటకు మాయయే (అజ్ఞానమే కారణ మందుము.) మీ అనుభవాన్ని సరిదిద్దడానికి మేము మాయ ఉన్న దని చెప్పినాము కాని దానిని సిద్ధాంతీకరించుటకు గాదు. అజ్ఞానము కుదరదందువా? సరే అదీ మాకును సమ్మతమే. ఉన్నది బ్రహ్మమే అని మావాదము; మా సిద్ధాంతము.

లౌకికము భ్రమ. లౌకికులు అంటే భ్రాంతులు ఒకనితత్త్వము మరొకనికి అర్థం కాకపోతే అది వానిప్రాప్తము అనుకోవచ్చును. తన స్వభావము తనకే అర్థముకాలే దనటము ఏమి సబబు? ప్రకాశించని స్వభావంగల కుండను ప్రకాశించుట. ప్రకాశింపజేసేతెలివి తనకు ప్రకాశింపకపోవుట తనదౌర్భాగ్యమే. ౘ తెలివిలోనే కుండను కన బరచే అజ్ఞానము ఉన్న దని ఒప్పుకోవలెను.

"తస్మా దే త స్మాత్ ఆత్మనః ఆకాశస్సంభూతః". కుదరని చోట కుదిరరందంటే దానికి అజ్ఞానమే కారణము.

శః గ్రాహ్య గ్రాహకలక్షణముగల ప్రపంచములో గ్రాహకులైన జీవులు తమకు దుఃఖము లేకుండ నిరంతరం సుఖమే ఉండునట్లు కోరు చుందురు అందుకు విధినిషేధములతో కూడిన కర్మాచరణమును అను సరించుచున్నారు. విధివలన సుఖమును రాబట్టుకొనుటకు, నిషేధము వలన దుఃఖమును రాకుండ జేసికొనుటకును ప్రయత్నించుచున్నారు. జీవులయొక్క సహజమైన యిట్టికోరికకు అనుగుణముగా శ్రుతిమాత క్రమముగా వీరల కుపయోగపడుమార్గమును చూపించుటకు యత్నించి ప్రవర్తించినది కాని అద్వైతులులో మేము కోరు సుఖము అప్రాణికలో

లేదని చెప్పుచున్నారు. సాధనపరతంత్రమై వచ్చు ఆసుఖము తనకు శాశ్వతముగా ఉపయోగపడ దని సూక్ష్మప్రజ్ఞగలవాడు దానినిఅంగీకరించుటలేదు. కాని ఎట్లా? అసలు నేను కోరుసుఖము ఆప్రవృత్తి నివృత్తి కర్మలప్రణాళికలోనే లేదని తెలియుచున్నది. ఆవచ్చుసుఖము అది వచ్చుమార్గంలోనే దానిస్వభావము తెలుపుతు వుంది. అయితే నాకు కావలసినది ఎట్టిసుఖము అంటే నిత్యసుఖము. అనగా మూడుకాలములలో ఉండవలెను ఆసుఖము దుఃఖము నాకు వద్దనగా దుఃఖము నాకు ఎన్నడును లేదనియే, తాత్పర్యము. అయితే సుఖమో? అది మాత్రం నాకు ఎడతెగకుండ ఉండవలెను అది త్రికాలములలో నాస్వస్వరూపముగా "స్వే మహిమ్ని" ఉండియు, అజ్ఞానముచే తెలియబడక జ్ఞానముచే ప్రకాశించదగినదిగా ఉండునదియే నాకు కావలసిన నిత్యసుఖము.

భరతఖండములోని మానవులకు తాము చేయు ప్రతిపనిలో పుణ్యమో, పాపమో పుట్టుకొని వచ్చుచున్నది. ప్రతియింద్రియవ్యవహారములోను ఆవి వచ్చును.

ఖలసహవాసం విఘటయ
ఘటయ సతాం హి సంగమ మనిశమ్।
శంభో శివ! శివ! శంకర!
సాంబ! సదాశివ శరణం మే తవచరణమ్॥

బ్రహ్మేంద్రాదుల ఆనందముకూడ బ్రహ్మానందముయొక్క లవలేశమే. మనలను చంపు కామక్రోధాదులను మనమే రక్షించుకొనుచు పోషించుకొనుచున్నాము. కామక్రోధాదులే మనకు అన్నిబాధలను కలిగించుచున్నవి. మోక్షం కోరుట ఎట్లుండవలె నని? నిత్యముగా వుండవలెననియే. జ్ఞానముచేత పోవునది అజ్ఞానముచేత కల్పితమైనదిగా సంసారము మిథ్యామాత్రముగా ఉండవలెను.

"అన్యత్ర ఆత్మదర్శనాత్ అమృతత్వం నాస్తి". అహం = నేను ఇదం = దేహేంద్రియాదులు, ఇవి అనేకజన్మలనుంచి మనహృదయాలలో పిశాచములవలె గూడుకట్టుకొని ఉన్నవి.

నేను-నాతో వచ్చేవాడు మరొకడు, నానీడ. విరుద్ధస్వభావంతో గోచరించినను, దానికి ద్వితీయత్వము చెప్పడానికి వీలులేదు. ద్వైతము అవిచారితరమణీయము. నేను నానీడ ఉన్నప్పుడు రైల్వేస్టేషనులో టిక్కెట్లు ఇద్దరికీ కొనవలెనా? కొనము. ఇక రెండు ఎక్కడ? కనబడే ప్రపంచము లేదు యత్ సత్త్వే, యత్ సత్వం యదసత్త్వే తదసత్యమ్. నేను లేకపోతే అది లేదు. అన్వయవ్యతిరేకములచేత నిర్ణయించవలెను.

"నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః,
ఉభయో రపి దృష్టోన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః॥ గీత॥
శ్రీమద్భగవద్గీత - 2వ అధ్యాయము 16వ శ్లోకము

ఒకపుడు ఉండి తర్వాత లేకపోవు దేహేంద్రియాదులు ఎపుడూ లేవని వేదము చెప్పుచున్నది.

పై శ్లోకమునకు శ్రీ శ్రీశంకరభగవత్పూజ్యపాదులభాష్యానుసారముగా ఇట్లు గ్రహింపవచ్చును.

సద్బుద్ధి అసద్బుద్ధి అని ఎల్లయెడల బుద్ధిద్వయము ఏర్పడుచున్నది దేనికి సంబంధించిన బుద్ధి మార్పునొందుట లేదో ఆవిషయము సత్తు. దేనికి సంబంధించిన బుద్ధి మార్పునొందుచున్నదో, అది అసత్తు. ఈ సదసద్విభాగముతో ఎల్లయెడల ఈ రెండుబుద్ధులను ఎల్లరు పొందుచున్నారు. సమానాధికరణమున నీలోత్పలమునకు వలె ఇక్కడ అర్థము చెప్పకూడదు అక్కడ ఉన్న ఘటము ఉన్న పటము ఉన్న ఏనుగు అని ఈవిధముగా ఉన్నదియైనబుద్ధినుండి ఘటము మొదలగుబుద్ధులు తొలగిపోవుచున్నవి. ఆవిధముగా చూపబడినది. సద్బుద్ధి ఎచ్చటను తొలగుట లేదు. కావున ఘటము మొదలగువానియందున్న బుద్ధి మృత్తునకు భిన్నముగా కన్పించుట లేదు. కానీ సద్బుద్ధి, అనగా ఉన్నది అనుబుద్ధి, మార్పు లేకుండ అన్నియెడల కన్పించుచున్నది.

సర్వత్ర బుద్ధిద్వయోపలబ్ధేః సద్బుద్ధి రసద్బుద్ధి శ్చేతి; యద్వి షయాబుద్ధి ర్న వ్యభిచరతి తత్సత్, యద్విషయా వ్యభిచరతి త దసత్. సదసద్విభాగే బుద్ధితంత్రే స్థితే సర్వత్ర ద్వేబుద్ధీ సర్వై రుపలభ్యేతే, సమానాధికరణే, న నీలోత్పలవత్ సన్ ఘటః, స్సన్ పటః, సన్‌హస్తీ ఇతి, ఏవం సర్వత్ర, తయో ర్బుద్ధ్యో ర్ఘటాదిబుద్ధి ర్వ్యభిచరతి. తథా చ దర్శితమ్. న తు సద్బుద్ధిః. త త్తస్మాత్ ఘటాదిబుద్ధివిషయః మృద్వ్యతిరేకేణ అసన్ వ్యభిచారాత్, న తు సద్బుద్ధివిషయః, అవ్యభిచారాత్।

కాని విశేష్యవిశేషణసమానాధికరణమే అయిన, "నీలోత్పలవత్" కాదని ఎందుకనవలెను? ఇక్కడ నీలోత్పలవిషయములో విశేషణ విశేష్యములైన గుణద్రవ్యములు రెండును వ్యభిచరించుచున్నవి.

"విశేషణవిశేష్యయోః గుణద్రవ్యయోః పరస్పరవ్యభిచారేణ వైషమ్యాత్, నైల్యగుణో మేఘాదా వపి వర్తమానత్వాత్ ఉత్పలం వ్యభిచరతి. ఉత్పలద్రవ్యమపి శుక్లరక్తోత్పలయో ర్వర్తమానత్వాత్ నైల్యగుణం వ్యభిచరతి." నీరోత్పలవిలక్షణముగా ఉండవలెను ఇప్పట్టు లోని సమానాధికరణము. అందువల్లనే భగవత్పాదులవారు, సన్ ఘటః, సన్ పటః అని వివరించినారు అసలిక్కడివిషయము సద్బుద్ధికి అసద్బుద్ధికి సంబంధించిన విషయము.

యద్విషయాబుద్ధి ర్న వ్యభిచరతి తత్సత్. యద్విషయా వ్యభిచరతి త దసత్" అని ఉన్నది. కనుక "సన్ ఘటః, సన్ పటః సన్ హస్తీ" లోనిసదసత్‌విభాగమువలె ఇక్కడ నీలోత్పలవిషయములో కుదురుట లేదు.

తతః "సమానాధికరణే, న నీలోత్పలవత్ అయం పాఠ ఏవ, సమీచీనః॥

కావున ఇక్కడ, "సమానాధికరణే న నీలోత్పలవత్" అనుపాఠమే సరియైనది.

## 6. ఉపదేశము

"నీవును తత్త్వదర్శుల దృష్టి కలిగి శోకమోహములను వదలి, నియతానియతరూపములైన శీతోష్ణసుఖదుఃఖములగు ద్వంద్వములు లేనివయ్యు, ఎండమావులజలమువలె మిథ్యలై కనబడుచున్న వని మనసునందు, నిశ్చయించుకొని హర్షవిషాదములు పొందకుండ సహించుము," అని శ్రీకృష్ణభగవానుని ఉపదేశము.

న హి తమఃప్రకాశయో ర్యుగప దేకత్రస్థితిః సంభవతి। తస్మాదసత్ప్రలపిత మేవైత దనేన జ్ఞానకర్మసముచ్చయప్రతిపాదనమ్।

ముణ్డకోపనిషత్:- తృతీయముణ్డకమ్।

3వ మంత్రము

"నాయ మాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన।
య మే వైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్॥

ఇక్కడ ఒక ముఖ్యమైనవిషయము గమనించవలెను. భాష్యకర్తకు శాస్త్రతాత్పర్యార్థమును గ్రహించి వాక్యములకు అర్థము చెప్పు బాధ్యత వున్నది. ఇదే మీమాంస. మిగిలినవారు శబ్దము ననుసరించి అర్థము చెప్పుదురు.

ఇవ్విధమున ఆత్మలాభము సకలలాభములకన్న పరమలాభమగు నెడల ఆత్మలాభమునకై వేదశాస్త్రాదుల ప్రవచనాదులను బహుళముగ నేర్పాటు గావింపవలయు ననెడి ప్రసక్తి తటస్థపడగా ఈ మంత్రము చెప్పుచున్నది.

ఈ వివరింపబడిన ఆత్మతత్త్వముయొక్క ప్రాప్తి అనగా పరమపురుషార్థము సంతతవేదశాస్త్రాధ్యయన ప్రవచనాదులచే లభ్యపడదు అట్లే వేదశాస్త్రగ్రంథములయర్థమును ధారణచేయగల మేధా

శక్తిచే లభ్యపడదు. పలువిధముల మహావాక్యార్థతత్త్వముల నాలకించి నను దొరకదు. అట్లయిన ఇది దేనిచేత లభ్య మగును.

ఏపరమాత్మ నైతే పొందవలె నని ఈవిద్వాంసుడు తీవ్రమైన ఆకాంక్షతో కోరుచున్నాడో, ఆకోరినవానికే ఈపరమాత్మ లభ్య మగు చున్నాడు. ఆ పరమాత్మ నిత్యలబ్ధస్వరూపుడు గనుక ఇతరసాధనాంత రములచేత కాదు. అట్టి తీవ్రజిజ్ఞాసువునకు ఈఆత్మ అవిద్యాసంఛన్న మైన తనపరమాత్మ స్వరూపమును, ఘటాదులు, ప్రకాశమునందు కన బడునటుల, వివేకప్రత్యయరూపమైన జ్ఞానదీపముచేత ప్రకాశింప జేయును.

కావున అన్యమైన సర్వత్యాగముచేత ఆత్మప్రార్థనయే ఆత్మ లాభసాధన మగును అని అర్థము. ఇక్కడ భగవద్గీతలోని 10వ అధ్యాయములో ఉన్న 9, 10, 11 శ్లోకముల భావమును స్మరించుకొన వలెను.

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్।
కథయంత శ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ॥
తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్।
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే॥
తేషా మేవానుకంపార్థం అహ మజ్ఞానజం తమః।
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥

ఈ శ్లోకములకు శంకరభాష్యమును చూడుము. ముణ్డకోపనిషత్ తృతీయం ముణ్డకమ్. 4వ మంత్రము.

నాయ మాత్మా బలహీనేన లభ్యో
న చ ప్రమాదా త్తపసో వా ప్యలింగాత్।
ఏతై రుపాయై ర్యతతే య స్తు విద్వాం
స్తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ॥

తాత్పర్యము — ఆత్మనిష్ఠాబలములేనివాడు బలహీనుడు. అతనికి బ్రహ్మతత్త్వము లభ్యపడదు. సాంసారికమైన దారాపుత్రపశ్వాదివిషయసంగనిమిత్తమే ప్రమాదము. ఇట్టి ప్రమాదపరునకును ఆత్మతత్త్వము లభ్యపడదు. సన్న్యసింపక సంపాదించు జ్ఞానముచే కూడ ఆత్మతత్త్వము లభ్యపడదు. బలము అప్రమాదము సన్న్యాససహిత జ్ఞానము అనెడి యీఉపాయములతో తత్పరుడై ప్రయత్నించు ఆత్మవేత్తఅయిన ఆ విద్వాంసునియొక్క ఈప్రత్యగాత్మ బ్రహ్మపదమును బాగుగా ప్రవేశించుచున్నది.

శాంకరభాష్యమ్:—

ఆత్మప్రార్థనాసహాయభూతాని ఏతాని చ సాధనాని బలాప్రమాద తపాంసి లింగయుక్తాని = సన్న్యాస సహితాని.

తపః అత్ర జ్ఞానమ్. లింగం సన్న్యాసః. సన్న్యాసరహితాత్ జ్ఞానాత్ న లభ్యతే ఇత్యర్థః.

కాని ఇంద్రుడు, జనకుడు, గార్గి మున్నగువారు సన్న్యాసులు గారు. జ్ఞానసంపన్నులు అయిన వారలకు బ్రహ్మము ప్రాప్తించె నని వినుచుంటిమి. కనుక సన్న్యాసము అక్కర లేదని కొందరు ఆశ్రమ సన్న్యాసమునకు అధికారులుగా వుండియు భావించవచ్చును. కారణ మేమన? ఇట సన్న్యాస మనగా తమది అని అభిమానము లేకపోవుట అని అర్థము అని పైన చెప్పిన కొందరుబుద్ధిమంతుల విషయమును ఉటంకించి, వారి అభిప్రాయమును తిరస్కరింతురు.

అతితెలివి కలిగిన మరికొందరు ఈ అభిమానరాహిత్యము అంతరము, బాహ్యము కాదు. కనుక సన్న్యాస మనగా బాహ్యమైన కాషాయవస్త్రధారణము కాదని భావము. అనుచు జనకాదులను ఉదహరించి "న లింగం ధర్మకారణమ్' అని చెప్పి ఈ సందర్భములో

అంతరసన్న్యాసము వివక్షితము కాని బాహ్యసన్న్యాసము వివక్షితము కాదు అని చెప్పుచున్నారు.

వీరినిగురించియే శంకరులవారు చెప్పినది." తైః బృహదారణ్యకం న(శుతమ్". మరియు ఐతరేయోపనిషత్ భాష్యోపక్రమణములో వీరు విపులమైన విచారణ చేసి నిజమైన సన్న్యాసాశ్రమమును స్థిరీకరించి యున్నారు. దీని నంతయు తెలిసి గ్రహించలేకపోవుటకు సంసారమునందలి తీవ్రమమకారమే కారణము.

మహాభారతములోని అశ్వమేధపర్వప్రథమాశ్వాసము చివర శ్రీకృష్ణుడు అర్జునునకు తత్త్వజ్ఞానస్థిరీకరణము చేయుట, మరియు తత్త్వజ్ఞానవిశేషప్రదర్శనము ద్వితీయాశ్వాసములోని బ్రాహ్మణగీతలలో చతురాననుడు, సంయమివరులతో సూక్ష్మభావత్వసంపాదినియు, శివయు నగు నివృత్తి తెఱంగెఱింగించెద నని చెప్పినవిషయము:– "యోగంబునకు ప్రవృత్తియును, జ్ఞానంబునకు సన్న్యాసంబును లక్షణంబులు లక్షణజ్ఞానంబు పరతత్త్వపరిజ్ఞానంబునకు హేతుభూతంబు.

ఆ॥ జ్ఞానపూర్వకమైన సన్న్యసకలనంబు
పరమగతినొనర్చు భవ్యులార,
ద్వంద్వరహితుడగు నతని జరామృత్యుని
స్తరణకరణమైన ధర్మ మొందు॥

## 7. వైరాగ్యము

"వైరాగ్యం పున రేతస్య మోక్షస్య పరమోఽవధిః"
"కిం తే ధనేన కిము బంధుభి స్తే
కిం తే దారైః బ్రాహ్మణ యో మరిష్యసి।
ఆత్మాన మన్విచ్ఛ గుహాం ప్రవిష్టం
పితామహా స్తే క్వ గతాః పితాచ॥"

ఏవం సాంఖ్యయోగశాస్త్రేషు చ సన్న్యాసః జ్ఞానం ప్రతిప్రత్యాసన్న ఉచ్యతే కామప్రవృత్త్యభావాచ్చ।

కామప్రవృత్తే ర్హి జ్ఞానప్రతికూలతా, సర్వశాస్త్రేషు ప్రసిద్ధా॥

ఈ మోక్షమునకు వైరాగ్యము పరమమైన అవధి. "ఓ బ్రాహ్మణ! మరణింపబోవుచున్న నీకు ధనము ఎందులకు? బంధువులతో నేమి పని? భార్యతో నేమి ప్రయోజనము? గుహయందున్న ఆత్మను వెదకుము. నీతండ్రి, నీతాతలు ఎక్కడికి పోయినారు?"

ఈ విధముగా సాంఖ్యయోగశాస్త్రములయందు కూడ సన్న్యాసము జ్ఞానమునకు సన్నిహితముగా చెప్పఁబడినది. కామప్రవృత్తి లేకుండుటయు ఇట్లే చెప్పబడినది. కామప్రవృత్తి జ్ఞానమునకు ప్రతికూలమైనదిగా సర్వశాస్త్రములయందు ప్రసిద్ధమైయున్నది.

ముఖ్యగమనిక:— ప్రమాణము ద్వారా నిర్ధారణ అయిన విషయము కథానికలలో అందులకు విరుద్ధముగా కనబడినను దానిని ప్రమాణముగా తీసికొనగూడదు.

"ప్రామాణ్యచింతాయాం పురుషప్రవృత్తేః అదృష్టార్థత్వాత్"

"ఛాందోగ్యోపనిషత్ భాష్యం"

భగవద్గీతయందలి 13వ అధ్యాయం 21 శ్లోక భాష్యము

"పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్।

కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు"..... ..

ప్రకృతిస్థు డనగా ప్రకృతిని ఆత్మ యైనట్లుగా పొందినవాఁడు. అవిద్య యుండగా సుఖదుఃఖరూపములైన గుణములందు అవి యనుభవింపబడుచున్నప్పుడు, ఇవి నావి యని యే సక్తి కలుగుచున్నదో అదియే సంసారమునకు జన్మకును ప్రధానకారణము. "అతడు ఎట్టి కామము కలవా డగుచున్నాడో అట్టి సంకల్పము కలవా డగును; ఎట్టి సంకల్పము కలవా డగునో అట్టి కర్మ చేయును. ఏ కర్మ చేయు

చున్నాడో దానినే పొందుచున్నాడు. కావున ఈపురుషుడు కామ మయుడే" అని యీ విధముగా శ్రుతి చెప్పుచుండుటవలన ఈసంసారమునకు కారణము గుణసంగమే. దీని సారంశ మిది. ప్రకృతిస్థము అని చెప్పబడినది అవిద్య గుణములయందు సంగము కామము ఇది సంసారమునకు కారణ మని, దీనిని వర్జించుటకొఱకు చెప్పుచున్నాము. ఇది తొలగిపోవుటకు సన్న్యాసముతో కూడిన జ్ఞానవైరాగ్యములే సాధనము లని గీతాశాస్త్రమునందు ప్రసిద్ధముగా నున్నది. ఆ జ్ఞానము క్షేత్ర క్షేత్రజ్ఞవిషయముగా, దేనిని తెలిసికొన్నచో అమృతత్వము కలుగునో అది యని ముందు చెప్పబడినది మఱియు "సమ్యగ్దర్శననిష్ఠులైన సన్న్యాసులకు సద్యోముక్తి కలుగునని చెప్పబడినది; సకలభావములను అన్నివిధముల భగవంతున కర్పించి బ్రహ్మమైన యీశ్వరునియందు అర్పించి చేయనట్టి కర్మయోగము సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తి సర్వకర్మ కర్మసన్న్యాసము అనుక్రమమున మోక్షమును కలిగించు నని భగవానుడు మాటిమాటికి చెప్పియున్నాడు; మఱియు చెప్పబోవుచు నున్నాడు.

"పరమగుహ్యమైన యీగీతాశాస్త్రమును, సమస్తగుణములు కలవా డయ్యును భగవంతునియందు అసూయకలవానికి చెప్పరాదు"

ప్రకృతిస్థః ప్రకృతిం అత్మత్వేన గతః ఇత్యేతత్. సత్యామపి అవిద్యాయాం సుఖదుఃఖమోహేషు గుణేషు భుజ్యమానేషు య స్సంగః ఆత్మభావః సంసారస్య సః ప్రధానం కారణం జన్మనః, "సః యథా కామో భవతి తత్క్రతు ర్భవతి। యత్క్రతు ర్భవతి తత్కర్మ కురుతే। యత్కర్మ కురుతే త దభిసంపద్యతే" "తస్మాత్ కామమయ ఏవాయం పురషః" ఇత్యాదిశ్రుతేః అస్య సంసారస్య కారణం గుణసంగః ఇతి

ఏత దుక్తం భవతి — ప్రకృతిస్థత్వాఖ్యా అవిద్యా, గుణేషు చ సంగః కామః, సంసారస్య కారణ మితి త చ్చ పరివర్జనాయ ఉచ్యతే,

అస్య చ నివృత్తికారణం జ్ఞానవైరాగ్యే ససన్న్యాసే గీతాశాస్త్రే ప్రసిద్ధమ్। తచ్చ జ్ఞానం పురస్తాత్ ఉపన్యస్తం క్షేత్రక్షేత్రజ్ఞవిషయం "యద్ జ్ఞాత్వా అమృత మశ్నుతే" ఇతి

కించ "సమ్యగ్దర్శననిష్ఠానాం సన్న్యాసినాం సద్యోముక్తి రుక్తా। కర్మయోగ శ్చ ఈశ్వరార్పిత సర్వభావేన ఈశ్వరే బ్రహ్మణ్యాధాయ క్రియమాణః సత్త్వశుద్ధి, జ్ఞానప్రాప్తి సర్వకర్మసన్న్యాసక్రమేణ మోక్షి యేతి భగవాన్ పదేపదే ఽబ్రవీత్, వక్ష్యతి చ॥ ...... "ఇదం సర్వగుహ్యతమం గీతాశాస్త్రమ్, భగవ త్యసూయాయుక్తాయ సమస్త గుణవతేఽపి న వాచ్య మితి చ।"

"అపరోక్షాత్మ విజ్ఞానం శాబ్దం దేశికపూర్వకమ్।
సంసారకారణాజ్ఞాన తమస శ్చండభాస్కరమ్॥"

అపరోక్షముగా ఆత్మజ్ఞానము కలుగుటయే ఆత్మసాక్షాత్కారము. సుఖదుఃఖప్రతీతి ఎంత వున్నను జ్ఞానికి భయము లేదు. నిత్యానందుడు గానే ఉంటాడు. జ్ఞానులైన అద్వైతవేదాంతులు, "యోగులదికూడ పర తంత్రసుఖమే అది స్వతంత్రమైన ఆత్మసుఖము కాదు" అందురు. మనస్సు నిశ్చలముగా వుంటే నేను సుఖించుచున్నాను అని అనుకోవడమే వివేకము లేనివానిస్థితి. అహో అజ్ఞజనాజ్ఞతా! తనసుఖము తనలోనే ఉన్నదని తెలిసికొనుటయే జ్ఞానిలక్షణము. "అది దేనిమీద ఆధారపడిలేదు" అని తెలిసికొనుచున్నాడు. అసలు తా నెవడో ముందు తేలవలె నని శ్రీశంకరు లందురు.

ఆత్మయొక్క సహజస్థితిని తెలిసికొన్నచో ఆత్మానుభూతి నిరాటంకముగా నిరంతరముగా ఉండును. ఆత్మానాత్మస్వరూపము బాగా తెలియవలెను. అనాత్మ అన్నది లేనేలేదు. ఉదా॥ జలము+తరంగము, ఇదియే అఖండఅద్వైతానుభూతి. వైకుంఠము పోయి విష్ణుదర్శనము

చేయుటకు పుణ్యములు తప్ప, ఇంద్రియములను ధిక్కరించి చూడ
గలిగిన బుద్ధి మేధ అక్కరలేదు.

జ్ఞానవంతుడు తనజ్ఞాన మను మహాధనమును తెలియనీయకుండ
అవివేకులగు చోరులమధ్య తెలియనివానివలె మెలగుచుండును.

ఒక్కక్షణము స్వరూపవిస్మరణయే సర్వసంసారమునకు
మూలము ఆ మరపులో అంత దోష మున్నది. స్వప్న ఉదాహరణము
చాలును. అపుడు స్వరూపవిస్మృతివలన ఒక్కక్షణంలో మహారణ్యము
అందులో వందలకొలది మృగములు భయము తటస్థపడినవి. ఈ ఉప
ద్రవ మంతయు మెళకువలో ఉత్తరక్షణమే పోవునుగదా! కలలో కన
బడిన పెద్దపులిగూడ అదృశ్య మగును ఆలాగే జ్ఞానప్రబోధ మొన
ర్చిన గురువుగారుకూడ అదృశ్య మగును. కొందరు "శబ్దము" పరోక్ష
ముగానే చెపుతుం దంటారు "అస్తి" అని. "తత్త్వ మసి" అపరో
క్షము. అహం బ్రహ్మాస్మి। అస్మి-అపరోక్షము. "సాక్షా దపరోక్షాద్
బ్రహ్మ."అపరోక్షముగా అనుభూతి రావడానికి శబ్దమే చాలును. ప్రమా
తృత్వమును గూడ పడగొట్టునది వేదాంతప్రమాణము. సాక్షి ప్రత్యక్ష
మును అపరోక్ష మని వేదాంతులము మేము చెప్పుదుము. అహమా
కారవృత్తిలో స్వప్రకాశంగా అభివ్యక్తమైనాడు ప్రత్యగాత్మ. ప్రత్య
గాత్మయే బ్రహ్మవస్తువు. బ్రహ్మము ఎక్కడో వేదాంతములో లేదు.
దానివివరం మాత్రం అక్కడ ఉన్నది. కర్తృత్వభోక్తృత్వబంధన
మంతయు నిర్విశేషబ్రహ్మజ్ఞానము వల్లనే పోతుంది. నే నెవరు అను
విచారణవలన అభయమైన నన్నుతెలిసికొన్నచో నన్నుగురించిన
అజ్ఞానం పోవును. అపుడు ఆ అజ్ఞానంవల్ల నేను లోపుట్టిన కర్తను
భోక్తను అనునట్టి అనర్థభావాలు సకలము పోవును.

తృణాచ్ఛాదితకూపములవలె, స్త్రీలు తత్సంబంధమైన విషయ
ములు అన్నీ ఉన్నవి. కాన జాగ్రత్తగా విచారించియే యెందులోనైనను

దిగాలి. పశువులవలె మనం గూడ కాగూడదు. తనలో వున్నసుఖమే బయట విషయముగా కనుబడుతుంది. జాగ్రత్త! జాగ్రత్త! కనుక పరిశీలన జేసి ఏదైన నిర్ణయించుకొని కోరవలెను.

ఎంతమంది కుమారులు లాలింపబడలేదు. ఎంతమంది వధువులను అనుభవింప లేదు; అసుతులు, ఆసతులు ఎక్కడ ఉన్నారు; మనము ఎక్కడ ఉన్నాము. ఈ సంసారమున ఒకరితో ఒకరు కలియుట బాటసారులకలయిక వంటిదే.

"కతి నామ సుతా న లాలితాః కతివా నేహ వధూ రభుంజి।
క్వ చ తే క్వను తాః క్వవా వయం భవసంగః ఖలు పాంథసంగమః॥"

సర్వజీవసమూహము పుట్టుచు చచ్చుచు నున్నది. జీవితమంతయు ఈధనకనకవస్తు-వాహనాదులతో వెళ్లబుచ్చదా మని మనం గూడ, అందులో వుండే మహావిషం తెలియక పసిపిల్లలవలె తలంచుచున్నాము. గృహారామక్షేత్రవిత్తాదు లను మహాసర్పములతో తెలియక చెలగాటం ఆడుటవలన కలుగు మహాపకారము జన్మజన్మలకు అనువర్తించును.

చతుస్సముద్రముద్రితమైన వసుంధరయొక్క సమస్తఐశ్వర్యములు దుఃఖమయమే యని తెలిసికొనవలెను. పనికిమాలిన వస్తువులను ఎపుడూ ధ్యానించవలదు.

"ధ్యాయతో విషయాన్ పుంసః సంగ స్తేషూపజాయతే
సంగాత్ సంజాయతే కామః గీత.

సంసారచక్రానికి ఆద్యంతములు లేవు. మరి ఎట్లా? ఏమిటి ఎట్లా? ఈసంసారదుఃఖమునుండి నేను బయటపడడ మెట్లా? దానినుండి తొలగడమే దాని కంతము; మరొకమార్గం లేదు.

"అశ్వత్థ మేనం సువిరూఢమూలం
అసంగశ స్త్రేణ దృఢేన ఛిత్వా" గీత 15వ అధ్యాయం

మనకున్న ఈదేహేంద్రియాదిసామగ్రి క్షణభంగురము అనగా ఎప్పుడో ఏవేళనో ఏవిధంగానో పోవచ్చును. కనుక ఇంతలోనే ఇవి మనలను వదిలిపోవు లోపలనే వేగంగా శాశ్వతవస్తువును సంపాదించు కొనుటకు ప్రయత్నించవలెను.

బ్రహ్మానంద మను గంగానదిలో మునకలు వేసి స్నానము చేయుము; విషయసుఖాల ముష్టికి పోవలదు. అజ్ఞానమనే భూతమే మనకు పరమశత్రువు.

కామము దుర్భరము; ప్రబలశత్రువు. కామమును తీసివేయు టకే సర్వుల ప్రయత్నము. కామముతో రాజీపడడమే కోరిక తీర్చు కోవడము. మూడవనేత్రము తెరవడమే కామజయమునకు మార్గము. అజ్ఞానావరణములో వీనిని వీడు అనేక విధములుగా భావించి సుఖదుఃఖ ముల ననుభవించుచున్నాడు అన్నిలోకాలలోని ఐశ్వర్యములు చంచల ములైన అనిత్యాలే. లోకములో ప్రసిద్ధులము కావలయు నను వాసన ఉండకూడదు. రామకృష్ణాదులే గతించినారు. మోక్షమను పరమ లాభాన్ని కోరునట్టి మనము దానికి తగు ఆచరణలో ఉండవలె.

విషయవాసనలు ఏవీ అంటకుండా చరించేవాడే ధీరుడు. ఇపుడు పుట్టే బుద్ధులు (భావాలు) అనుసరించియే, పూర్వభావాల సంస్కారాలు ఫలానా అని తెలుసుకోవచ్చును

ఆత్మజ్ఞానం సంపాదించుకొను పరిశ్రమలో ఉండకుండా "బాదర బంది" అంతా మీద వేసికొనేదెందుకు!

## 8. బ్రహ్మవిచారణ

దారాపత్యధనకనవస్తువాహనాదులను చాలజన్మలనుంచి ఉపాసన చేస్తున్నాము. ఇపుడు వాటిని వదులుటకే భగవత్తత్త్వవిచారణ చేయ వలెను. తనఇంట్లో దొంగలు పడటము చూడకుండా పరులయింట్లో దొంగలు పడ్డారని పరుగెత్తుకొనిపోయి విచారించుట; తర్వాత తన

యింట్లో జరిగిన దొంగతనమునకు చింతించుట అవివేకము. తనకు అసక్తిగల విషయము ఎంతో బాధకు హేతువైనను దానియందు ప్రేమ పోదు. ఉదా — ధృతరాష్ట్రుడు.

వాసనాక్షయమునకు మూల మేమి? వ్యతిరేకసాధనయే. తత్త్వజ్ఞానమున్నా ప్రపంచవాసన పోదు.

వ్యతిరేకాభ్యాసము వాసనానాశనమునకు సాధనము.

యోగాభ్యాసము మనోనాశనమునకు సాధనము.

శ్రవణ మనన నిదిధ్యాసములు తత్త్వజ్ఞానదార్ఢ్యమునకు సాధనములు.

ఎవరికివారు భయముతో ఆత్మపరీక్ష చేసికొనవలెను. అందుకు భక్తికంటే భయమే ముఖ్యసాధనము. వ్యతిరేకసాధన అనగా ఏదైనను పాపవృత్తి వచ్చినపుడు "రామ రామ" పాపము శాంతించు గాక అని అనుకొనుచుండుట.

మనము ఏ పొరబాటు చేస్తే లోకులు ఎలా శిక్షిస్తారో అను భయమే కలిగిఉండవలెను. ఇదే శ్రేష్ఠము. వైద్యుడు చెప్పిన నియమములను మనము జాగ్రత్తగా పాటిస్తాము. ఎందువలన? చస్తామని భయముచేతనే. భగవంతుడు గూడ "నేను మొదటి వైద్యుడను" "అహం ప్రథమో దైవ్యో భిషక్" అని చెప్పుచున్నాడు.

బుద్ధి ఉపశమిస్తే కాని రానిది బ్రహ్మానుభూతి. బుద్ధి ఉంటేనే మిగిలిన విషయాలు జరుగుచున్నవి. ఇందుకు సుషుప్తియే ఉదాహరణము. సుషుప్తిలో బుద్ధి ఉపశమించి వున్నది. అందుచేతనే మేలుకొన్నప్పటికంటే (బుద్ధి సంచారములో ఉన్నప్పటికంటే) నేను అనే వాడు నిద్రలో హాయిగా ఏ ఉపద్రవములు లేకుండ ఉన్నాడు. అయిన్లా బుద్ధి నిద్రలోవలె ఉపశమించకూడదు. ఎలా ఉపశమించవలెనంటే బుద్ధి మొదలగున వన్నియు మిథ్యారూపముగా ఉపశమించవలెను

తాదాత్మ్యము లేనివాడు. జీవన్ముక్తులకు అవి ప్రతీయమానము లగు చున్నను, వారికి అవి యేమీ సంబంధించవు.

సుషుప్తిలో తనదేహము గాని, దానికి సంబంధించిన దారాపత్య క్షేత్రవిత్తాదులు ఏవీ లేకపోయిన గాని వీడు హాయిగా సుఖించు చున్నాడు. ఇది తెలిసికొనుటే ఆత్మజ్ఞానము. ఈ ప్రత్యగాత్మయొక్క సహజస్వరూపమును విచారించి గుర్తించుటయే మహాదేవపూజ తత్త్వ విచారణయే అసలు పూజ. దీనికి తనప్రజ్ఞ, గుర్వనుగ్రహమే ప్రధాన ములు. గురుసేవకు, ఈశ్వరారాధనకు ఫలము తనఆత్మ నిత్యానంద స్వరూపముగా ఉన్న దని గుర్తించుటయే. దేహేంద్రియాదులు ఏవీ లేని సుషుప్తిలో ఆత్మ సహజానందములో ఉన్నది గనుక మనము ఏమి చేయవలెను? జాగ్రత్తలో గూడ ఈదేహేంద్రియాదులను కలుపు కోకుండ ఉండటమే చేయవలెను. సర్వసంక్షోభములు పొందుచున్న ఈ ద్వైతప్రపంచములో ఏ సంక్షోభములేని ఆత్మ నిత్యానందస్వరూపముగా వెలుగుచున్నాడు.

శరీరం చచ్చినను ఆత్మ చావదు. "న హన్యతే హన్యమానే శరీరే". ఇది తెలియుటయే అసలు సమాధి. సుఖదుఃఖములు ఏవి వచ్చు చున్నను సాక్షియైన ఆత్మకు ఏలోపము లేదు.

నేను సచ్చిదానందపరబ్రహ్మమే యని తెలిసికొనుటయే పర మాత్మపూజ. తనసర్వకార్యములలోను తననగురించి విచారణ, అనగా తన సచ్చిదానందస్వరూపమును మరువకూడదు. అది సంతతాధ్యానము వలన రాగలదు.

శ్లో॥ "పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్
భాషించుచున్ హాసలీ
లానిద్రాదులు సేయుచున్ దిరుగుచున్
లక్షించుచున్ సంతత

శ్రీనారాయణపాదపద్మయుగళీ
చింతామృతాస్వాదసం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డే
తద్విశ్వమున్ భూవరా॥" — భాగవతము

వేయితలలత్రాచుపామును ఒక్కతడవ అదిమి పట్టి కాటువేయ కుండ లోబరచుకొనుట ఎట్లో, అట్లే అద్వైతజ్ఞానమునకు సరిగా అర్థముజేసికొనుట కష్టము. అనుష్ఠానపేక్షముగా ఫలమునిచ్చునది ధర్మము. అనుష్ఠాననిరపేక్షముగా జ్ఞానమాత్రముచేతనే ఫలము నిచ్చు నది వేదాంతము. తెలియగానే సర్వానర్థనివృత్తిసంభవించును. అట్టి జ్ఞానము బుద్ధిమంతుల కందరికి అభిలషణీయమే గదా.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" సత్యం = మార్పులేనిది, ఎప్పుడూ ఉన్నది. జ్ఞానం = దానంతట అదే ప్రకాశించుచున్నది; ఏదియు అడ్డము లేకుండ ప్రకాశించును. అనంతమ్ = అంతటను వున్నది. ఆనందోబ్రహ్మ = బ్రహ్మము మనము కోరునట్టి శాశ్వతానందమే. "ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన." అట్టి బ్రహ్మానంద మును ఎఱిగినవాడు దేనినుండి భయపడడు.

ఇక ఆత్మవిషయములో "నేతి నేతీ త్యాత్మా" అనెడి ఆదేశ ఉప దేశముచేత, నామరూపోపాధిధర్మములైన అంతఃకరణధర్మములను మినహాయించి తన స్వరూపచైతన్యముతో సహజముగా ఉండటమే జీవన్ముక్తఆనందమును పొందుట. ఇదియే తత్త్వసాక్షాత్కారము; సమ్యక్జ్ఞాన నిష్ఠారహస్యము.

## 9. త్యాగము

బుద్ధియందు ఏవికారములు మమకార అహంకారములు లేకుండ సర్వకామరహితుడై శాంతితో ఉండుటయే త్యాగము.

"ఏషా బ్రాహ్మీస్థితిః" వస్తుతత్త్వము తెలిసి త్యాగముతో ఉదాసీనంగా ఉండుటయే జ్ఞానిలక్షణము.

దుఃఖము ఇష్టముగాకుండ ఉండటములోనే మనకు దుఃఖము సహజము గాదని శంకరులు చెప్పుచున్నారు. దుఃఖము ఉన్న దని దానిని పోగొట్టదలచుకొని కర్మోపాసనాపరు లైనారు ఇతరు లందరు. దుఃఖము ఎపుడూ లేదను కుదిరికే న్యాయమైనది. మనసులో ఏది వచ్చినను ఏది పోయినను నే నెలా ఉన్నా నన్నది తెలిసికొనుచుండ వలెను. నేనే వాటి నన్నిటినీ ప్రకాశింపజేయుచున్నాను. సర్వప్రకాశ స్వరూపుడను నేనే. "అవికార్యోఽయ ముచ్యతే" నీవు నిర్వికారచైతన్య స్వరూపుడివే. నీ వేమీ చెదరుట లేదు. చెదిరేది నీవు కాదు అనునట్టి కుదుర్చుకొనవలెను.

## పుణ్యము - పాపము

కొన్ని పనులు వాని స్వరూపము ననుసరించియే తప్పులు-పాపములు

కొన్ని పనులు మంచివి అయినను ఫలముమీద ఉన్న కోరికను బట్టి తప్పు-పుణ్యములు.

అధర్మము స్వభావముచేతనే నిషిద్ధము.

ధర్మము ఫలకామనచేత నిషిద్ధము.

నిష్కామ్యమైన పుణ్యధనము ప్రభూతముగా ఉన్నవారికే చిత్తశుద్ధి కలిగి, ఆత్మవిచారణ పుట్టడము, సద్గురువు లభించడము, వారి సదుపదేశములను గ్రహించగలిగిన మేధ ఉండడము, కలుగును. ఇవన్నియు ప్రాప్తమై మోక్ష మనుశాశ్వతానందము లభించగలదు.

సర్వప్రపంచము నిండుగ శాశ్వతానందఘనమైన పరమాత్మయే యున్నాడు. అపరమాత్మ నిర్మలమైన బుద్ధియందే ప్రకాశిస్తాడు.

ద్రష్ట అయినట్టి తనను వదిలిపెట్టి దృశ్యమైన విష్ణువును ఆశ్రయించి సుఖపడదామన్నచో అదియు దుఃఖమే. తనలోనే "స్వే మహిమ్ని"

సంపూర్ణసుఖము దుఃఖరహితముగా వున్నది. దయ్యము పట్టినను, దేవుడు పట్టినను రెండును త్యాజ్యములే. ప్రమాణము ప్రపంచము మీదనే ప్రవర్తించును గాని బ్రహ్మముమీద కాదు. స్వప్నప్రపంచము లోని మంచిచెడ్డ లన్నియు మేలుకొనగానే బొత్తిగా ఉండవు. స్వప్న ములో నీ ఒక్కడవు తప్ప అక్కడ మరొక్కడు లేడు.

బ్రహ్మవేత్త ఏడ్చినా డని ఎవడైన అడిగినచో వానికి జవాబు: అతను ఏడవలేదు, నవ్వనూలేదు; ప్రారబ్ధమువలన అట్లు కన్పించు చున్నాడు? ప్రారబ్ధము ఎవరికి? నీకే. నీవే ఏడ్చేవాడివి. బ్రహ్మ వేత్తకు బంధము లేదు ముక్తి లేదు. "న బద్ధో న చ సాధకః". అద్వై తులు "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" అని చెప్పుదురు. విశిష్టాద్వై తులు ఇచ్చట ఏవ అను శబ్దమునకు ఇవ అని అర్థము చెప్పుదురు? అంటే బ్రహ్మవేత్త బ్రహ్మమువలె ఉండు నని వారిభావన.

## అలవాటు

వ్యాపారస్థుడు – గుమాస్తా. వ్యాపారస్థుని అలవాటు, మరొక వ్యాపారము పెడదామని గుమాస్తా, మరొకరివద్ద గుమాస్తాగా చేరదా మని. అది వానిఅలవాటు, ఇది వీని అలవాటు. నేనే షావుకారిని, నీవు గుమాస్తాగానే వుండు; ఇది నాఅలవాటు అంటాడు అద్వైతి. నీవు సేవ కుడుగానే ఉండవలెనని ఇతరు లంటారు. ఇక వేద మెందుకు, నీకు ఉపనిషత్తులు ఎందుకు?

అదిగో! ఆచెట్టుమీద దయ్యము ఉన్నది, అంటే ఎవ్వరూ అ వైపు పోరు. విచారించినవాడు లేడు. "నేను ఆరోగ్యవంతుణ్ణి" అనేది గతానుగతికము. "నేను" అనేవానియందు ఏదీ లేదు. వీడు నిత్యానందుడే. సదా శివుడే. రజ్జువునందు సర్పము ఎపుడు పుట్టినది? ఎపుడు పెరిగి నది? ప్రపంచము కనబడుచుండుట ఖాయము; కాని విచారిస్తే లేనేలేదు. ఉండి కనుబడుట ఒకటి; లేక కనుబడుట మరొకటి.

అద్వైతబ్రహ్మమునందు ఏప్రమాణములు ప్రవర్తించవు. ద్వైతనిషేధమునందే శాస్త్రములకు తాత్పర్యము. నామము రూపము మొదలుగా అనాత్మవిషయముల అధ్యారోపణమును మాత్రమే బ్రహ్మమునుండి తీసివేయవలయుటయే కర్తవ్యము, కాని బ్రహ్మవిజ్ఞానమును గూర్చి యత్నము కర్తవ్యము కాదు అది ప్రత్యగాత్మస్వరూపముతో అత్యంతము ప్రసిద్ధమైయున్నదే కదా!

నామరూపాద్యనాత్మాధ్యారోపణ నిరాకరణ మాత్రం బ్రహ్మణి కర్తవ్యం, న తు బ్రహ్మవిజ్ఞానేయత్నః, ప్రత్యగాత్మ స్వరూపేణ అత్యన్త ప్రసిద్ధత్వాత్।

1) అగుట.

2) కలియుట రెండును స్వరూపనాశనమునకే దారితీయును. అద్వైతి చెప్పునది ఏమనగా జీవుడు బ్రహ్మము కావడము అంతే తాను జీవుడు కాదు బ్రహ్మమే అని తెలుసుకోవడమే. తాను విడిగా వుండుట తీసివేసికొనుటే. "జీవో బ్రహ్మైవ నాపరః". "జీవుడు బ్రహ్మమే అన్యుడు కాదు". కామము అను రాక్షసునిప్రాణము ప్రపంచవస్తుసత్యత్వ బుద్ధియందే దాచిపెట్టబడి వున్నది. "ప్రపంచము సత్యము కాదు" అని బాగా అర్థమైతే దేనిమీదను కామము పుట్టదు.

అకర్త్రాత్మదర్శనం బ్రహ్మ. అది అయిన తార్వాత ఉపాసన మెలా? శ్రీఅరవిందుల "అసెండు, డిసెండు" ఎలా? మోక్షమను మహాస్సామ్రాజ్యము పొందువానికి ఏక్రియ అవసరం లేదు; జ్ఞానం తప్ప. "జ్ఞానా దేవ తు కైవల్యమ్". 'నాన్యః పంథా విద్యతేఽయనాయ". ఆత్మజ్ఞాన మంటే సాక్షాత్కారమే అజ్ఞాననివృత్తికొఱకే ప్రయత్నము. బ్రహ్మసాక్షాత్కారముకొఱకు గాదు. తనను గురించి అజ్ఞాననివృత్తి కాగానే ప్రత్యగాత్మయగు బ్రహ్మము స్వయముగా ప్రకాశిస్తుంది. అందు ఆనందాంశము ఎపుడును తిరోహితము కాదు. "ఆత్మన స్తు కామాయ సర్వం ప్రియం భవతి".

ఆనందము తెలుస్తూనే వుంది కాని సరిగా తెలియుట లేదు; తెలియవలసినట్లు తెలియలేదు. ఆత్మకు దుఃఖము ఉన్నదని, దానిని తొలగించడానికి ప్రయత్నించుట కర్మమార్గము. ఆత్మకు దుఃఖ మెపుడూ లేదని తెలిసికొనుటయే వేదాంతమార్గము. ప్రత్యక్షాదిప్రమాణములచేత నిరూప్యమాణమైన ప్రపంచమును వేదాంతము ఎలా లేదని చెప్పగలదు? ప్రమాణముల బలాబలము లెట్టివి? ప్రత్యక్షప్రపంచమును విమర్శించితే, దానిసత్తా నిలవటం లేదు.

ప్రత్యక్షాదిప్రమాణము బలముగలదైనప్పటికినీ, అనుమానానికి వెనుక ప్రబలమైన "నేతి నేతీతి" శ్రుతిప్రమాణము బలవత్తరమై ఉన్నది గనుక శ్రుతి జయిస్తుంది. ఉదా:– ధనికుడైన పురుషుడు, ప్రభుత్వాధికారి అయిన భటుని ఆజ్ఞకు లొంగవలసినదే. త్రికాలాబాధ్యము సత్యము. దేహేంద్రియమనోబుద్ధ్యాదులు, సర్వప్రపంచము ఆత్మసత్తాస్ఫురణము వల్లనే కనబడుచున్నవి. ఆత్మసత్తాస్ఫురణలే దేహామునకు అనువర్తిస్తున్నవి.

లాభనష్టాలు లేనిచోట న్యాయము బాగుగా తెలియగలదు. కుండమిథ్యాత్వమువలన మనకు వచ్చిన లాభ మేమి? మృద్ఘటముల వద్ద ముడి పీడెనా అదే బ్రహ్మాస్త్ర మగును. మృత్తు తర్వాత జలము తర్వాత మరొకటి ఆ చివరతేలునది చైతన్యమే.

నేను లేకుండ బ్రహ్మ విష్ణు మహేశ్వరు లెవరూ లేరు. "బ్రహ్మణో హి ప్రతిష్ఠాహ మమృతస్యావ్యయస్య చ। శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాంతికస్య చ॥" గీత॥

అఖండస్థితి అర్థమగుటకు లక్షణావృత్తియే "తత్త్వమసి" యను మహావాక్యమునందు సమంజస మగును. శక్తివృత్తి చాలదు.

కేవలబుద్ధివలన సత్యం తెలియదు. శ్రుతి ననుసరించినసద్గురువులబోధ నందుకొనుటకు బుద్ధి ఉపయోగపడును. నేను ఎవరో చెప్ప

మనుటయే జిజ్ఞాస. గురువువద్దకు వెళ్లి అడగటం దానినే. భగవంతుని కంటె సద్గురువే మనకు జ్ఞానకం లిగించుటకు సరియైన వ్యక్తి. అవివేకం పోగొట్టుకొనుటకు అన్నివిధాలా ప్రయత్నించి వివేకమును పొందవలెను. ఇది చాలముఖ్యము. ఇది దుర్బోధం కనుక మిక్కిలి ప్రయత్నము చేయవలెను.

ఆవరణయుతుడు జీవుడు. నిరావరణమైన చిన్మాత్రము బ్రహ్మము. ఈశ్వరుడు ఆవరణలేని అన్యథాభానం కలిగినవాడు. ఆత్మ, శబ్దముచేత చెప్పజాలని వస్తువు; మనస్సుచేత తెలియబడని వస్తువు అది. అందు వలననే ఆశ్చర్యము.

సద్గురువుతో సమానమైనవారు ఏలోకంలోను లేరు. గర్భవతి తనకడుపులో వున్న శిశువు ఏవిధంగా తన్ను సంకటపెట్టినను ఆశిశువు మీద ఉన్నప్రేమవలన అన్నిటినీ సహించి ఆశిశువుయొక్క క్షేమ మునే కోరుచుండును. ఆవిధంగా సద్గురువులు కూడ శిష్యునియెడల అంత వాత్సల్యముతో ఉందురు. తాపత్రయాగ్నిని చల్లార్చేవారు సద్గురు వులే; వేయిమంది చంద్రులు గూడ చల్లార్చ లేరు బ్రతికివున్న ఈ శవాలను తగలేసే అగ్నులు తాపత్రయాలే. గ్రంథి = ముడి; మామూలు ముడి కాదు; పీటముడి. అహంకారగ్రంథి; అను పీటముడిని తెగ్గొట్టవ లసినదే.

జన్మాంతరములలో చేసిన దుష్టకార్యముల అలవాటుబలమువలన ఇపుడు గూడ ఆ దుష్టకార్యములమీద ఇచ్ఛ కలుగుచుండును. దానిని సత్సాంగత్యమువలన జయించవలెను. జ్ఞానేంద్రియములు తమకు వీలైన శబ్దస్పర్శ, రూప, రస, గంధములను స్పష్టముగా తెలియబరచగలవే గాని, అందలి మంచిచెడ్డలను, అనగా అవి మనము అనుభవిస్తే మనకు శ్రేయస్సో, లేక సర్వనాశనమో తెలియబరచ జాలవు. ఆ సంగతి బుద్ధితోనే, చక్కనిసంస్కారముగల బుద్ధిమేధతోనే తెలుసుకొనవలెను. లేనిచో పశువువలె బుద్ధిలేనివాడ వగుదువు.

ఆత్మ సుఖదుఃఖములను అవభాసింపజేయుచున్నది గాని అను భవించుట లేదు. మృత్యువు చేరనిచోటు మనలోనే వున్నది. అదే "నేను" అనగా ప్రత్యగాత్మయే. దేహేంద్రియాదులయందే మృత్యువు నివసించుచున్నది.

ధర్మమునుగురించి మహర్షులుగూడ భయంతో బహుజాగ్రత్తగా ఉంటారు. ధర్మ మను మూలవేరును ఎంత జాగ్రత్తగా రక్షించుకొంటే అంత మోక్ష మనుఫలమును మనము పొందగలము. నే నను వాని సుఖమునకు తోడ్పడే వాడు లేడు; భంగపరిచేవా డసలే లేడు. ఇక రాగము, భయము, క్రోధము ఉండుటకు వీలే లేదు. తాను ఆనంద స్వరూపుడుగా నిరంతరము ఉండటమే ముక్తి. ఏ ఉపద్రవానికి అందు బాటులోలేనిదే ఈ ఆత్మజ్ఞానము.

తనకే సహజముగా ఉండు ఆనందమునకు ఎవనివల్లను భయము లేదు. బుద్ధిని ఆత్మవిచారమునందు ప్రవేశపెట్టడమే జ్ఞానతపస్సు. అనేకులు మోక్ష మను మహాసామ్రాజ్యమును కోరినను, చిల్లర దేవతలఫలితాలను నిషేధించుకోలేకున్నారు. మోక్షసామ్రాజ్యాన్ని కోరతగినవారికి బ్రహ్మలోకసుఖములను విని వానినిగూడ త్యాగము చేయగల మహావైరాగ్యము ఉండవలెను.

భగవంతుని ఆశ్రయించడ మంటే ఆయన ఏర్పరిచిన వర్ణాశ్రమ ధర్మములను ఆచరించడమే. "నేను యివన్నీ చేసిన కర్త నయ్యూ ఇవేవీ నాకు ఏవికారమును కలిగించని అకర్తనై గూడ ఉన్నాను." అని భగవంతుడు చెప్పుచున్నాడు.

## 10. సద్గురువు

సద్గురువులు తాము సంపాదించినమహాపుణ్యములు తమకు కొన్ని ఉపయోగించుకొన్నవ్పటికి, కొన్ని మిగతవున్నవి, మనకు తక్కు వైనపుడు తమవి అయినను యిచ్చి శిష్యుని కృతార్థుని చేసెదరు.

ఈశ్వరునికి స్వయముగా పుణ్యములు లేవు. మనకున్నపుణ్యములనే దాచియుంచి మన కిచ్చెదరు; మనకు తక్కువైనపుడు వా రేమియు మనకు "సప్లై" చేయరు

తెలిసికొనుచున్న వానిని, తెలియబడేవస్తువు ఏమియు చేయ లేదు. గృహములో దీపమువలె "నేను" అనువాడు ఉన్నాడు. ఆకా శంలో రకరకాల మేఘము లున్నను ఆమేఘములు ఆకాశాన్ని ఏమియు చేయలేవు

మందలోవున్న మేకపిల్లలను గొల్లవాడు గుర్తించుటకు అనవ రతపరిచయమే కారణము. ఈవిలక్షణాత్మపరిచయము కూడ ఆలాగే అనవరతపరిచయమువల్లను, నిరంతర సత్సాంగత్యమువల్లను లభ్య మగును

పద్మపాదాచార్యులవారు శ్రీనరసింహస్వామిదర్శనంకొరకు అరణ్యములో తపస్సు చేయుట, చెంచుకుఱ్ఱవానితో సంభాషణ, శ్రీలక్ష్మి నరసింహస్వామిని తీగలతోకట్టి ఆచెంచువాడు పద్మపాదాచార్యుల వారికి దర్శనము చేయించుట అను ఉదంతము భక్తియొక్క మహి మను బోధించుచున్నది.

జ్ఞానం విజ్ఞానం, ఈ భేదము గమనించవలె మడికట్టుకొను మనగా కొంతతృప్తి భోజనం సమగ్రంగా చేసినపుడు పూర్తితృప్తి. వేలకొలదిమనుష్యులలో ఒకానొకడు సిద్ధికొఱకు యత్నించును.

"మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్ యతతి సిద్ధయే"

హృదయాలలో ఉన్న భావాలవలన మనుష్యులు అనేక విధ ములు భావాలు పూర్వజన్మలవి; శరీరము ఈజన్మది. ఒకానొకడు సద్విషయగోష్ఠికి నేను గూడ వచ్చెద ననును. మరొకడు, "నీవుపొమ్ము; నేనురా"నను. జననమరణములు లేకుండ, తాను అభయు డగువరకు

శ్రవణము చేయవలసినదే. "నేనే" అందరి దేహాలలో ఉన్నాను. ఆ విధమైన తత్త్వానుభవము వచ్చునంతవరకు సద్గురువులవద్ద శ్రవణము చేయవలెను.

నారదులవారికి శ్రీమహావిష్ణుదర్శనము కలిగినది. అప్పుడు విష్ణుదేవుడు ఇట్లు చెప్పెను. "నారదా! నీవు చూచుచున్న యీరూప వైభవము నాచేత సృష్టింపబడినమాయయే. సర్వభూతగుణములతో కూడియున్న నన్ను ఈవిధముగా చూచుట నీకు కూడ సులభము కాదు."

"మాయీా హ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద।
సర్వభూతగుణైర్యుక్తం మైవం మాం ద్రష్టు మర్హసి॥"

తత్త్వజ్ఞుడు నిర్వికారాఖండచైతన్యమును దర్శించవలెను. అనగా అట్టి స్వరూపము తన్నుగా తెలిసికొనవలెను. అదియే తత్త్వతః తెలిసికొనుట.

సుఖించదలచినవాడు సత్యమునే ఆశ్రయించవలెను. అసత్యమును ఆశ్రయించినవాడు జననమరణాదిదుఃఖసంయుతమైన సంసారమునే పొందును.

నిజమైన నదీప్రవాహమును ఆశ్రయించినవాడు, ఒకడు. ప్రవాహమువలె కనబడే ఎండమావులను చూచి ప్రవాహము అనుకొనువాడు ఇంకొకడు. ఈ రెండవది ప్రతీతిమాత్రమే. సుఖముగా తోచునట్టి ద్వైత ప్రపంచము ఎండమావుల ప్రవాహమువంటిది. భార్యాపుత్రధనకనక వస్తువాహనాదిద్వైతప్రపంచ మంతయు సుఖహేతువుగా కనబడుట ప్రతీతిమాత్రమే గాని సత్యము గాదు. సుఖపడదలచుకొన్నవాడు వేదాంతమునే బ్రహ్మవేత్తలనే ఆశ్రయించవలెను. దేహేంద్రియాది విషయములను ఆశ్రయించిన వానికి చివరకు మరణించుయోగమే తటస్థపడును. విషయజాత మంతయు బ్రహ్మలోకములోనైనను అసత్యమే

యనుట ఖాయము. రాజసూయాదిక్రతువులవలన నైనను చివరకు తేలునది దుఃఖమే.

"సంస్పర్శవలన కలుగుచున్నభోగము లన్నియు దుఃఖమునకే మూలములు. అవి ఆద్యంతములు కలవి. వానియందు బుధుడు రమింపడు."

"యే హి సంస్పర్శజా భోగాః దుఃఖయోనయ ఏవ తే।
ఆద్యన్తవంతః కౌంతేయ న తేషు రమతే బుధః॥" గీత॥

రాజసూయాదుల ప్రభావములు అవివేకులవద్ద చెప్పవలసినదే; తత్త్వవేత్తలవద్ద చెప్పవలదు చెప్పువాడు తలవంచుకోవలసివచ్చును. బ్రహ్మలోకసుఖము సత్యదృష్టిలో దుఃఖమే.

సత్యమునే ఆశ్రయించినచో నిరంతరసుఖమే. అసత్యము నాశ్రయించినట్లైన ఎపుడూ దుఃఖమే. సత్యవస్తువెద్ది స్వామీ?

ఉండి కనబడునది సత్యవస్తువు. లేక కనబడునది అసత్యవస్తువు.
"నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః"

లేకుండ కనబడునది సినిమాలోవలె లేకనేపోయె. దానినివాడు కొనుటకు ప్రారంభించునప్పటికి అది యుండదు

ఉండి కనబడునది ఎపుడూ ఉన్నది గనుక నీకు నిరంతర సుఖమే.

ప్రపంచము, బ్రహ్మవిష్ణుమహేశ్వరులరూపములుకూడ అసత్యములే. ఎవరు నామరూపములతో కన్పింతురో వారు యథార్థముగ ఉన్నవారు కాదు. నామరూపములు వస్తువులు కాదు. "వాచారమ్భణం వికారో నామధేయమ్" అన్నిలోకములు అసత్యములే. అద్వైతి ఆ లోకములను దాటి పోవును. "పెంజీకటి కవ్వల నెవ్వం డేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్॥".

అద్వైతి సత్యమును సర్వత్ర చూపించెద నసును. సత్య వస్తువే అసత్యవస్తువుగా కనబడుచున్నది. అసత్యవస్తు వనునది లేదు. పొరబాటుగా అర్థం చేసికొనుటవల అసత్యవస్తువు కనబడుచున్నది. ఉన్నది సత్యమే. అసత్యవస్తువు లేనేలేదు. పరిశీలించువానికి త్రాడే సత్యము. సర్పము లేనేలేదు. అద్వైతబుద్ధిమేధయే కావలెను. గోడ మీద చిత్రించినమేడ కాపురానికి పనికివచ్చునా? అద్దెకు యివ్వడానికి ఉపయోగపడునా? నశించునట్టిరూపమును నమ్ముకొని సుఖపడెద నని అనుకొనువాడు తెలివితక్కువవాళ్లలో మొదటివాడు. అసత్యద్వైత మును ఆశ్రయించి సుఖపడ లేవు. దేహామే మొదట అసత్యమైన వస్తువు. నేను కాని దేహమును నే ననుకొనుటయే తప్పు. నే నను వానిని బాధపెట్టునది దేహామే కద. నిర్వికారవస్తువే సత్యము. అదియే ఉన్నది.

ఏవస్తువునకైనా సొంతముగా ఒకస్వభావం ఉండును. కాన "నేను" అనేవానికి స్వభావము ఏమిటి? స్ఫటికమణికి తెలుపు స్వభా వము వేరు రంగు దానికి ఏదైనా వస్తే అది ఆరోపితమే, అది దాని స్వభావము కాదు. కనుక "నేను" అనువాని స్వభావ మేమిటి? వేదాంత ముల నడుగవలెను. దానినే గురువు చెప్పవలెను. అందువలన కావల సినది వేదాంతము; సద్గురువు. మిగతావాళ్లు ఏడవడానికే. నీసహజ స్వభావము బ్రహ్మమే. అదియే అఖండానందము. నే ననేతావున దేహము ఉన్నందున సర్వదుఃఖములు వచ్చుచున్నవి.

బ్రహ్మము ప్రపంచము ఎపుడూ కాలేదు. నిర్వికారియైన వస్తువు వికారి అగునా! తెలివితక్కువవలన అన్నియు కావచ్చును.

"సర్వధర్మములు, అనఁగా, సకలప్రాణులు స్వభావముచేత జరామరణ రహితములు".

"జరామరణనిర్ముక్తాః సర్వే ధర్మాః స్వభావతః"

(మాండూక్యోపనిషత్తు.)

"మరణము అమంగళ మని అనుకొందురు; నీపుణ్యము లన్నియు మరణముతరువాత ఫలము నిచ్చునవియే కదా! నిన్ను నీవు అర్థంచేసికొనుటకు వాటిని మార్చుకొనవలెను.

ధర్మాధర్మములు – శరీరము వీనిలో ఏది ముందు? హేతువు ముందా? ఫలము ముందా? అబద్ధాల పంచాంగప్రణాళిక అబద్ధమే. అయినను సత్యఫలము నిచ్చు అబద్ధాన్ని ధర్మాధర్మప్రణాళికను సేవించవలెను. అనాదినుంచి ఇట్లాగే వుంది అను వానికన్నను నాకు తెలియదు అనువాడే మెఱుగు. బుద్ధిమంతుడు నాకు తెలియదు అనును. అజ్ఞానమునుంచే సర్వము బయలుదేరినది.

బీజాంకురన్యాయమున ప్రపంచము ఉన్నది అందురు. విత్తు ముందా? మొక్క ముందా? ప్రశ్న. అందుకు అద్వైతిసవాలు:– ఏ విత్తుకు? ఏ మొక్కకు? ఇక నోరు ముయ్యి. ఈప్రపంచము ఎప్పుడూ లేదు. స్వప్నంలో మేడ ఎప్పుడు ఉన్నది? "స్వప్న జాగరములు సమములు" (భాగవతము) ప్రపంచము కనబడుచున్నది గదా! అంటే, కనుబడలే దని ఎవరు చెప్పినారు! కనబడుచున్నది కనుకనే లేదు. నీవు కనుబడినదాని నంతయు ఉన్న దని చలామణిచేయగలవా? వస్తువు ప్రతీయమానమైనను లేకపోవచ్చును. కనబడనిదే వున్నది. ఉన్నది కనబడక పోవచ్చును.

ఏ ఇతరసాధనములవల్లనైనను ఈ"నేను" అనే వానికి ఇపుడు అనుభవములో ఉన్న జరామరణరోగాదిఉపద్రవములు పోయి నిత్యానందము రాదు. ఒక్క పరమాత్మ స్వరూపుడైన గురువే మనకు అభయమైన స్థితిని కరుణతో ప్రసాదించగలడు. బ్రహ్మమును ఎఱిగిన మహనీయులు గూడ అవివేకులమధ్యనే తిరుగుచుందురు. వారిజాడ వేసు ఈ"నేను" అనే వాడు అన్నివ్యవహారములకు మొదట వుండవలెను. "నేను" లేక ఏవ్యవహారము లేదు. నే ననే వానిని బాగా

ఎఱుగుటకు బ్రహ్మవిద్యయే గాని మరొక్కటి లేదు. ఆత్మదర్శనము వదిలిపెట్టి మిగత ఏపనులు చేసినను ప్రయోజనము లేదు. జీవితము వృథా చేసికొనుటయే. ఆత్మను దుఃఖపెట్టే పనులలోనే మనము కృషి చేయుచున్నాము.

ఒక్కశరీరవిషయము మొదట చూడుము. అనగా శరీరపోషణ సంగతి. నదిని ఈదేవాడు తెప్పకొయ్య అనుకొని మొసలిని పట్టుకొని ఈదుటయే ఈసమాచారము. నీవు గానిశరీరమును నీ వని తలంచుకొని దాని రక్షణకొరకు నీవు నానావస్థలు పడుచున్నావు. సుషుప్తిలో మాత్రము నీవు దానినివదలి ఎంత ఆనందముగా వుంటివి. సుషుప్తిలో వలె జాగ్రదవస్థలో గూడ నీవు హాయిగా వుండే మార్గము గురువుగారే చూపవలెను. బుద్ధిగుహలో నిత్యము వెలిగే నే ననేవానిని మేథాశాలులే చూడగలరు.

త్రాడును త్రాడుగా చూచేవాడే వివేకి. దానిని మరొకవిధంగా చూచేవాళ్లు అవివేకులు. "నేను" అనేవానిని పరమేశ్వరునిగాగాక మరొకవిధంగా భావించడము అజ్ఞానమువలననే. జీవభావంగా నిన్ను నీవు అనుకొన్నప్పుడే చచ్చినా వన్నమాట. నిద్రలో నీకు జీవభావము అర్థము కాలేదు; గనుక అచ్చట దుఃఖము లేదు. కాని బ్రహ్మభావము కూడ అర్థము కాలేదు గనుక కృతార్థుడవు కాలేకపోయినావు. నే ననే వాడు శాశ్వతానందమూర్తిగా అర్థమైనపుడే వాడు కృతార్థు డగు చున్నాడు ఈవిషయం చెప్పుటకే ఉపనిషత్తులు ప్రవర్తించుచున్నవి.

రైలుబండిలో పోవువానికి ప్రక్కన ఉన్నచెట్లు వెనుకకు పోవు చున్నట్లు కనబడును. కాని నిజము తెలియనివాడు, చెట్లవలె రైలు కూడ వెనుకకు పోవుచున్న దేమో యని భ్రమపడును. అప్పుడు వానికి రైలును ఆపుట ఉపాయముగా తోచును. మనస్సులో కూర్చుండి చూచేదానివలననే యీ నానాభ్రాంతులు పుట్టుచున్నవి. ఇందు రైలును

ఆపదలచుకొన్నవానివలెనే చిత్తమును నిగ్రహించవలె ననుట యోగుల ప్రక్రియ. రైలు ప్రయాణము చేయుటకు "టిక్కెట్టు" తీసికొని కూర్చున్నావు గదా. ఇపుడు దానిని ఆపుట సాధన గాదు. ఇందులో బుద్ధి ప్రతిభ ఏమియు లేదు. తత్త్వజ్ఞానము కావలెను. చిత్తవిక్షేపములు ఏమివచ్చినను, "నేను" అనేవానికి ఏమియు సంబంధము లేదు. కామ క్రోధాదులు ఏమి వచ్చినను, ఏమి పోయినను వీనికి ఏమియు నష్టము గాదు.

వస్తువు వున్నది నిర్వికారముగా; కాని కనబడుచున్నది సవికార ముగా. రైలు + చెట్లు ఉదాహరణ. వానిధర్మములచేత ప్రాణములు చలించుచుండును గాక. కోరికలచేత మనస్సు కొట్టబడుచుండును గాక. స్వభావముచేతనే ఆనందపూర్ణుడనైన నాకు దుఃఖము ఎట్లు కలుగును?

"ప్రాణా శ్చలంతు తద్ధర్మైః కామై ర్వా హన్యతాం మనః।
స్వభావానందపూర్ణ స్య మమ దుఃఖం కథం భవేత్॥"
(ఆత్మబోధోపనిషత్తు)

దేవుడు; జీవుడు ఇద్దరు ఉండటం ఇష్టమా? ఒక్కడే వుండవలెనా? నీవే చెప్పుము. దేవుడా? నీవా? నీవు ఉండటమే ఇష్టము. దేవుడు లేకపోయినను సరే. ఆసంగతి తెలిసికొనవలెను ప్రహ్లాదుడు పరమభాగవతుడు. విష్ణువు సర్వోపగతుడు; సర్వత్ర వున్నాడు అన్నాడు. ఎక్కడా లే డని హిరణ్యకశిపుడు అన్నాడు. ఒకభక్తుడు అడిగాడు దేవుణ్ణి, "ఏమి స్వామీ! నీవు వున్నావా లేవా?" అని భగవంతుని జవాబు — "ఉన్నానురా! హిరణ్యకశిపునిహృదయములోనే ఉన్నానురా, వాడు నాకు చాలా భక్తుడు. నేను నన్ను ధ్యానము చేసేవాని వద్దనే ఉంటాను వానిహృదయంలోనే ఉండి వానికి కనబడను." అదెట్లా? అది అలాగే. మనహృదయంలో వుండి భగవంతుడు మనకు కానరాలేదు కదా.

"హృదయగుహయందు ఉన్నవానిని ఎవడు తెలిసికొను చున్నాడో" వాడు పరమాత్మను తెలిసికొన్నవాడు అగును.

"యో వేద నిహితం గుహాయామ్"

ప్రహ్లాదుడు భగవంతునితో తన తండ్రిని క్షమించ మని కోరుట, దానికి భగవంతుని జవాబు గమనించవలె. సచ్చిదానందస్వరూపుడైన భగవంతుడు మనహృదయగుహలోనే వున్నాడు. ఆదేవుని చూపుటకు సద్గురువే కావలెను. జ్ఞానమయప్రదీపం వెలిగించి అజ్ఞానం పోగొట్ట వలెను. అపుడు చైతన్యముగా, జడముగా నేనే కనబడుచున్నాను, అని జీవునిగా, భూమ్యాకాశములుగా, ప్రపంచముగా నేనే కనుబడుచున్నా నని గ్రహింతువు.

కల్ల అయిన కలయే దీనికి ఉదాహరణము. ఏ నగ చూచినను బంగారపునగలవ్యాపారస్థునికి బంగారమే కనుబడునట్లు, ఏ వస్తువు చూచినను జ్ఞానికి ఏకరసమైన అఖండబ్రహ్మమే కానవచ్చును. "శుద్ధ ప్రకృతి మలినప్రకృతి అన్నియు నేనే. నాకంటెను పరతర మైనది ఏది యునులేదు; అర్జునా! సత్తు, అసత్తు నేనే."

"మత్తః పరతరం నాన్యత్ కించి దస్తి ధనంజయ"

"స దస చ్చాహ మర్జున"

"నీతెలివితక్కువవల్ల నిన్నే, నన్ను గాక అన్యముగా జూచు చున్నావు. సచ్చిదానందపరబ్రహ్మమునే అనృత–జడ–దుఃఖముగా నీవు చూచుచున్నావు; త్రాడును సర్పమువలె. పరమహంసపరివ్రాజకులకే నేను నా నిజస్వరూపముతో కనబడుచున్నాను."

## 11. అద్వైత సిద్ధాంతము

ఈదేహేంద్రియములమీద ఆధారపడి ఆత్మకు సుఖము లేదు; దుఃఖము లేదు. ఆత్మకు ఒక సహజస్థితి వున్నది. అందులోనుంచి

ఆత్మకు ఎపుడూ మార్పు లేదు. ఆత్మకు ఆనందమే సహజ స్వభావము. అయితే ఆత్మకు ఈ దుఃఖానుభవము వచ్చుట ఎలా సంభవించినది? ఈ ప్రసక్తమైన దుఃఖమునకు ప్రతీకారకర్మ మరొకటి; దానిని సంరక్షించుకొనుటకు మరొకప్రయత్నము; దీనికి అంతులేదు. ఇదే ప్రవృత్తి పరుల వైఖరి. స్ఫటికమణియొక్క నిర్మలమైన తెలుపువలె ఆత్మకు ఆనందము సహజము. భగవద్దర్శనము ఏమి టంటే, నే ననేవానిని సచ్చిదానంద స్వరూపునిగా నిశ్చయించి శాంతితృప్తులతో ఉండటమే.

"నేను" అనేవానిని వదిలి మరొకనిని భగవంతునిగా ఉపాసన జేయుటయే అజ్ఞానము. "త దేవ బ్రహ్మ త్వం విద్ధి" "నేదం యదిద ముపాసతే" కేనోపనిషత్తు — 4. ఇతి.

"నీవు దేనిని ఉపాసించుచున్నావో అది బ్రహ్మము కాదు; ఉపాసనచేయుచున్న నీస్వరూపమునే బ్రహ్మమునుగా ఎఱుంగుము". ఇది చేతగానప్పుడు ఇక నీయిష్టము. స్ఫటికమణిని ఎరుపుగా తలచుట వంటిది అజ్ఞానము. దేహముయొక్క జరావ్యాధిమరణములు తనయందు ఆరోపించుకొని నే ననేవాడు దుఃఖించుచున్నాడు. ఇది మొదటిప్రణాళిక. కాని ఈదేహము ఎన్నడును లేదు; ఎవరికీ లేదు; అసలే లేదు.

దేహము ఉన్నది అను ద్వైతి మొదలగువారు, అది ఎట్లు వచ్చినదో ఋజువు చేయవలెను. అందుకు వారు పూర్వజన్మధర్మాధర్మముల వలన ఈదేహము వచ్చిన దని చెప్పెదరు. దేహము లేనిదే, ధర్మాధర్మములు ఎలా చేసినారు? అనేటప్పటికి వారు గ్రుడ్లు వెళ్లబెట్టవలసినదే ద్వైత మంతయు అవిచారితరమణీయమే. పుట్టింది గదా అంటే చెల్లదు. అద్వైతి :— పుట్టకుండా కనిపించుదానిని నేను చూపిస్తాను, త్రాడుమీద పాము. దానివయస్సు గూడ నిర్ణయించుట తెలివితక్కువయే.

తపస్సు అంటే యేమిటి? తప = ఆలోచనే. అద్వైతరీత్యా ఆత్మవిచారణను శ్రుతియుక్తులచేత (శ్రద్ధతో) చేయడమే దివ్యమైన

తపస్సు. ఫలము కోరక పుణ్యము చేసినచో అది ఆత్మజ్ఞానానికి దారి తీయును. ఈ అద్వైతవేదాంతము ఎవరికి వారే విచారించుకొని అనుభవించవలెను, భోజనఫలమువలె. దీనికి గురుసేవ చాలా ముఖ్యము. ఈ ప్రపంచ మంతయు మాయ, అజ్ఞానమువలననే కనబడుచున్న దని చెప్పవలెను. ఇది పరమసత్యము. పరమగుహ్యము. జీవు లందరు ఆనందమును కోరుచున్నారు. కాని ఎచ్చటనుంచి ఆనందము వచ్చినను దుఃఖముతో కలిసియే వచ్చుచున్నది. కనుక దుఃఖములను మినహాయించి కేవలఆనందమును అనుభవించగలుగు సాధనము దొరుకుట లేదు.

ఆత్మకు ఆనందము సహజంగా లేదనుకొని విషయములవలన ఆనందము పొందవచ్చు నని వాటిని ఆర్జించుకొనుటకు నానావస్థలు పడుచున్నాము ఇది చీమలు మొదలుకొని బ్రహ్మలోకసుఖమునకై ప్రయత్నించువారివరకు సర్వద్వైతులు గూడ విషయములద్వారానే సుఖమును సంపాదించవలె నని ప్రయత్నించుచున్నారు. ఇదియే ద్వైతులందరి ప్రణాళిక.

మణులచేత చెక్కబడిన స్వర్ణకిరీటమువలన గూడ దుఃఖమే కలుగు నని పెద్దలు తేల్చినారు. విషయభోగముల ననుభవించువానికి బహుకష్టమే మిగులుచున్నది. ఆత్మకు ఆనందము స్వంతమైతేనే నిరంతరం ఉండగలదు. ఆనందము మరొకదానివలన వచ్చునది అయినచో అది పోయినప్పుడు, ఆనందము కూడ పోవును.

పాండవులు రాజసూయసభలో అగ్రపూజ శ్రీకృష్ణులవారికి చేయుట శిశుపాలునకు వ్యతిరేకమైనది. అందరికీ భగవంతుడు కనబడుచునే ఉన్నాడు. అవివేకులదృష్టిలో అట్లు కనబడుట లేదు.

ఆత్మకు అపేక్షితమైన సుఖము అన్యాధీనమై ఉన్న దని ద్వైతు లందరి అభిప్రాయము. అందులో చాలాతరగతులు ఇహపర

లోకభేదములతో ఉన్నవి. ప్రమాణమర్యాద ననుసరించి పైఅభిప్రాయము తప్పు అనియే నిర్ధారణ అగుచున్నది. ఆనందమే ఆత్మకున్న సహజస్థితి. అజ్ఞానమే నిమిత్తముగా దుఃఖము కనబడినను అజ్ఞానము పోగొట్టుకున్నచో ఆత్మ నిరంతరము ఆనందస్వరూపముగా ప్రకాశించును. తాను సుఖము కలవాడైనను స్వప్నములో భయకంపాదులకు లోనైనట్లు భావించుచున్నాడు. వస్తువుయొక్క సహజస్థితి సార్వకాలికమైనను స్వాప్నికావిద్యవలన లేనట్లు, పైగా దుఃఖము కలిగిన దనియు నానావస్థలు పడుచున్నాడు.

జాగ్రదవస్థ గూడ స్వప్నమువంటిదే. జాగ్రదవస్థలోనుండి "తత్త్వమసి" "ఆబ్రహ్మము నీవు" అను ప్రబోధము వచ్చిన వెంటనే జాగ్రదవస్థ అంతయు మిథ్య అనియే తేలుచున్నది. అపుడు మొదట వున్న మన సహజస్థితిలోనే ఉండగలము. అబద్ధవస్తువులు క్షణమున కొకతూరి మారుచుండును. నిజ మనగా ఒకేతీరున ఉండునది. ప్రపంచములోని వస్తువు లన్నియు జడములు, పరిచ్ఛిన్నములు. పుట్టినప్పటినుంచి నీవు ఒకేతీరున ఉన్నావా! నీసంగతే చూడు. తర్వాత ప్రపంచముసంగతి చూడవచ్చును. నీవే నిజము కానప్పుడు ఇక ప్రపంచాన్ని నిజము చేసెదనంటావే పిచ్చా ఏమిటి! నీకే "కాని" లేనప్పుడు నీ వెలా కోట్లకొలది దానము చేసెదవు? "అనాది" అనే మాట అద్వైతులది. మొదలే లేనిది మధ్యలో ఉంటుందా? బీజాంకుర న్యాయము ఇక ఎక్కడిది? అయితే శ్రుతి పుణ్యము చేయ మని ఎందుకు చెప్పుచున్నది అంటే నీవు అనారోగ్యంగా ఉంటూ మంచి ఆరోగ్యశరీరం కావాలంటే అందుకు శ్రుతి పుణ్యము చేయ మని చెప్పుచున్నది. అది క్రమంగా చిత్తశుద్ధికి హేతవు అవుతుంది. "పాలు త్రాగితే జుట్టుపెరుగుతుంది" అని తల్లి పిల్లవానికి చెప్పునట్లు. అజ్ఞానంలో కుదరని కుదిరిక అంటూ లేదు. స్వప్నంలో అన్నిభేదాలతో ఈదేహము కనపడ్డంత

మాత్రముచేత అది ఉందని సుఖపడెద ననెదవా? భ్రాంతిసిద్ధమైన ఈ మరుమరీచికలే ప్రవాహ మని తలంచినచో లాభ మేమి? త్రాగెదవా? స్నానం చేసెదవా!

దేవాలయానికి ఎందరో వెళ్లి దేవదర్శనము చేసినను, ఎవరో కొందరే నిజంగా దేవదర్శనము చేసినవా రయ్యెదరు. పిపీలికాది బ్రహ్మపర్యంతము సచ్చిదానందమైన పరమేశ్వరుడే ప్రకాశించు చున్నాడు. బుద్ధిమేధతో దర్శించవలెను. దురితమువలన దుస్స్వప్న ములు వచ్చునట్లే అజ్ఞానంవలన ఆత్మ గూడ తనను జీవునిగాను, జనన మరణములను పొందువానినిగాను తలంచుచున్నాడు. బహువిధనామ రూపములతో కనబడున దంతయు సచ్చిదానందపరబ్రహ్మమే; పంచ దారచిలుకలోని అవయవములవలెనే ఏకరసమైన వస్తువే మనుష్యులుగా పశువులుగా, పక్షులుగా, వృక్షములుగా భాసించుచున్నది. భగవంతుడు మనకు ప్రసాదించిన బుద్ధిని ఉపయోగించవలెను; భగవత్స్వరూపమును గుర్తించవలెను.

భగవంతుడు నీకు శ్రవణేంద్రియము ఇచ్చినది భగవద్విషయ ములను వినుటకొరకైనచో మరొకదానికి ఉపయోగించుటకు వీలు లేకుండా ఎందుకు చేసియుండకూడదు? ఇదీ భగవంతునిమీద ప్రశ్న! పెత్తనం మనకు ఇచ్చియున్నాడు. అది మఱచి మనము వారినే ప్రశ్న వేయుచున్నాము. మనకు పుణ్యము చేసికొనుటకు భగవంతుడు దేహేం ద్రియబుద్ధుల నిచ్చి, స్వాతంత్ర్యమును గూడ ఇచ్చియున్నాడు.

ఆ స్వాతంత్ర్యము అను మాయకు లోబడి మనము సంసార మున పరిభ్రమించుచున్నాము. "ఆమాయను తొలగించుకోవలయు నన్నచో నన్ను చూడండి; నన్నే భజించినచో ఆమాయను నేనే తొల గించి మీకు నన్ను నిరంతరం ఎల్లెడల చూచుటకు శక్తి నిచ్చెదను" అని భగవంతుడు చెప్పుచున్నాడు.

"మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే॥"
(భగవద్గీత)

దుఃఖమునకు కారణము మనలో వుంచుకొని దుఃఖము రానీయకుండ చేసుకొనవలె నని మన నిరంతరప్రయత్నము. నిప్పుచేతిలో పట్టుకొని కాలిన దని ఏడుస్తూ, దానిని వదలకుండ కాలకుండ చేసికొన ప్రయత్నించువానివలె ఉన్నాము. శరీరం ఉంచుకొనియే మనం దుఃఖము లేకుండ చేసికొనవలె నని ప్రయత్నించుచున్నాము నిజంగా పుట్టకపోయినను పుట్టినా నని భ్రాంతి వున్నను దానివలన దుఃఖము కలుగును. త్రాడును సర్పము అనుకొన్నను నిజమైనసర్పమును చూచి నట్లే దుఃఖము తప్పదు.

ఆత్మ శరీరమునకంటే భిన్నముగా వున్న దని తెలిసికొన్న వాడు, శరీరశ్రమ ఉన్నప్పటికిని ఆత్మకు లాభమైన విషయములో దానిని ఉపయోగించుకొనుటకు ఇష్టపడును. పుణ్యపాపములస్వరూపము వేదమువల్లనే తెలియును. విలువగల వస్తువులను తెలిసినవాడు అంతకంటే విలువగల కార్యక్రమములో వినియోగించును. అసలు గొప్ప విలువగలవస్తు వేదో బుద్ధిమంతులు విచారించినారు. పరమప్రేమాస్పదమైన వస్తువు తనదేహమే. ధనమును సంపాదించినవాని కర్తవ్యము తాను న్యాయరీత్యా అనుభవించుటకును, తగినపాత్ర దొరికినపుడు దానము చేయుటకును అయివున్నది. ఎటులయినను మృత్యుదేవత మనలను తీసికొనిపోకుండ ఉండదు.

శ్రీకృష్ణులార్ణవతంత్రే—

"అపత్యం మే కళత్రం మే ధనం మే బాంధవా శ్చ మే।
లపన్త మితి మర్త్యం హి హన్తి కాలవృకో బలాత్॥"

"ఇదం కృత మిదం కార్యం ఇద మన్యత్ కృతాకృతమ్।
ఏవం మోహసమాయుక్తం మృత్యు ర్హరతి జనం ప్రియే॥"

"శ్వఃకార్య మద్య క_ర్తవ్యం పూర్వాహ్ణే చాపరాహ్ణికమ్।
న హి ప్రతీక్షతే మృత్యుః కృతం వా ఽస్య న వా కృతమ్॥"

వీరు నాసంతతి, నాభార్య, నాధనము వీరంతా నాబంధువులు అని చెప్పుచుండు మ_ర్త్యుని మేకనువలె కాల మను తోడేలు బలిమితో చంపు చున్నది.

ఓ ప్రియురాలా! ఈపని అయినది, ఈపనిని చేయవలసియు న్నది; ఇది వేరే కొంత చేయబడి, కొంత చేయబడలేదు; అని ఈ రీతి మోహాయు_క్తమైన జనమును మృత్యువు అమాంతంగా తినివేయు చున్నది.

మరునాడు చేయవలసిన పనిని ఇపుడే చేయవలెను. రేపు ఉదయం చేయవలసినదానిని ఈరోజు సాయంత్రమే పూ_ర్తిచేయవలెను. నీవు చేసినావా, చేయలేదా అని మృత్యువు ప్రతీక్షించదు.

వచ్చునట్టి సుఖము పోవునట్టిదే. ఉన్న సుఖమే నిత్యమైనది. ఉన్నసుఖమును తెలిసికొనుటకే వేదశాస్త్ర మంతయు కావలసివచ్చినది. తనదేహేంద్రియములు, ధనకనకాదివస్తుసామగ్రియు వేదాంతశ్రవణం కొరకు త్యాగము చేయువాడే ధన్యాత్ముడు.

1. దేహాత్మవాది. 2. జీవాత్మవాది. 3. బ్రహ్మాత్మవాది.

అని మానవులు మూడువిధములుగా ఉందురు. దేహాత్మ వాదికి పతంజలిమహర్షి, ఆయుర్వేద ఔషధములు రసాయనా దులు చెప్పియున్నాడు. జీవాత్మవాదికి జైమినిమహర్షి పూర్వమీ మాంసయు, బ్రహ్మాత్మవాదికి వ్యాసమహర్షి ఉ_త్తరమీమాంసయు చెప్పియున్నారు.

సూర్యప్రభకు గాని, దీపప్రకాశమునకు గాని వానిచే ప్రకాశింప బడునట్టి ప్రపంచము ఏవిధంగాను అతకదు. ఆత్మకు గూడ ఆవిధంగానే ఉపాధులధర్మములు ఏమియు అతకవు. ఆత్మను ఉపాధిధర్మములతో

కలిపి అర్థంచేసికొనగూడదు. కేవల ఆనందస్వరూపుడను నే నని "నేను" అనేవాణ్ణి తెలిసికొనవలెను. దేవాలయమునకు వెళ్ళి ఏదేవుని దర్శించినను తనబుద్ధిగుహలో వెలిగే సచ్చిదానందపరమాత్మనుగా భావించి దర్శించునేర్పు సంపాదించవలెను. "చిల్లరదేవతల నాశ్రయించి స్వల్పఫలమును పొందుటకంటె సర్వజగదాధారుడనైన నన్నే ఆశ్రయించినచో నేను నన్నే వానికి లభింపజేసెద" నని భగవానుడు చెప్పుచున్నాడు.

"అంతవత్తు ఫలం తేషాం త ద్భవ త్యల్పమేధసామ్।
దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాంతి మామపి॥"

ఈ విధముగా చిల్లరదేవతలను పూజించుటకైన శ్రమ పరమేశ్వరుని పూజించుటకైన శ్రమతో సమానమే అయినను ఈజనులు అనంతమైన ఫలమును పొందుటకొఱకు నన్ను అర్చింపక అల్పఫలముల కొఱకు ఇతర దేవతలను ఎంతో శ్రమపడి అర్చించుచున్నారు.

"ఏవం సమానేఽప్యాయాసే మామేవ న ప్రపద్యంతే అనంత ఫలాయ, అహో ఖలు కష్టతరం వర్తంతే" ఇత్యనుక్రోశం దర్శయతి భగవాన్॥

భగవంతునిపూజ ఏమి టనగా, ఉపాధులను మినహాయించి, బ్రహ్మాత్మస్వభావముతో నే ననే వానిని గుర్తించుటే నిజమైన భగవత్పూజ

ప్రపంచవస్తువు లన్నియు బుద్ధివికారములక్రింద కట్టుకొన్నచో వాటి విషయమై మనకు రాగద్వేషములు కలుగవు. వాటితో మన కేమియు అనుబంధము ఉండదు. వస్తుసత్యత్వబుద్ధియందే మనకు రాగద్వేషములు వచ్చుచున్నవి. ఉన్నది ఏకమైన చిన్మాత్రస్వరూపమే. చిత్తము లేదు, చైతన్యము లేదు అని శ్రీశంకరులు చెప్పుచున్నారు.

వేదశాస్త్రసహాయము లేకుండా స్వబుద్ధిచేత ఎంత ఆలోచించినను బ్రహ్మాత్మజ్ఞానము కలుగుట అసంభవము. ఎప్పుడును ఉన్న బ్రహ్మము గురించి ఆలోచించుటకు తీరిక లేక ఎన్నడును లేని ప్రపంచమును గురించే ఆలోచించుచున్నారు జనులు. "చిత్" అను స్వయంప్రకాశమైన వస్తువే పూర్తిగా చిత్తమును ఆవరించియున్నది. కాని ఆచిత్తమే తర్వాత ఈ చిద్వస్తువును పూర్తిగా కప్పివేయుచున్నది.

సముద్రమును తరంగములు కప్పివేయుచున్నవి. సముద్రము ఏతరంగాలను అపేక్షించవలె ఏతరంగాలను నిరసించవలె? సముద్ర స్వరూపునిగా తన్ను భావించు మహానుభావునికి దేనినిగురించి రాగ ద్వేషము లుండవు. దుఃఖము అనుభవించే దెవరు? నశించేవాటిని అభి లషించేవారే.

పాపపుణ్యములకు లోనై పరాధీనులము కాకుండ సర్వస్వతంత్రతతో నిరంతరఅఖండానందము అనుభవించుటకు అజ్ఞానాన్ని పోగొట్టు కొని బ్రహ్మాత్మజ్ఞానమును సద్గురువులద్వారా పొందవలెను. ఈ"నేను, నేను" అని మనము వ్యవహరించువాడే పరమాత్మ అని శ్రీకృష్ణభగవానుడు గీతాశాస్త్రములో చెప్పుచున్నాడు.

'ఓఅర్జునా నేను సకలభూతములయొక్క హృదయములందు ఉన్నఆత్మను". ఈవిధముగా తెలిసికొన్న ఆత్మవేత్త శోకమును అతి క్రమించుచున్నాడు.

"అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః"

కనుక "తరతి శోక మాత్మవిత్", స్వాప్నికావిద్యచేత తనమరణమును తానే చూచుచు కలగంటున్నాడు; నే ననే వాని స్వరూపాన్ని తెలిసికొనలేని అజ్ఞానముచేత నానావస్థలు పడుచున్నాడు. తెలిసికొన్న వాడు నిద్రనుండి మేల్కొనగానే నిశ్చింతగా ఉండును. తెలిసినవాడు ఉపాధులను నిషేధించి సర్వత్ర పరమాత్మయగు తననే ఆనందఘన

ముగా నిరంతరం దర్శింపగలడు. "ఆవిష్ణువుయొక్క పరమపదమును పండితులు ఎల్లప్పుడు చూచుచుందురు".

"త ద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః"

ఈజీవుడు పుట్టునపుడు మహాదుఃఖము ననుభవించును; చని పోవునపుడు అంతకంటే ఎక్కువదుఃఖము ననుభవించవలసివచ్చును. నే ననేవానికి వచ్చినదుఃఖము నేనుగానివానిని ఆశ్రయించి పోగొట్టుకొన వలె నని తలంచెదము దీనికి మనము బాగా అలవాటుపడివున్నాము. ఇది చాలా దురభ్యాసము. వచ్చిన ఉపద్రవాన్ని దానికారణ మేదియో కనిపెట్టి తీసివేసినచో అది మరల ఎప్పటికి రాదు. ఇది అద్వైతుల పద్ధతి. మనకు మొదటనే, సృష్టిలో నుంచే రాగద్వేషములనే గుణ ములు వచ్చివున్నవి.

ఈదేహమును నే ననేవానియందు కలుపుకొనుటవలననే మనం మరణించుచు అధిక దుఃఖము ననుభవించుచున్నాము జీవన్ముక్తులు దీనిని తమయందు కలుపుకొనరు. ఆనందముతో స్వతంత్రముగా ఉందురు. అయితే ఈరాగద్వేషములు పోవుట యెట్లు? ప్రపంచమును అబద్ధముగా చూడటంవలననే అవి సమసిపోవును; సినిమాలోని మంచి చెడ్డలవలె. అలా చూచుటవలన అంతయు వినోదముగా వుండును.

జీవు లందరు కోరునట్టి దుఃఖస్పర్శములేని శాశ్వతానందమును అనుభవించుటకు ఉపనిషత్తులలో చెప్పిన బ్రహ్మాత్మజ్ఞానము తప్ప మరొకమార్గంలే దని అద్వైతులు చెప్పెదరు. ద్వైతులు మాత్రం కర్మోపాసనలను అభిమానించుచున్నారు. కోటిరూపాయలు తనకు వచ్చినచో తెలివికలవాడు అవి మళ్లీ పోవచ్చు నని తెలిసికొనవలె. ఎందువలన? అవి ఉన్నవానివద్దనుంచి పోయి గదా తనకు వచ్చినవి. అందువలన అవి పోగూడ దని ప్రయత్నము చేయకూడదు. అవి

పోయినను మళ్ళీ వచ్చుటకొరకే వాటిని వినియోగించవలెను. అనగా ధర్మమునకు వినియోగించవలెను.

భగవత్సేవ అనేకవిధములు. అభీష్టమును రాబట్టుకొనుట ఒక పద్ధతి. మరొకపద్ధతివలన జన్మమరణములనే తప్పించుకొనవచ్చును. త్యాగభోగములలో త్యాగముచేయుట భోగముకొఱకే. నిష్కామ్యమైన త్యాగసాధనవలన మోక్షమునే పొందవచ్చును. ధనమును సంపాదించుట త్యాగముకొఱకుగా వుండవలెను. ధనమును ఆర్జించి దానిని సమయం కొఱకు చూచి సద్వినియోగము చేయవలెను. అందులో ముఖ్యమైన ధనము మనకు సాత్త్వికదేహేంద్రియములు. వీనిని సద్విషయముల కొఱకు, సద్గురువులకొఱకు బాగా వినియోగించి మోక్షమును పొంద వలెను. కన్యను జాగ్రత్తగా పోషించి రక్షించుట తగినవరుని వెదకి సాలంకారదానము చేయుటకొఱకై వున్నది, సూర్యవంశపురాజుల పద్ధతిని కాళిదాసు రఘువంశములో ఇట్లు వర్ణించినాడు. వారు త్యాగము కొఱకే సంపదలను సమకూర్చుకొందురు. సత్యముకొఱకే వారు మిత ముగా మాటాడుదురు. కీర్తికొఱకే వారు శత్రువులను జయింతురు. అంతమునందు వారు యోగముచేతనే శరీరమును త్యజింతురు".

"త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ మితభాషిణామ్।
యశసే విజిగీషూణాం యోగే నాంతే తనుత్యజామ్॥"

కం॥ "ఒకపరి సూచిన నుండియు,
ఒకపరి సూడంగ లేకయుండు సిరులకై,
యొకఁ డొకనిచేటువేళకు,
నొకఁ డొక్కఁడు మనువు గాచియుండు నరేంద్ర॥"

సంపాదించినధన మంతయు వీడే వదలిపోవుచుండగా, మరొ కడు నాకు వ్రాసిచ్చి పొమ్మనుచున్నాడు.

ముచికుందు డను మహారాజు శ్రీకృష్ణుని ఇట్లు స్తోత్రము చేసెను

క॥ నీమాయ జిక్కి పురుష
స్త్రీమూర్తికజనము నిన్ను సేవింపదు, వి
త్తామయగృహగతమై సుఖ
తామసమై కామవంచితం బయి, యీశా॥

ఉ॥ పూని యనేకజన్మములఁ బొంది తుదిం దనపుణ్యకర్మసం
తానముపేర్మిఁ గర్మవసుధాస్థలిఁ బుట్టి ప్రపూర్ణదేహుడై
మానవుడై గృహేచ్ఛఁబడు మందుఁ డజంబు తృణాభిలాషియై
కానక పోయి నూతఁబడుకై వడి నీపదభక్తిహీనుడై॥

క॥ తరుణీపుత్రధనాదుల,
మరగి మహారాజ్యవిభవమదమత్తుఁడనై,
నరతనులుబ్ధుఁడ నగు నా
కరయఁగ బహుకాల మీశ యాఅడివోయెన్॥

క॥ ఘటకుడ్యసన్నిభంబగు,
చటులకళేబరముఁ జొచ్చి జనపతి నంచుం
బటుచతురంగంబులతో,
నిటు నటు తిరుగుదును నిన్ను నెఱుఁగక యీశా॥

ఆ॥ వివిధకామభోగవిషయలాలసు మత్తు,
నప్రమత్తవృత్తి నంతకుండ
వైన నీవు వేళ యరసి త్రుంతువు, సర్ప
మొదిగి మూషికంబు నొడియునట్లు॥

క॥ నరవరసంజ్ఞితమై రథ
కరిసేవితమైన యొడలు కాలగతిన్ భీ
కరమృగభక్షితమై దు
స్తరవిట్క్రిమిభస్మసంగతం బగు నీశా॥

ఆ॥ సకలదిశలు గెలిచి సములు వర్ణింపంగఁ
జారుపీఠ మెక్కి సార్వభౌముఁ
డైన సతులగృహములందుఁ గ్రీడాభోగ
వృత్తి నుండు నిన్ను వెదకలేఁడు॥

ఆ॥ మానసంబుఁ గట్టి మహితభోగంబులు
మాని యింద్రియములమదము లడఁచి
తపము సేసి యింద్రతయ కోరుఁ గాని నీ
యమృత పదము గోరఁ డజ్ఞుఁడీశ॥

క॥ కాలము ప్రబలులకును బలి,
కాలాత్మకుం డీశ్వరుం డగణ్యుఁడు, జనులం
గాలవశులఁగాఁ జేయును
గాలము గడవంగ లేరు ఘను లెవ్వారున్॥ (పోతన భాగవతము)

న్యూనాధికభావాపన్నమైన వస్తువులకు అవభాసకమైన నీలో ఏ న్యూనాధికమైన మార్పును రాదు; దర్పణములో వస్తుభానమువలె, అద్దమునందు కనిపించుచున్న నగరమునువలె, ఈవిశ్వమును తన మనస్సునందే ప్రతిబింబించుచున్నదానిని, వెలుపల ఎక్కడనో పుట్టి యున్నదానినివలె, చూచుచున్నాడు. నిద్రచేత కలయందు స్వప్నప్రపంచమును తనయందు కాక ఎక్కడనో ఉన్నట్లు చూచుచున్నాడు గదా! ఈ విధముగా జాగ్రద్దశలో కూడ తనమనస్సునందే ప్రతిబింబించున్న దానిని వెలుపల ఉన్నట్లుగా భ్రమించుచున్నాడు. నిద్రనుండి లేచిన వాడు కలలో తాను చూచిన దంతయు తనమనస్సులోనే కన్పించిన దని వెలుపల ఏమియు లేదని ఎట్లు తెలిసికొనుచున్నాడో ఆవిధముగానే జాగ్రద్దశలో కూడ వ్యవహార మంతయు తనయందే ఉన్న దని తన కంటె అన్యముగా మఱియొక పదార్థము లేదని ఎవడు తెలిసికొను చున్నాడో అట్టివాడు శ్రీదక్షిణామూర్తియే అగును. అట్టి శ్రీదక్షిణామూర్తియైన శ్రీగురువునకు నమస్కరించుచున్నాను.

"విశ్వం దర్పణదృశ్యమాననగరీతుల్యం నిజాంతర్గతం
పశ్య న్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా।
యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మాన మే వాద్వయం
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥

చైతన్యస్వరూపమే సత్యము. చైతన్యస్వరూపంమీద అజ్ఞానావరణ వచ్చినదని ఒక దనును; నాలుక నాకు లేదనేవానివలె తెలివిగూడ లేదనేవాడు ఒకడు ఉండవచ్చును. వెలుతురులో కుండవున్నది. కుండ వెలుతురును అడ్డగించుచున్నను వెలుతురువలననే కుండ కనబడుచున్నది. చైతన్యములో గూడ అవిధంగానే అజ్ఞానం ఉన్నది. ఎట్లనగా వస్తువుయొక్క తత్త్వము తెలియనీయకయే దాని ప్రకాశము మాత్రము తెలుపునది అజ్ఞానము. మరియు ఆవస్తువుయొక్క సచ్చిదానందస్వరూపమును మరుగుపరచి, అవస్తువునే జరామరణములు పొందునట్టి దేహముగా ప్రకాశింపజేయునది అజ్ఞానము.

దేవునియందు అపరాధము చేసి అవిధేయతను చూపినప్పటికి ఆయన మన్నించును గాని అబద్ధములు చెప్పుట ఒప్పుకొనడు.

నీవు చేయుచున్న బహుళప్రయత్నముచేత వచ్చునట్టి ఫలముకంటెను శతగుణాధికంగా స్వధర్మవిహితమై స్వల్పశ్రమచేతనే అది రాగలదని వేదమాత చెప్పుచున్నది. పెట్టుబడి తక్కువతో ఎక్కువలాభము పొందవలె ననునది సర్వజీవులకున్న అభిలాషయే. దాని కనుక్రమంగానే వేదమాత చెప్పుచున్నది. ఐహికభోగములు పొందిన తర్వాత క్రమంగా నిష్కాముడై, చిత్తశుద్ధికి పాత్రుడై తత్త్వవిచారణ చేసి ముక్తి బొందాడని వేదమాతయొక్క ఉద్దేశము. వేదమాతయొక్క పరమోద్దేశము మనకు సర్వత్యాగము నేర్పుటయే.

"కర్మాచరణముచేత కాదు, సంతానముచేత కూడ కాదు, ధనముచేత కూడ కాదు, కొందఱు తత్త్వకుశలులైనవారు త్యాగముచేతనే అమృతత్వమును పొందిరి".

"న కర్మణా న ప్రజయా ధనేన
త్యాగే నైకే అమృతత్వ మానశుః"
ఏకే — కుశలినః

హేతుఫలములమీది విశ్వాసమే సర్వదుఃఖములకు కారణము. హేతుఫలావేశము అవివేకకృతమే. జన్మమరణములు తప్పవు. సంసారులకు కర్మాచరణమును ఉపదేశించుట లేనిపాముచేత భయపడువానికి మంత్రౌషధముల నిచ్చి పంపుటవంటిది. తత్త్వదృష్టిచేత హేతుఫలావేశము పోవును. చిద్రూపుడు అనగా తానంతట తానే ప్రకాశించేవాడు. సమాధిలో, సుషుప్తిలో నేను తెలివి స్వరూపుడనే కాని మరేమియు విశేషములు లేవు. నేను బ్రహ్మచారిని, గృహస్థుణ్ణి కాదు. ఇదంతయు చిత్తము బయటికి వచ్చినప్పటి భ్రాంతియే.

సుషుప్తిలోవలె స్వస్వరూపముతో ఉన్న చైతన్యమూర్తికి ఏ విధమైన దుఃఖస్పర్శ లేదు. హేతుఫలావేశము పోవుటయే సంసారము లేకపోవుట.

వస్తువులు భాసించుటవలన అద్దమునకు ఏవికారము కలుగదు. అలాగే నాయందు గూడ దుఃఖము, సంతోషము, రోగము, ఆరోగ్యము ఏది భాసించినను నాలో ఏమార్పు రాగూడదు.

భ్రాంతి, అజ్ఞానమే సర్వమునకు కారణము. కామక్రోధాదులు గాని, ఆకలిదప్పులు గాని ఏవి వచ్చినను చిద్రూపుడైన నాయందు ఏ మార్పు రాదు. పూర్వకాండములోని ధర్మములను అనుష్ఠించవలెను. ఉత్తరకాండములోని బ్రహ్మమును అనుభవపూర్వకముగా తెలిసికొనవలెను. "వాక్యము ననుసరించి అర్థవిచారణముయొక్క పర్యవసానము వలన ఏర్పడునది బ్రహ్మజ్ఞానము".

"వాక్యార్థవిచారణాధ్యవసాననిర్వృత్తా హి బ్రహ్మావగతిః"

వేదశాస్త్రము ననుసరించి తన ప్రవృత్తి నివృత్తులు ఉన్నవాడు వైదికుడు; లేనివాడు అవైదికుడు. ఒకపాఠశాలలోని ఉపాధ్యాయులు

తమతమవంతు పాఠములు చెప్పినను తదితరపాఠములు వారికి తెలియ వని అనుకొనుటకు వీలులేదు. అట్లాగే పూర్వాచార్యులు, ఇతరశాస్త్ర ములయందు కూడ ప్రవీణులై యుండిరి. మనస్సును నిగ్రహించి సుఖమును పొందుటలో ప్రాణాయామయోగులు నిపుణులు.

కావేరీతీరమందలి శ్రీశ్రీసదాశివేంద్రసరస్వతీస్వామివారు గొప్ప బ్రహ్మాత్మజ్ఞానులే గాక సమాధియోగమునందును చాలగొప్పవారు. కొన్ని నెలలపాటు ఏటిలో పెట్టినమేటక్రింద బాహ్యస్మృతి లేకుండ ఉండి, కొంతకాలమునకు లేచి వెడలిపోయినారు. వీరు సాక్షాత్తు శుక బ్రహ్మవలె ప్రతినిమేషము పరబ్రహ్మ నీక్షించి మది చొక్కి వెలుపల మరచువారు. దేహముయొక్క సాకల్యవైకల్యములతో నిమిత్తము లేకుండగనే కేవల యోగమార్గములో మనము ఆనందించవచ్చును. అదియే యోగసమాధికౌశలము. అది అనుభవమునకు వచ్చినచో ఇతర సాధనలు అక్కరలే దనిపించును.

సుషుప్త్యవస్థయందు "నేను సుఖముగా నిద్రించితిని నాకు ఏమియు తెలియలేదు". అని ప్రతివాడు చెప్పుచున్నాడు. అపుడు వేసిన పూలమాల గాని, జ్వరము గాని వానికి స్ఫురింపవు అపుడు మనస్సు అజ్ఞానములో కలిసి వున్నది. మనస్సుయొక్క విహార మపుడు లేదు. ఉదకముయొక్క చలనమే తరంగము, అట్లే అజ్ఞానముయొక్క చలనమే మనస్సు. మనస్సు తైజసము; అగ్నిజ్వాలవంటిది. నిప్పులోని జ్వాల వలె మనస్సు అజ్ఞానములో నుండి వచ్చును. వాయువే నిప్పునకు జ్వాల కలిగించుచున్నది. అప్పుడే అన్ని వ్యవహారములకు వీలగును. ప్రాణా యామయోగముచేత వాయువు అరికట్టబడును. యోగులు మరణము లేకుండ ప్రాణవాయువును నిగ్రహించుమార్గము నేర్చుకొన్నారు. అందువలన వారు ఖర్చుపడకుండ ఆయుస్సును రక్షించుకొనెదరు. ఇది యోగమార్గము. యోగవాసిష్ఠములోని భుసుండుని వసిష్ఠుని సంభాష ణము చూడుడు.

కర్మనిష్ఠులకువలె దేహేంద్రియసహాయము అక్కఱ లేకుండ యోగులు మనోనిగ్రహముచేసి సమాధి అనే మహాప్రభావంచేత దివ్య సుఖమును అనుభవించుచున్నారు

ఇక మూడవది జ్ఞానమార్గము.

ఇందు మనస్సునే త్రోసివేసి శాశ్వతబ్రహ్మానందసుఖమును అనుభవించవచ్చును. బాగా అన్నివిధాలా శోషింపజేసినమనస్సు సమాధిలో వశ్యమగును. అది దానికి ఇష్టము లేనిపని. ఎలాగంటే సింహమును ఎండగట్టి ఇనుపబోనులో ప్రవేశపెట్టి యుంచినట్లే. విశ్వామిత్రుడు, మేనక ఉదంతము ఇట్టిదే. సరే; మనస్సు సమాహితమైతే సుఖించుచున్నాను. అసమాహితమైనపుడు ఇక దుఃఖమే. అసలు నా స్వభావము ఏమిటి? అనగా ఆత్మస్వభావము ఏమిటి? దీపప్రకాశమునకు చిమ్నీల ఎరుపు నలుపులు ఏమీ సంబంధించవు. అట్లే నేను కేవల చైతన్యస్వభావుడను ప్రతిదానిని, రాగద్వేషాదివృత్తులను గూడ, అవభాసింపజేసేవాడను. రకరకాలబుద్ధివృత్తులకు, వాటిస్వభావాలకు నా కేలాటిసంబంధము లేదు. నాకు వానియొక్క సుఖదుఃఖములసంశ్లేషము ఏమీ లేదు నా కవి కనబడుచున్నవే గాని నా కేమియు అవి అనుభవానికి రావు. జపాకుసుమపుఎరుపురంగుచే స్ఫటికమణి ఎఱ్ఱగా కనబడినను ఆమణి తెలుపే. అలాగే బ్రహ్మజ్ఞానియొక్క ఆత్మతత్త్వానుభవ వైభవ మున్నది.

"(తత్త్వజ్ఞుఁడు) దుఃఖములయందు ఉద్వేగమును పొందనివాడుగా, సుఖములయందు కోరిక లేనివాడుగా ఉండును".

"దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః"

తత్త్వవేత్తకు అనగా జీవన్ముక్తునికి తేలుకుట్టినచో దుఃఖపడడా? ఏడువడా? ఏడుస్తూ వున్నప్పుడే బ్రహ్మవేత్తయొక్క ప్రభావము

కనిపెట్టవలెను. తెల్ల మేఘములవలన, నల్లమేఘములవలన ఆకాశము ఏమియు కాలేదు.

తత్త్వవేత్త ఏడ్చుచున్నప్పుడు గూడ అది దేహేంద్రియసంక్షోభమే కాని అయన ఏడుప లేదని శ్రుతి చెప్పుచున్నది. బుద్ధివికారములు తత్త్వవేత్తకు సంబంధించవు ఇదియే వేదాంతరహస్యము.

"దేనిని చేయుట కష్టసాధ్యమో, దేనిని పొందుట కష్టమో, ఎచ్చటికి పోవుట సులభము కాదో, దేనిని దాటుటశక్యము కాదో, అది యంతయును తపస్సుచేత పొందవీలగును. తపస్సునకు మించినది ఏదియు లేదు".

యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చ దుస్తరం।
తత్సర్వం తపసా ప్రాప్యం తపో హి దురతిక్రమమ్॥

తపస్సుకు సాధ్యంకాని కార్యములు లేవని మన మిందువలన గ్రహించవలెను. అన్నిటికన్నను దుస్సాధ్యమైనసిద్ధి శాశ్వతబ్రహ్మానందకైవల్యము. అట్టి దానినిగూడ సాధించుటకు తపస్సే కారణము.

భోక్తయొక్క తెలివి ననుసరించియే భోగ్యముయొక్క ప్రయోజనము లభించును. అదితికశ్యపులు కృష్ణభగవానుని తమగర్భవాసమునుండి కనియుండి గూడ వారికి మోక్షము మాత్రము శేషించియే యున్నది. అయితే ఈశాశ్వతానందమునకు సాధన మెయ్యది? అనగా? అదిగూడ ఒకవిధమైన తపస్సువలననే సాధ్య మగును. బ్రహ్మవిచారణయే గొప్పతపస్సు. అది బ్రహ్మసూత్రశారీరకభాష్యశ్రవణము. రాక్షసులతపస్సు, దేవతలతపస్సు ఇవి రెండు గూడ మోక్షమునకు తీసివేతయే. అవి అంతపూర్ణమైన తపస్సులో చేర వనియే మన మెంచవలెను. ఉత్తరమీమాంసాశ్రవణమే పూర్ణమైన తపస్సు దానికి నిష్కామ్యమైన స్వధర్మబలమే పునాది. ఈప్రత్యగాత్మను బ్రహ్మముగా అనుభవించు విషయమే వేదాంతము చెప్పుచున్నది. నిష్కామ్యమైన స్వధర్మాచరణ

వలన చిత్తశుద్ధికలిగి, పుష్కలమైన సాధనచతుష్టయసంపత్తిని అలవర చుకొన్నచో బ్రహ్మజిజ్ఞాసకు పునాది ఏర్పడును. ధర్మార్థకామములు మూడును పురుషార్థములే. అయినను పరమపురుషార్థము మాత్రము మోక్షమే. పైవి మూడు కొంతకాలానికి ప్రయోజనము లేనివగును. పరమపురుషార్థము మాత్రము ఎప్పటికైనను, సప్రయోజనమై నిత్య నూతనముగా నుండును.

"అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం
తథాఽరసం నిత్య మగన్ధవచ్చ యత్।
అనాద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్య తం మృత్యుముఖాత్ ప్రముచ్యతే॥"

"శబ్దరహితము, స్పర్శరహితము, రూపరహితము, నాశరహితము, అదేవిధముగా రసరహితము, గంధరహితము, నిత్యము ఆదిలేనిదియు, అంతములేనిదియు, బుద్ధి యను పేరుగల మహత్తత్త్వముకంటె విలక్షణమైనదియును, అయినట్టి ఆత్మతత్త్వమును శాశ్వతమయిన దానినిగా ఎఱింగినవాడు అవిద్యాకామకర్మలక్షణమగు మృత్యుముఖము నుండి ముక్తుఁడగుచున్నాడు."

నేను శాశ్వతానందస్వరూపుడను కావాలని కోరినకోరికయే "నేను శాశ్వతానందుడను" అని నిరూపించుచున్నదిగదా అని శ్రీశంకరులవారు చెప్పుచున్నారు నీవు శాశ్వతానందస్వరూపుడవు గనుకనే, "అయ్యో అట్లుకాకపోతినే నేను" అని ఆలోచన (జిజ్ఞాస) వచ్చుచున్నది.

రాధేయుడు కౌంతేయుడు అగుటవంటిదే జీవుడు బ్రహ్మము అగుట. రాధేయునికి కౌంతేయుడ నని తనకు తెలిసినవెనుక ఎవ రేమనుకొన్నను కోపము రానట్లే, స్వస్వరూపము తెలిసిన నన్నుగూడ ఎవ రేమనుకొన్నను కోపమురాదు.

నేననేవాడు అంతర్ముఖదృష్టితో తనను బ్రహ్మముగా గుర్తించినచో జరామరణములు ఉండవు. బహిర్ముఖంగా దేహేంద్రియములను తన్నుగా తలంచినచో జరామరణములు తప్పవు.

"ఖలసహవాసం విఘటయ
ఘటయ సతాం హి సంగమ మనిశమ్।
శంభో శివ శివ శంకర
సాంబసదాశివ! శరణం మే తవచరణమ్॥"

"ఎంత విజ్ఞాని నైనా సహవాసం మార్చివేయును. సజ్జనుడు దుర్జనునితో చేరినప్పైన దుర్జనుని గుణములే కలుగును. తన గుణములు వానికి అతకవు. ఎవని కైనను వానిసంస్కారములే బలవత్తరములు. మిగతవి ఎన్ని విన్నను వాటిని తిరస్కరించి సంస్కారములే బయట పడును.

## 12. శ్రవణాదులు

శ్రవణము అనగా శ్రుతిసమ్మతమైన యుక్తులచేత వేదాంత వాక్యములను విచారించుట. అందులకు ముందు గాని, తర్వాత గాని సాధనచతుష్టయసంపత్తిని అలవరచుకొన్నచో శ్రవణము చక్కగా ఫలించును. ఇది భరతఖండభాగ్యమే; దేవతలకు గూడ లేనిది. "తదుపర్యపి బాదరాయణ స్సంభవాత్" అని అనుటలో వ్యాసాచార్యులవారి "సిఫార్సు" కావలసి వచ్చినది, దేవతలు గూడ దీనిని సకృత్తుగా పొందవచ్చు నని.

దారాపత్యధనకనకవస్తువాహనాదులను చాలాజన్మలనుంచి ఉపాసన చేయుచున్నాము. ఇపుడు వాటిని తొలగించుకొనుటకై, బ్రహ్మవిచారణ "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అని చేయవలసియున్నది. పునరావర్తనరహితముగా ఈసంసారబంధం పోవలయు నన్నచో సత్యమైన బ్రహ్మాత్మవిజ్ఞానము సాక్షాత్కారమైననే కుదురును సేతుదర్శనముచేత

పాపము పోయినట్లు, గరుడమంత్రస్మృతిచేత సత్యమైన పామువిషము పోయినట్లును కాదు. వీటన్నిటియందును పునరావర్తనభయము ఉన్నది. సచ్చిదానందతత్త్వమును తానుగా గుర్తించినపుడు మరణధర్మములేని అమృతత్వము లభించును. అట్లు గాక మరణించునట్టి దేహేంద్రియములను తానుగా గుర్తించినచో యిక మరణము తప్పదు. చిత్తము; చైత్యము మిథ్యగా తెలిసికొన్నచో "చిత్" మిగులును.

ఎవనికైనను వాడు చేసికొన్న పుణ్యముల ననుసరించియే గురువులు దొరికెదరు. దేహము ఆరోగ్యముగా వుండి చిత్తము ప్రశాంతముగా (సత్త్వగుణముచేత నిర్మలముగా వున్నపుడు) వచ్చే తృప్తి తన స్వరూపతృప్తి గాదు. ఇది వివేకముచేత ఆత్మజ్ఞానమువల్లనే కలుగును. యోగసమాధిలోని సమాహితసమయమందలి తృప్తి గూడ నిజమైన తృప్తి గాదు. ఆవైలక్షణ్యము తెలిసికొనవలెను

శాస్త్రము చెప్పునట్టిఉపాయములవలన సంసారము తొలగదు. అయితే ఎట్లా? ఆఉపాయములవలన కలిగే చిత్తశుద్ధివలన, వివేకప్రజ్ఞ వలన అసలు సంసారమే నాకు ఎప్పుడూ లేదని తెలియును. నేను ఎప్పుడూ సంసారము లేనివాడనే.

బంధము అందరిఅనుభవములో కుదిరియే ఉన్నది. మోక్షమే ఎలా కుదురుతుం దని శిష్యునిభావము. కాని గురువుగారినిశ్చయ మే మనగా మోక్షమే కుదిరి వున్నది. కాని బంధము నీకు ఎలా కుదిరిందో నాకు అర్థం కాలేదని, ఇద్దరు ముచ్చటించుకొనుచున్నారు.

సాత్త్వికభావాలు స్వరూపతః ఉత్తమములు కావు గాని, ఫలతః ఉత్తమములే అగును. అవి స్వరూపస్ఫురణ కలిగించును. కాని రాజసతామసభావములు అలా కావు. ఇవి స్వరూపమును విరుద్ధముగా భాసింపజేయును.

తాదాత్మ్యముతో గృహము కట్టుకొన్నవానికి, అతిథికి దానిని గురించి యిద్దరిమనోభావములు గమనించతగినవి కార్యకరణములు దేహేంద్రియాదులు. రఃశరీరేంద్రియాదులమీద ఉన్న తాదాత్మ్యము చచ్చినా పోదు. నచికేతుదే ఇందులకు తార్కాణము. యమునివద్దకు పోయి కూడ నచికేతుడు మరణానంతరం నేను ఉంటానా, ఉండనా, అని అడుగుచున్నాడు.

ఆదరము, అపాయశంకకు కారణ మగును. ఉదా — తనపిల్ల వాడు, పొరుగింటిపిల్లవాడు కలిసి గ్రామాంతరమునకు పోయి తిరిగివచ్చుటకు ఆలస్యము కాగానే తల్లి, దిగులుపడి చింతించును. "పొరు గింటిపిల్లవాడు కూడ కలిసిపోయినాడు, ఇద్దరు వస్తారు గదా" అని ప్రక్కవాళ్ల ధైర్యము చెప్పినను, తల్లి తనపిల్లవానిమీదనే బెంగపెట్టు కొని, పొరుగుపిల్లవాని "కేమి ఫరవాలేదు." అని ఆశీర్వదించుచు, తన పిల్లవానిని గురించియే దిగులుపడియుండును. ఇది గమనించదగును.

ప్రతిప్రాణి కోరుచున్నఆనందమే బ్రహ్మ మను పేరుతో శాస్త్రమునందు చెప్పబడియున్నది. బ్రహ్మానందము అనంతము నిత్యము. ఎప్పుడును తరుగు, విసుగు లేనిదే మోక్షము లేక బ్రహ్మము దీనికి వేదశాస్త్రములో చెప్పిన ధర్మమే మార్గము

ముఖ్యముగా మానవజన్మలో ప్రయత్నించి తెలిసికొనదగినది ఏద్ది? ఎయ్యది తెలిసినచో మరొకటి తెలిసికొనతగినది యిక ఉండదో అదియే. దానివలన లాభ మేమిటి? ఎయ్యది లాభించినచో మరొకటి పొందవలసినలాభము లేదో అది అదియే నిత్యమైన అఖండానందము. తెలివిద్వారానే దీనిని తెలిసికొనవలెను. "జ్ఞానా దేవతు కైవల్యమ్" ఎవనికి? ఎవడు దీనికి అర్హతను సంపాదించుకొనునో వానికే అది తెలి యును. ఇంద్రియములకు అర్థమగునది యథార్థ మని అనుకొనువారు అజ్ఞానులు. ఇంద్రియాతీత మైన వస్తువును తెలిసినవాడే తత్త్వజ్ఞుడు

ఇంద్రియములకు ఎంత ఉపయోగంగా, ఎంత మనోహరంగా కనబడినను అంతయు అబద్ధమే. దానిబ్రతుకే అంత యని తెలిసినవాడే తత్త్వజ్ఞుడు.

"అహం" అనునది ఆత్మానాత్మసమ్మిశ్రితముగా ఉన్నది. ఆత్మ నిరంతరము నిత్యసుఖస్వరూపముగానే, నిత్యశుద్ధబుద్ధముక్తముగానే ఉన్నది. ఇది తెలిసికొనుటయే కావలసినది.

స్వప్నంలోని మహాభయంకరదృశ్యము చూచి, అట్టిఆపదమధ్య దిక్కుతెలియక చాలా అవస్థపడుచుండగా మెళకువ రాగానే అది అంతయు అదృశ్యమై తాను ఆనందగా వున్నాడు. అదేవిధంగా మన యీసంసారదుఃఖము లన్నియు స్వస్వరూపజ్ఞాన మనే మెళకువ రాగానే ఛాయామాత్రంగా గూడ లేకుండా అదృశ్యమై పోయి, మనము గూడ నిశ్చింతగా ఆనందముగా ఉందుము. ఈసంసారమున వీరు నావారు, నేను వీరివాడను అనే భ్రాంతిచేతనే మనము నానాదుఃఖములు పడుచు, సతమత మగుచున్నాము. అసలు మృత్యుహేతువులు ఏమనగా అహంకారము, కర్తృత్వము, ఇవే. కేవలచైతన్యమువద్దకు మృత్యువు సమీపించడానికే వీలులేదు.

సినిమాలో కనబరచే ఫలపుష్పభరితవృక్షములను చూచి, అనుభవించుదా మని గాని, అందు కనుబరచే భయంకరఅగ్నిజ్వాలలు గాంచి భయపడి పరుగెట్టుట గాని మన కుండదు. ఎందువలన? అవి అన్నియు అసత్యము లని తెలియును గనుక; అలాగే యీప్రపంచము, సంసారము మిథ్యామాత్రమే, యని మనకు తెలిసినపుడు శోకమోహములు ఉండవు.

"స్వర్గకామో యజేత" స్వర్గమును కోరువాడు యజ్ఞమును చేయవలెను. అన్నవాక్యము విధివాక్య మని పూర్వమీమాంసకులసిద్ధాంతము. ప్రవృత్తి నివృత్తులకు కారణము రాగద్వేషములే గాని వేదవాక్యములు.

కావు. సుఖము కోరునట్టి మనకు వేదము యజ్ఞము చేసినచో స్వర్గము వచ్చు నని చెప్పుచున్నది, తెలియజేయుచున్నది. అజ్ఞాతార్థజ్ఞాపకమే విధివాక్యము. వేదశబ్దములకు తెలియజేసే స్వభావమే గాని చేయించుట యందు వాటికి శక్తి లేదు.

రజ్జుసాక్షాత్కారమువలన సర్పప్రతీతి పోవునట్లు, ద్వైతప్రపంచ విలయము, తత్త్వసాక్షాత్కారమువల్లనే కలుగుచున్నది; మరేమియు ప్రయత్నము చేయ నక్కఱ లేదు. కుండను చూడవలె నన్నచో అందుకు ప్రమాణ మగు కన్నువలన అది యథాతథంగా తెలియు చున్నది; గాని మనకు యేయితరప్రయత్నముమీద ఆధారపడి లేదు. అలాగే వస్తుదర్శనము ప్రమాణజన్యమే గాని పురుషతంత్రము గాదు. వేదములు ప్రమాణబోధకములే గాని ప్రవర్తకములు గావు. రాగద్వేషములే ప్రవర్తకములు, నివర్తకములు. అద్వైతులవాదము ఏమి టనగా విధి ఉత్తరకాండలో లేదనుటే గాక పూర్వకాండలో గూడ లేదనే మానిశ్చయ మనెదరు.

గజేంద్రరక్షణమునకు విష్ణువు వచ్చుటకంటే స్వప్నములోని దుఃఖము మెలకువ రాగానే ఒక్కలిప్తమాత్రము ఆలస్యము లేకుండ తత్క్షణమే పోవుచున్నది. సద్గురువులవలన చక్కగా బ్రహ్మ విషయము వినుట మహాపుణ్య మని మనకు మనకే స్వానుభవములో తెలియుచున్నది.

"సమచిత్తులు, ముకుందుని చరణములను ధ్యానించువారు, అగు సాధువులయొక్క దర్శనము కలిగినంతనే, సూర్యునియొక్క దర్శనము కలిగినంతనే చీకటిపోయినట్లు, సంసారబంధమునకు అంతము కలుగును."

"సాధూనాం సమచిత్తానాం ముకుందచరణైషిణామ్।
దర్శనాంతో భవేత్ బంధః పుంసోఽక్ష్ణో స్సవితు ర్యథా॥"

## 13. మోక్షము

చిత్సమాధి – జ్ఞానముచేతవచ్చును. చిత్తసమాధి–యోగముచేత కలుగును. అన్యథాజ్ఞానము ఉన్నను బంధము లేనిస్థితి తత్త్వసాక్షాత్కారంచేత పొందవచ్చును. దేవుడు వేరు, నేను వేరు అనునది ద్వైతము. అపుడు నీవు జీవుడవే గదా! అందువలన నీ కేమి ప్రయోజనము? ప్రమాత – అహంకారతాదాత్మ్యముగల ఆత్మ. అజ్ఞానమును నివర్తించుటే శాస్త్ర ప్రయోజనం. సవిశేషమైనజీవునకు విశేషమును, తొలగించుటవలన నిర్విశేషమైన బ్రహ్మముతోనే సర్వాత్మనా ఐక్యము కుదురును. కర్మయోగమునకు అదృష్టద్వారా చిత్తశుద్ధి, కర్మత్యాగమునకు దృష్టద్వారా నిరంతర బ్రహ్మవిచారణ ఫలములు. అందువలన సర్వప్రతిబంధకములు తుడిచిపెట్టుకొనిపోయి మోక్షము వచ్చును. యతీశ్వరుడు తనకు శమదమాదులు ఉన్నవా, లేవా అని చూచుకొనవలెను. వేదవిహితమైన సర్వపుణ్యకర్మలు వివిదిష పుట్టుటకొరకే.

మనస్సులో కాలుష్యము ఏమిటి?

1. చెప్పినను తెలిసికొనలేక పోవుట.

2. అన్యథాగా (విపరీతముగా) తెలిసికొనుట.

3. ఏమైనా తెలిసినను, అందులో ఏకాగ్రత ఉండకపోవుట. మోక్షమునకు సర్వుల కధికారము కలదు. కాని డాక్టరు చెప్పినట్లు రోగి వినవలసిన రీతిగా శాస్త్రము చెప్పినట్లు వీరు విని నడుచుకొనవలెను. గురుసేవలో సర్వదేవతాసేవలు యిమిడివున్నవి.

అసలు వున్నది ఆత్మ. అనాత్మ యనగా దానినే ఇంకొక విధంగా తలచుట. ఈశ్వరసేవ అనగా వేదవిహితకర్మలద్వారా స్వధర్మానుష్ఠానమే. శరణాగతి అర్థము కూడ స్వధర్మనిర్వహణమే. సృష్టి అనాది అంటే మొదలు లేనిది; అనగా అసలే లేనిది.

నేను "రామయ్యను" అనునది సర్వదా ఎంత దృఢముగా వున్నదో అంత దృఢముగా "నేను బ్రహ్మమును" అను విజ్ఞానము ఉండుటే స్వానుభవపరమావధి.

సాక్షాత్ శంకరులు వచ్చి "నేను చెప్పిన అద్వైతము తప్పు" అని చెప్పినను నిజమైన సమ్యగ్దర్శి ఆమాట ఒప్పుకొనడు.

మన ఉచ్ఛ్వాసనిశ్వాసములకు మనము ఎలా కర్తలము గామో అదేవిధముగా వేదములకు పరమేశ్వరుడు కర్త గాడు.

బుద్ధిని పరీక్షించుకొనుటయే చిత్తశుద్ధి; అనగా ప్రపంచమునందు నీకు అపేక్ష ఉన్నదా, ఉపేక్ష వున్నదా గమనించుకొనవలెను. సత్పురుషులతో సహవాసము కృతార్థతకు మూలము.

సృష్టిని వేదము వర్ణించిన దంటే సృష్టికి అధిష్ఠానమును తెలిసికొనుటకే గాని సృష్టివలన వేరే ప్రయోజనము లేదు. పుణ్యపాపములు అనుభవించే కొద్దీ వివేకికి వైరాగ్యము కలుగును; అవివేకికి రాగద్వేషములు కలుగును.

దేహము క్షణభంగుర మని తెలుపుటకు కారణము, ఈదేహము వలన పొందతగిన మహత్తరలాభమును త్వరగా పొందు మని చెప్పుట కొరకే. ప్రపంచము మిథ్య అని స్పష్టముగా తెలిసికొనుట ఎందులకు? ఆత్మయొక్క అఖండత్వమును గ్రహించుటకొఱకు. ద్వైతాస్తమయము అయినపుడే ఆనందానుభూతి. ప్రపంచములో కూడ విషయానందములో యిట్లే జరుగుచున్నది. ద్వైతము ప్రతీయమానమగుచున్నను ఆనందము ననుభవించుట బ్రహ్మవేత్తలక్షణము. "అహం"ను గుఱించిన పొరబాటు అందరికీ ఉన్నది. అహంకారమును, ఆత్మను కలుపుటయే అధ్యాస. అన్నివ్యవహారములకు ఇదియే మూలము.

దేహేంద్రియసంబంధము కలిగి, వానికి విలక్షణమైన ఆత్మను అనుభవించువారే జీవన్ముక్తులు. వారే అజ్ఞానులను కృతార్థులుగా చేయ

గలరు. వేదాంతము నిత్యారూఢమైనను అనుభూతి లేనిచో దుఃఖరాహి
త్యము కలుగదు అనుభూతి కలుగుట ఎట్లనగా సాధనచతుష్టయసంపత్తిని
అలవరచుకొని, అందులోని ముముక్షత్వమునందు తీవ్రతరమైన ఆసక్తి
కలిగి, శాస్త్రాచార్యులవలన చక్కగా ఉపదేశము నొంది పరమాత్మను
అపరోక్షముగా తెలిసికొనినపుడే సమ్యగనుభూతి కలుగును.

ప్రమాణ మంటే, తనకు కావలసినవిషయము మరొకదానిచేత
తెలియబడకుండ దేనిచేత తెలియబడుచున్నదో అదియే దానికి ప్రమా
ణము. సందిగ్ధస్థలమందు నిర్ణయము తేల్చుటకు ఉభయవాదిసమ్మత
మైన ప్రమాణము తీసికొని విమర్శించవలెను. బ్రహ్మమున కున్నది
మాయ—జీవున కున్నది అవిద్య. మాయతో కూడిన బ్రహ్మము
నుండియే ప్రపంచమునకు ఉత్పత్తిస్థితిలయములు సంభవించుచున్నవి.
అద్వైతులకు బ్రహ్మేతరపృథక్సత్త ప్రతీతిమాత్రమే గాని యథా
ర్థము గాదు. అభివ్యక్తనామరూపములచే, అనభివ్యక్తచిన్మయవస్తువు
అడ్డగింపబడుచుండును. అద్వైతుల ప్రపంచమిథ్యాత్వనిశ్చయము
శ్రేష్ఠము; అదియే సమ్యగ్జ్ఞానము. సంశయ, విపర్యయములు లేకుండ
వస్తువు అర్థము అగుటయే వస్తుసాక్షాత్కారము. "బ్రహ్మమును ఆత్మ
అనియే ఉపాసింపుము". ఏవ అను శబ్దముచేత ఇతరవిషయములు
నిషేధింపబడుచున్నవి.

"ఆత్మేత్యేవ ఉపాసీత" ఈనిషేధము వినబడునే గాని అమలు
లోనికి రాదు. ఇందులకు వ్యక్తియొక్కయోగ్యత ముఖ్యము. మనన
నిదిధ్యాసములచేత చిత్తశుద్ధిఏర్పడిన శ్రవణము చేసిన సరిగా అర్థ
మగును.

శ్రుతి పరోక్షంగానే చెప్పుచున్నది అనకూడదు; అపరోక్షంగా
కూడ చెప్పును. "సాక్షా దపరోక్షాద్ బ్రహ్మ" "సర్వాంతరః" అని
"దశమ స్త్వమ్" "నీవే పదియవవా డవు" అని సాక్షాత్తు స్వానుభవ

మును కలిగించుచున్నది. నదియందలి జలములో పదిమంది వ్యక్తులు దిగి, అవతలిగట్టుకు చేరి అందరు వచ్చినారా, లేదా, అని లెక్కపెట్టుకొనగా తొమ్మిదిమందయే లెక్కకువచ్చిరి. అపుడు ఒకడు ఏమైపోయినాడో అని దిగులు పడి భయపడుచుండగా అన్యుఁడొకడు వచ్చి, లెక్కపెట్టినవానిని చూచి, నీవే పదవవాడ వని తెలిపినాడు అపుడు దుఃఖము పోయి, అభయము పొందినారు. అట్లే అపరోక్షంగా ఆత్మజ్ఞానము కలుగుటయే ఆత్మసాక్షాత్కారము.

ప్రచండమార్తాండమండలప్రకాశము గుడ్లగూబకు చీకటిగా కనబడుచున్నది; అట్లే మనము ఆత్మకే అజ్ఞానం అనుకొంటున్నాము. మరియు మనకు ఆత్మయే చీకటిగా వున్నది "ఆ బ్రహ్మరూపమైన జ్యోతిస్సు, తమస్సునకు పరమై సకల జ్యోతిస్సులకు జ్యోతిస్సుగా నున్నది. అది అజ్ఞానమునకు అతీతమై, దానియొక్క స్పర్శను పొందుట లేదు".

"జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే।"
తమసః అజ్ఞానాదేః పరం అసంస్పృష్ట ముచ్యతే

బ్రహ్మవేత్తకు మాయ లేదు. బద్ధునికి ఆత్మ కనబడదు.
"పెంజీకటి కవ్వల నెవ్వం డేకాకృతి వెలుఁగు నతనినే సేవింతున్"
(భాగవతము)

సర్వప్రపంచము బుద్ధికల్పనయే. సంసార మిది బుద్ధిసాధ్యము. నిన్న బుధవారము ఈరోజు గురువారము అది ఎక్కడికి పోయినది? ఇది ఎక్కడినుంచి వచ్చినది? సమ్యగ్దర్శులకు అజ్ఞానం బాధితమగును. బుద్ధివృత్తులు రెండువిధములు 1. అంతర్ముఖవృత్తి, 2. బహిర్ముఖవృత్తి

ఘటమును తెలుసుకొనుచున్నాను అంటే, నాస్వంత చిత్ ప్రకాశము జడమైన బుద్ధిలో ప్రవేశించి, జడమైనఘటమును వ్యాపించినపుడు ఆతెలియుట జరిగినది. బుద్ధియు జడమే కుండయు జడమే.

చైతన్యముయొక్క స్వభావము ఆనందమే. నేను అని ప్రకాశించు చైతన్యమూర్తి నిత్యాపరోక్షంగా, ఆనందస్వరూపముతో నిండి యున్నది. ఎన్నడూ మార్పు లేని చైతన్యమువల్లనే, మార్పులన్నియు తెలియుచున్నవి. కనుక ఈసాక్షికి ఏమార్పు ఉండకూడదు. ఈచైతన్య స్వరూపముయొక్క అనుభవము కలవారే జీవన్ముక్తులు. వారి అనుగ్రహంవల్లనే బహిర్ముఖవృత్తికలవారు తరించవలసియున్నది. ఈ శరీరం పోయినచో నేనేమి అవుతానో అను దిగులు పెట్టుకొని మోక్షము కొఱకు యత్నించవలె.

అమృతాన్ధసులు అయిన దేవతలు గూడ అమృతత్వముకొఱకు ప్రయత్నించునట్టి బ్రహ్మవిద్యకొరకు నిరంతరం మనము అధికశ్రద్ధతో ప్రయత్నించవలెను. ఆత్మవస్తువు ప్రకాశించుటకు రెండవవస్తువు యొక్క సహాయము అక్కఱ లేదు. ప్రతిబుద్ధివృత్తిలో ప్రకాశించునట్టి చైతన్యస్వరూపమే బ్రహ్మము. "నేను, నేను" అని ప్రకాశించు ప్రత్యగాత్మయే బ్రహ్మము. దృశ్య మంతయు, నేతి, నేతీతి వాక్యము చేత నిషేధించి, మహావాక్యముచేత "అహం బ్రహ్మాస్మి" అని తెలిసి కొన్నవాడు కృతకృత్యుడగును. చైతన్యములో ఎప్పుడు మార్పులేదు. కార్యకారణము లన్నిటిని నిషేధించుటకు "నేతి నేతీ" అను ఆదేశవాక్యము ప్రయోజనపడి, "తత్త్వమసీ"త్యాది మహావాక్యములచేత "అహం బ్రహ్మాస్మి" అని అవగత మగును. వర్ణాశ్రమధర్మమే దీనికి పునాది. అది ఇక్కడ భారతదేశంలో నష్టమైనను, లోకాని కంతయు నష్టమే, ధర్మమును తాను ఆచరింపవలెను; ఇతరులచేత దానిని ఆచరింపజేయ వలెను.

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం
యో వై వేదాగ్ంశ్చ ప్రహిణోతి తస్మై।
తగ్ం హ దేవ మాత్మబుద్ధిప్రకాశం
ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే॥"

దేహము నేననుటయే అసలుదోషము. ఆదోషమును తీసివేసికొనుటకు ముముక్షువునై నేను ఆదేవునిశరణు పొందుచున్నాను.

ఉపనిషత్ప్రమాణముచేత అపరోక్షముగా బ్రహ్మాత్మైక్యజ్ఞానము ప్రకాశించును వేదాంత మను పరమప్రమాణము ప్రమాతృత్వమునే కొట్టివేసినది గనుక యిక ప్రమాతృప్రమాణాది వ్యవహారము లేదు. వేదాంతప్రమాణజ్ఞానమువలన వచ్చినది యే మనగా తనకు మాత్రమే జననమరణములు లే వని గాదు; మ రెవ్వరికి గూడ లేవనియే తెలిసినది. స్వప్నములో తాను, ఇతరులు చాలా బాధలలో ఉన్నను, మెలకువ రాగానే ఆబాధ లేవియు తనకు గాని యితరులకు గానీ లేవనియే తెలియుచున్నది. జ్ఞానయజ్ఞములోని వేదాంతవాక్యవిచారణచేత పుట్టిన జ్ఞానాగ్ని దేహేంద్రియాదిదుఃఖము లన్నిటిని దహించివేయుచున్నది.

రోగభూయిష్ఠమైన నాలుకకు పంచదారమాధుర్యము తెలియనట్లు అజ్ఞానముచేత ఆవరింపబడిన జీవునికి ఆనందఘనమైన వస్తువు తనలోనే వున్నను అనుభవమునకు రాదు. జీవులు శాశ్వతానందమగు మోక్షమును కోరెదరు గాని అందుకు తగినకృషి మాత్రము చేయ నుత్సహింపరు జనులు ఆరోగ్యమును కోరెదరు గాని అందుకు తగిన పథ్యము ఉండి ఔషధమును పుచ్చుకొనరు. భగవంతుని నిబంధనలను తిరస్కరించుటయే భగవదపచారము. పునరావృత్తి రహితమైన శాశ్వతపదవినే సంపాదించుటకు వీలైన ఈభరతఖండములో మనుష్యదేహమును సంపాదించుకొనియు ఊరకే పిచ్చిపిచ్చిపనులలో మునిగి కాలక్షేపం చేయుట చాలా తెలివితక్కువయే. ఎలుకలకొరకు మహాసర్పము ఆకలిగొని కాచుకొనియున్నవిధంగా మనకొఱకు మృత్యుదేవత కాచుకొనియున్నది. తప్పనిసరిగా కొద్దికాలములో నశించునట్టి ఈదేహేంద్రియాదుల యోగక్షేమమును చూచుకొనుటకు గానే మనము అనేక దేవతలను సతతము ప్రార్థించుచున్నాము. అసలు మనజీవితము విషయమై

యోగక్షేమములు వదలి మనీషాగరిష్ఠులమై పరమభాగవతధర్మంబు ననుష్ఠింపవలయు. "దుఃఖములు వాంఛితంబులు గాక చేకుఱుభంగి సుఖంబులును కాలానుసారంబులై లబ్ధంబు లగుం; గావున వృథా ప్రయాసంబున నాయుర్వ్యయంబు సేయంజనదు. హరిభజనంబున మోక్షంబు సిద్ధించు. విష్ణుఁడు సర్వభూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుండు. ముముక్షువైన దేహికి దేహావసానపర్యంతంబు నారాయణ చరణారవిందసేవనంబు కర్తవ్యంబు". అను పరమభాగవతుడైన ప్రహ్లాదునిబోధనల ననుసరింపవలయు.

ఆప్రహ్లాదునివాక్యములనే మరికొన్నిటిని ఉపనిషత్సమ్మతములై సదా స్మరించుకొనవలసిన సంగతులను తెలిపెదను.

సీ॥ సంసార మిది బుద్ధిసాధ్యము, గుణకర్మ
గణబద్ధ, మజ్ఞానకారణంబు,
కలవంటి దింతియ గాని, నిక్కము గాదు,
సర్వార్థములు మనస్సంభవములు,
స్వప్నజాగరములు సమములు; గుణశూన్యుఁ
డగు పరమునికి గుణాశ్రయమున,
భవవినాశంబులు పాటిల్లినట్లుండుఁ
బట్టి చూచిన లేవు బాలులారా,

తే॥ కడగి త్రిగుణాత్మకములైన కర్మములకు
జనకమై వచ్చు నజ్ఞానసముదయమును
ఘనతరజ్ఞానవహ్నిచేఁ గాల్చిపుచ్చి,
కర్మవిరహితులై హరిఁ గనుట మేలు.

సీ॥ కంటిరే మనవారు ఘనులు గృహస్థులై
విఫలులై కైకొన్న వెట్టితనము;
భద్రార్థులై యుండి పాయరు సంసార

పసిపిల్లలు మట్టితో పిచ్చికగూళ్ళు కట్టుకొని కొంతసేపు ఆడుకొని చివరకు వాటి నన్నింటిని చెరిపి ఎట్లు పోవుచుందురో అలాగే పరమేశ్వరుడు ఈసర్వబ్రహ్మాండములను సృష్టించి, సృష్టించి లయము చేయుచున్నాడు.

"నేను" అనే నాప్రత్యగాత్మస్వరూపము నన్ను ఎప్పుడు విడిచి వుండ లేదు. అట్టి "నేను" అనేవానినే సాక్షాత్తు పరబ్రహ్మముగా వేదాంతము చెప్పుచున్నది. ఈవిషయము తెలియక అజ్ఞానముచేత సకలానర్థములు అనుభవించుచున్నాము. అజ్ఞానము ఒక్కటే మనకు ఈ మహత్తరలాభము అందకుండజేయుచున్నది. చిత్తనైర్మల్యము కలిగించి మనకు సాక్షాత్తుగా అభయమైనట్టి సత్యజ్ఞానానందలక్షణమైన అఖండబ్రహ్మాత్మజ్ఞానము కరుణతో వేదమాత ప్రసాదించుచున్నది. సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ మను సూక్ష్మమైన కారణగోళమువల్ల గాని, శబ్దస్పర్శరూపాదిభగవత్ స్థూలగోళమువలన గాని లాభము పొటించ కుండ నిర్విశేషపరబ్రహ్మమునందే ఆసక్తి గలవాడు వేదాంతజ్ఞానము యొక్క పరమలాభమును పొందగలడు. ఇట్టి పరిపక్వబుద్ధిసంపన్నుడైన జ్ఞానియే సర్వపుణ్యపాపములకు అసంస్పృష్టుగా వుండగలడు.

ఈశరీరరక్షణకొఱకైన నీప్రయత్నము మానుకొని, ఆవిషయమును ప్రారబ్ధమునకు అప్పగించి ఉండుటయే మేలు అని భగవంతుడు చెప్పుచున్నాడు.

"ఈరోజు అష్టమి యని, నవమి యని, చతుర్దశి యని చెప్పుచున్న జ్యోతిష్కునివాక్కు ననుసరించి జనులు భక్తితో ఉపవసించుచున్నారు. కాని వారు "తత్త్వము నీవే" అని చెప్పుచున్న శ్రుతియొక్క వాక్యమును విశ్వసింపకున్నారు. ఇది గదా అద్భుతమైన విషయము!".

"అద్యాష్ట మీతి, నవ మీతి, చతుర్ద శీతి,
జ్యోతిష్కవా చోపవసన్తి భక్తా,

శ్రుతే స్త్వహో "త త్త్వ మ సీ"తివాక్యం
న విశ్వస స్త్యద్భుత మేత దేవ"

సాక్షాత్ భగవంతుడు "సర్వభూతముల హృదయములందు నేనే ఉన్నాను" అని చెప్పినను జనులు తమలో వుండు రాగద్వేషములు మొదలగు లోపములను చూచుకొని భగవంతునివాక్యమునందు విశ్వాసము లేక మృచ్ఛిలామయములైన ప్రతిమలను దేవతాబుద్ధితో పూజలు చేయుచున్నారు.

"ఆత్మన స్తత్ప్రకాశత్వం యత్పదార్థావభాసనం,
నాగ్న్యాదిదీప్తివ ద్దీప్తిః భవత్యాన్ధ్యం యతో నిశి।
అపరోక్షానుభూతి 22వ పేజి

అనగా ఆత్మయొక్క ప్రకాశము బోధరూపమే గాని అగ్నివలె చీకటిని పోగొట్టునది కాదు.

"యస్మిన్ సర్వాణి భూతాని హ్యాత్మత్వేన విజానతో
న వై తస్య భవేన్ మోహో న చ శోకోఽద్వితీయతః॥
అపరోక్షానుభూతి 64 శ్లోకము

"యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూ ద్విజానతః
తత్ర కో మోహః క శ్శోకః ఏకత్వ మనుపశ్యతః॥
ఈశావాస్యోపనిషత్తు

ఏ జ్ఞానపరిపక్వస్థితియందు సర్వభూతములును ఆత్మయే యని, వాని ఏకత్వమును తెలుసుకొనుచున్నాడో అపుడు మోహము గాని శోకము గాని ఉండవు. "ద్వితీయా ద్వై భయం భవతి" రెండవది ఉన్నచో భయము కలుగును.

శా॥ "జన్మానేకశతై స్తదాదరయుజా భక్త్యా సమారాధితః,
భక్తై ర్వైదికలక్షణేన విధినా సంతుష్ట ఈశ స్స్వయమ్।
సాక్షాచ్ఛ్రీగురురూప మేత్య కృపయా దృగ్గోచర స్సన్ ప్రభుః,
తత్త్వం సాధు విబోధ్య తారయతి తాన్ సంసారదుఃఖార్ణవాత్॥"

మూ॥ "నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా,
అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం త దుపలభ్యతే॥"

బ్రహ్మము వాక్కుచేత గాని మనస్సుచేత గాని నేత్రముచేత గాని పొందుటకు శక్య మయినది కాదు. ఉన్నా దని చెప్పువానికంటే వేఱయినవానిచేత అనగా నాస్తికునిచేత ఆబ్రహ్మము ఎట్లు పొంద బడును.

మూ॥ "అస్తీత్యే వోపలబ్ధవ్య స్తత్త్వభావేన చోభయోః।
అస్తీత్యే వోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి॥"

అస్తిత్వనాస్తిత్వభావములందు రెంటిలోపల, తత్త్వభావముచేత ఆబ్రహ్మము ఉన్న దనియే పొందదగినది. ఉన్నదను నిర్ణయము పొందినవానికే తత్త్వభావము ప్రసన్నమగుచున్నది.

అవ:— ఈ ఆత్మవిజ్ఞానమువలననే శోకాత్యయము అనగా శోకనాశ నము కలుగు నని నిరూపించుచున్నాడు.

మూ॥ "అశరీరగ్ం శరీరే ష్వనవస్థే ష్వవస్థితం
మహాంతం విభు మాత్మానం మత్వా ధీరో న శోచతి॥"

బుద్ధిమంతుడు ఆత్మను శరీరరహితునిగను, అనిత్యములగు దేవపితృమనుష్యాదిశరీరములం దున్నవానిగను, అనగా నిత్యునిగాను గొప్పవానినిగను, సర్వవ్యాపిగను (ఇచ్చట ఆత్మశబ్దమును ప్రత్యగాత్మ వాచకముగ తలంచుటయే ముఖ్యము.) తలంచి అనగా "అయం అహం ఇతి నేనే పరబ్రహ్మ మని తలంచుచున్నవిద్వాంసుడు శోకింపడు". ఇట్టివాడయిన ఆత్మవేత్తకు శోకము లే దని భావము. ఆత్మకు సశరీర త్వము అభిమానికమే గాని స్వాభావికము గా దని ఎఱుగవలయును.

మూ॥ "యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః।
అథ మర్త్యోఽమృతో భవ త్యత్ర బ్రహ్మ సమశ్నుతే॥"

పరమార్థదర్శియగు విద్వాంసునియొక్క సమస్తమయిన కామ ములు ఆత్మప్రబోధమునకు ముందు ఆయనయొక్క బుద్ధిని ఆశ్రయించి యుండును. ఆత్మప్రబోధానంతరము కోరదగిన అన్యపదార్థము లేకపోవు

టచేత స్వయముగా ఆకామములు బుద్ధిని వదలిపోవుచున్నవి. "కామః సంకల్పః విచికిత్సా" అను శ్రుత్యంతరమువలన కామాదికమునకు ఆశ్రయము బుద్ధియే గాని కొందరనుకొన్నట్లు ఆత్మ గాదు. వైశేషికులు నైయాయికులు మొదలగువారు ఇచ్ఛాదులను ఆత్మధర్మములనుగా కల్పించి ఉపనిషచ్ఛాస్త్రార్థమునకు వ్యతిరేకముగా చెప్పుచున్నారు. భగవద్గీతలో భగవానుడు "ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం" అనునవి క్షేత్రధర్మములే గాని క్షేత్రజ్ఞధర్మములు గావని చెప్పెను. ఆత్మవిజ్ఞానప్రబోధమునకు ముందు మరణధర్ముడు అయినఆత్మయే విజ్ఞానప్రబోధానంతరము, అవిద్యాకామకర్మలక్షణమగు మృత్యువు నశించుటచేత అమృతుడు మరణరహితు డగుచున్నాడు. గమనప్రయోజకమయిన మృత్యువు నశించిపోవుటచేత ఆత్మవేత్తకు అన్యత్ర గమనము అనుపపన్న మగుచున్నది. సర్వబంధములు నశించుటచేత ఇచ్చటనే అతడు బ్రహ్మస్వరూపు డగును.

మూ॥ యదా సర్వే ప్రభిద్యన్తే హృదయ స్యేహ గ్రన్థయః।
అథ మర్త్యోఽమృతో భవ త్యేతావ దనుశాసనమ్॥"

కఠోపనిషత్తు.

"ఓనచికేతుడా! ఈశరీరము నేను, ఈధనాదికము నాది, నేను సుఖిని, దుఃఖిని, సమర్థుడను అని తలంచుట, మున్నగునవి అవిద్యాగ్రంధులు. 'నేను శరీరము గాను, బ్రహ్మాత్మభూతుడను, అఖండాత్మస్వరూపుడను, అసంసారిని' అను దృఢభావన కలుగుటతోడనే అవిద్యాగ్రంధు లన్నియు ఈశరీరమునందే జీవించియుండగనే నశించిపోవును వెంటనే అవిద్యాగ్రంధులే నిమిత్తముగా గల కామములు గూడ సమూలముగ నశించును. కామము లన్నియు నశించినవెంటనే మరణధర్ముడైన జీవుడు అమృతు డగుచున్నాడు ఉపనిషత్తులు అనుశాసించునది ఇంతియే" అనుశాసన మనగా ఉపదేశము. సర్వోపనిషత్తులం దుపదేశింపబడినతత్త్వ మిదియే యని భావము.

ఓం తత్ సత్.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

శ్రీగురుభ్యోనమః
హరిః ఓమ్
శ్రీరస్తు

# అ ను బ ం ధ ము

## 1. శ్రీగౌడపాదకారికలు

మూ॥ మనసో నిగ్రహాయత్త మభయం సర్వయోగినామ్।
దుఃఖక్షయః ప్రబోధ శ్చా ప్యక్షయా శాంతి రేవ చ॥ 40

మూ॥ అస్పర్శయోగో వై నామ దుర్దర్శ స్సర్వయోగిభిః।
యోగినో బిభ్యతి హ్యస్మా దభయే భయదర్శినః॥ 39

మూ॥ అజ మనిద్ర మస్వప్న మనామక మరూపకమ్।
సకృ ద్విభాతం సర్వజ్ఞం నోపచారః కథంచన॥ 36

గౌడపాదీయమాండూక్యకారికలు. అద్వైత ప్రకరణము

ఆత్మసత్యానుబోధసహితులగు సకలయోగులకు అభయము మనో నిగ్రహాధీనమై యున్నది. ఒక అభయము మాత్రమే కాదు; దుఃఖ క్షయము సైతము మనోనిగ్రహాయత్తమే. అవివేకులగు వారలకు కేవల సంకల్పవికల్పస్వరూపమగు మనస్సు చలించుచుండగా దుఃఖ క్షయము ఉండడాల దనుట సుప్రసిద్ధమే గదా. మరియు వారలకు ఆత్మ ప్రబోధము సైతము మనోనిగ్రహాధీనమే. అక్షయమగు మోక్ష మను పేరుగల శాంతి సైతము మనోనిగ్రహాధీనమే అగుచున్నది.

ఈ అద్వైతతత్త్వము జీవపరమాత్మలకు ఏకత్వమును గనం బఱుచునట్టి ఔపనిషదజ్ఞానము. "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" అని నారదులవారు గురువును అడుగుచున్నారు. సర్వసంబంధము లను పేరుగల స్పర్శములచేత వర్జిత మగుటచేత దీనిని అస్పర్శయోగ మని శ్రుతిశీర్షములగు ఉపనిషత్తులు చెప్పుచున్నవి. వేదాంతవిజ్ఞానవిరహితు

లగు సకలవిధయోగులచేత నీ అద్వైత ఆత్మతత్త్వము దుఃఖముచేత చూడదగినది, కావున దుర్దర్శ మనబడుచున్నది. శ్రోత్రియులగు కర్మఠులు అవివేకముచేత భయరహితమగు ఈయాత్మతత్త్వమునందు భయ నిమిత్తమగు ఆత్మనాశనమును గాంచుచు, ఈ అస్పర్శయోగము సర్వ విధభయవిరహితమయినను, ఆత్మనాశనమును కలుగజేయు నని భయ పడుచున్నారు. అద్వైతదర్శనమే అస్పర్శయోగ మనబడును. వర్ణాశ్రమాదిధర్మములచేతను పాపాదిమలములచేతను స్పర్శములేనిది అగుట చేత దీనికి "అస్పర్శయోగము" అని అన్వర్థనామము కలిగినది. ఇందు లకు శ్రుతి ప్రమాణము.

శ్రుతి॥ న లిప్యతే కర్మణా పాపకేన. బృహ ౬-౪-౨౩
"అన్యత్ర ధర్మా దన్య త్రాధర్మాత్"
కఠోపనిషత్.

జీవాత్మైకత్వరూపమగు దర్శనము సకలవిధభయవినాశక మయి యుండగా వివేకహీనులగు కర్మఠులు ఈజీవాత్మైకత్వరూపమగు దర్శనమే ఆత్మనాశక మని భయపడుచున్నారు.

కిం చైతస్య జ్ఞానస్యమాహాత్మ్యమ్ –
శ్లో॥ అపి చే దసి పాపేభ్య స్సర్వేభ్యః పాప కృత్తమః।
సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సంతరిష్యసి॥
భగవద్గీత–4వ అధ్యా 36 శ్లో.

వృజినం = వృజినార్ణవమును = పాపసముద్రమును తరింప గలవు. "ధర్మోఽపీహ ముముక్షోః పాప ముచ్యతే" ముముక్షువులకు ధర్మము గూడ పాప మని చెప్పబడుచున్నది.

శ్రీశంకరభాష్యము.

ఈఅద్వైతాత్మతత్వము జన్మనిమిత్తము లేనిధి. కావున సబాహ్యాభ్యంతరముగ అజము. జన్మము రజ్జుసర్పమువలె అవిద్యా

నిమిత్తము. ఆ యవిద్య ఆత్మసత్యానుబోధముచేత నాశన మొనర్ప బడినది. కావుననే అజము. అజము కావుననే అనిద్రము; నిద్రయనగా అవిద్యాలక్షణమగు అనాదిమాయ. అద్వయమగు ఆత్మరూపముతో స్వాపమునుండి ప్రబుద్ధు డైనాడు కావున అస్వప్న మనబడును.

బ్రహ్మాత్మను తెలిసికొనకపోవుటచేతనే అజ్ఞానమువలన నామ రూపములు కలుగుచున్నవి. ఆత్మజ్ఞానమువలన ఆ నామరూపములు రజ్జుసర్పమువలె నశింపగా ఆత్మ, నామముచేత పిలువబడదు. ఏవిధ మైన రూపముచేత గాని నిరూపింపబడదు. "యతో వాచో నివర్తన్తే" మున్నగు శ్రుతి వాక్యములున్నవి. మరియు సకృద్విభాతము ఎల్లప్పుడు ప్రకాశస్వరూప మయినది. అవిద్య యను తమస్సు నశించుటచే నిత్య చైతన్యప్రకాశరూపముగా ఉన్నది. కావుననే సర్వజ్ఞము. సర్వజ్ఞ మనగా సర్వమునకు, జ్ఞ స్వరూపమును అయిన దనుట. ఇట్టి బ్రహ్మాత్మ విషయము ఏ ఉపచారము లేనిది. అనగా ఉపాసనాదికము చేయ నక్కర లేదు.

## 2. ముండకోపనిషత్

### ముండకోపనిషత్—తృతీయముండకే

### ప్రథమః ఖండః

ఇందుకు శ్రీశంకరులవారి భాష్యమును చూడండి.

ఉపనిషత్:— సమానే వృక్షే పురుషో నిమగ్నోఽ
నీశయా శోచతి ముహ్యమానః।
జుష్టం యదా పశ్య త్యన్య మీశ
మస్య మహిమాన మితి వీతశోకః॥ 2.

ఊర్ధ్వమూలము, క్రిందికి ప్రసరించిన శాఖలు గలదై అవ్యక్త మనెడి మూలమునుండి పుట్టిన అశ్వత్థ మనెడి వృక్షము క్షేత్ర మను పేరు గలది. జీవుడు ఈశ్వరుడు పక్షులవలె ఒకే చెట్టు నంటిపెట్టుకొని

యున్నారు. కలిసిమెలిసి యున్నట్టి మిత్రులైనట్టి వారిరువురిలో ఈశ్వ రునికన్న భిన్నుడు, క్షేత్రజ్ఞసంజ్ఞకుడు అయినజీవుడు వివేకము లేని కతన తనకర్మలచే నిష్పన్నమైనట్టి నానారుచులతో బహువిధసుఖదుఃఖ రూపమగు ఫలము ననుభవించును ఇంతకన్న భిన్నుడు, నిత్యశుద్ధ బుద్ధముక్తస్వభావుడు, సర్వజ్ఞు డగు నీశ్వరుఁడు అనుభవింపనివాడై నిత్యసాక్షిగ చూచుచుండును.

ఇది యిట్లుండ:—

ముందు జెప్పిన సమానవృక్షము నందలి పురుషుడు భోక్తయగు జీవుడు అవిద్యాకామకర్మఫలరాగాదుల గొప్పబరువుచే, క్రుంగినవాడయి సముద్రపునీటిలో సొరకాయబుఱ్ఱవలెగిది నిమగ్నుడై తాదాత్మ్యముతో దేహాత్మభావము దాల్చినవాడై, ఈదేహముగలవాడనే నేను ఇతని సుతుడను, అతని మనుమడను, కృశుడను, స్థూలుడను, గుణవంతు డను, గుణహీనుడను, సుఖిని, దుఃఖిని, ఇంతకన్న వేఱు గాదు అనెడి యిట్టి నిశ్చయము గలవాడై పుట్టును, చచ్చును, సంబంధిబాంధవులతో గలియును, విడివడును. అందువలన జీవుడు "నే నెందులకు పనికిరాని వాడను; సుతుడు నష్టు డయ్యెను; భార్య గతించెను; ఈజీవితముతో నా కేమి ప్రయోజనము?" అను మొదలగు నిట్టి దృష్టితో దీనుడయి చేతకానితనముతో వివేకములేనందున బహువిధములైన అనర్థములకు లోనయి కలవరపడుచు లోలోన కుములుచుండును. ఇవ్విధమున ఆ జీవుడు ఎడతెఱపి లేక దేవతిర్యఙ్మనుష్యాదియోనులలో జన్మలేనివా డయ్యు జన్మభావమును బొంది అనేకదురవస్థలకు పాల్పడును. ఒకా నొకప్పు డాజీవుడు తన పూర్వజన్మసంచితపుణ్యముల పరిపాకవశమున పరమదయాళువగు గురువునుపదేశమున యోగమార్గము నెఱిగి, అహింసాసత్యబ్రహ్మచర్య సర్వత్యాగశమదమాదిసంపన్ను డయి, సమాహితచిత్తుడై, తన్ను శరీర మనెడి వృక్షము ఉపాధిగల జీవుని కన్న విలక్షణు డనియు, అసంసారి అనియు, ఆకలిదప్పులు, శోకమో

హములు, జరామృత్యువులు లేనివాడనియు, సకలజగములకు నీశ్వరు డనియు, నేను సర్వసముడను, సకలభూతస్థుడను అనియు, అంతకన్న భిన్నుడను గా ననియు, అవిద్యవలన కలిగిన ఉపాధిచే పరిమితమయిన మాయాత్మను కా ననియు, ఈజగద్రూపమయిన మహిమయు పరమే శ్వరుడైన నాకు సంబంధించినది, అనియు ఎప్పుడు తనను జూచి నిశ్చ యించుకొనునో అప్పుడు శోక రహితుడగును. సర్వసంసారసాగరము నుండి బాగుగా విముక్తుడై కృతకృత్యు డగు నని అర్థము.

## 3. జీవన్ముక్తుడు

శ్రీశంకరాచార్యులవారు స్కాందపురాణములోని సూతసంహితను 18 తడవలు చూచి వ్యాససూత్రములైన ఉత్తరమీమాంసకు భాష్యము వ్రాసినారు.

"తాం అష్టాదశథా దృష్ట్వా శంకర స్సూతసంహితామ్।
చక్రే శారీరకం భాష్యం సర్వలోకమనోహరమ్॥"

"ఏకవిజ్ఞానేన ఇదం సర్వం విదితం భవతి" అనగా ఇక తెలుసు కోవలసినది మరేది లే దని యర్థము. లోకంలో జీవుడు-దేవుడు వేరు వేరు అని మామూలుగా అనుకొంటున్నారు. అద్వైతులఅభిప్రాయం వారిద్దరూ ఒక్కరే అని, మరికొందరు ఇద్దరూ వేరు వేరు అని చెప్పు దురు తత్త్వమసి = తత్-త్వమ్-అసి. ప్రత్యగాత్మయే బ్రహ్మవస్తువు.

ఇంద్రియములకు కనబడునట్టి రూపమును మినహాయించి బుద్ధిలో మరొకపద్ధతిగా గ్రహించే శక్తి సహజముగా మనకే ఉన్నది ఉదా:- ఎక్కడో పుట్టిన ఆడపిల్లను తీసికొనివచ్చి "నీభార్య" అని కొంతక్రియాకలాపము చేయుగానే, నీ వారోజునుండి నిస్సంశయ ముగా అట్లు నడచుకొనుచున్నావా, లేదా? అలాగే ఉపనిషత్తు "నీవు మర్త్యు డవు గాదు, సచ్చిదానందస్వరూపుడైన పరబ్రహ్మవే" అని చెప్పినపుడు ఎందుకు నీవు విశ్వసించడము లేదు? అది నీదౌర్భాగ్యమే; నిష్కామ్య

మైన పుణ్యబలము లేనందువల్లనే. మరియు క్రొత్తగా వచ్చిన అడ పిల్లను భార్యగా ఉపయోగించుకొనుటకు ఏమి తపస్సు చేసినావు? ఏ ఉపాసన చేసినావు? అంటే అది నీవు కోరిఉన్నావు గనుక అని చెప్ప వలెను అందులో, అనగా భార్యాపరిగ్రహామునందు నీకు ఉత్సాహాము ఉన్నది గనుక. "ఈ ఆత్మ ప్రవచనముచేత గాని బహువిషయములు విని యుండుటచేత గాని లభింపదు ఇది ఎవనిని వరించుచున్నదో వానికే అది లభ్య మగును. వానికి ఈఆత్మ తనతనువును ప్రకటించుచున్నది." అనగా ఎవడు ఆత్మనే కోరుచున్నాడో వానినే అది కోరును అని అర్థము.

ఉపనిషత్:— నాయ మాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన।
య మే వైష వృణుతే తేన లభ్యః
తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్॥

ఆ నచికేతుడు కోరినట్లు నాకు ఆత్మసంగతే కావలె నని కోరవలెను.

నేననేవానియందు కర్తృత్వభోక్తృత్వములు భాసించుచున్నను (పత్రీతీయమాన మగుచున్నను) నేను అసంగచిద్రూపుడను, అకర్తను అభోక్తను, అని యనుభవము కలిగి ఉన్నవాడే జీవన్ముక్తుడు. స్త్రీ వేషంవేసిన పురుషుడు, తాను స్త్రీగా యితరులకును, తనకును ప్రతీయ మాన మగుచున్నను తాను పురుషుడ ననే అనుభవానికి ఏమియు ఆటంకము లేదు.

తే॥ తరుణివేషంబుఁ గైకొన్నపురుషుఁ డరయ
పురుషుఁ డగుఁ గాక పరికింపఁ దరుణి యగునె,
జీవభావంబుఁ జేకొన్న కేవలాత్ముఁ
డాత్ముఁ డగుఁ గాక మఱి జీవుఁ డగునె తెలియ॥

కనుక జీవబ్రహ్మములకు భేదము లేదు. (ఇచ్చట జీవు డనగా ప్రత్యగాత్మ యని గ్రహింపవలెను) ప్రత్యగాత్మ పరబ్రహ్మములకు భేదము లే దని గ్రహింపవలెను.

విశిష్టవాక్యార్థములో అపేక్షితమైన ప్రయోజనము ప్రత్యేక పదములచేత తేలవలెను. "తత్త్వ మసి" విశేష్యవిశేషణ-అనాపన్నమై చివరి "అసి" అనుక్రియవలన వస్తుమాత్రావగాహియై కేవలవస్తుమాత్ర ముగా తేలుచున్నది. కూడనిపనిచేయుచున్నవాని విషయమై "విషమును తినవద్దురా" అను వాక్యమునకు అర్థము నీవు ఏమిగా భావించు చున్నావు? దానిసహజార్థమును గాక ఉపక్రమోపసంహారములను గమ నించి చెప్పునట్టి అర్థమే దాని తాత్పర్యము గద "తత్త్వవిచారమే మహాతపస్సు" ఈపవిత్రమైన మనుష్యదేహమును పశుపక్ష్యాదులవలె గ్రామ్యసుఖమునకు వినియోగించుకొనగూడదు. ఇదియే భగవదప చారము. తన కిచ్చిన దేహమును తన కిష్టము వచ్చినట్లు వాడుకొను టయే వీని అపరాధము.

## 4. సాధనమార్గము

ఇహ + అముత్రార్థఫలభోగములందు కక్కినయన్నమునందువలె విరక్తిజెందవలెను. ఏభోగమైనను వద్దనుటకు దోషదృష్టియే సరియైన హేతువు.

అతిమృదువైనది వెన్నపూస. సాధువులహృదయము అంత కంటే మృదువైనది. వెన్న అగ్నితాపముచే కరుగును. సాధువుల హృదయము పరుల తాప వాక్యముల చేతనే కరగిపోవును. "పరతా పేన తాపః" దేహేంద్రియాదులయందు భోగ్యదృష్టి సర్వప్రాణులకు సహజము; సాధనదృష్టి శాస్త్రానుసరణకల వారికి ఉండును.

దేహంలో ఉండియు దేహతాదాత్మ్యము లేనివాడు అశరీరుడు. శరీరతాదాత్మ్యము ఉన్నవాడు సశరీరుడు. తత్త్వసాక్షాత్కారంచేత కర్తవ్యం లేదని తేలాలి కాని కర్తృత్వం పోతుంది అనరాదు.

## 5 ప్రత్యగాత్మ

"మద్వ్యపాశ్రయః" అనగా పార్థసారథి అయిన కృష్ణుని ఆశ్ర యించడమా? లేక తన ప్రత్యక్చైతన్యమును గుర్తించుటయా? అజ్ఞాన మనే రోగం కుదరడానికే కర్మయోగం అనేది ఔషధసేవ. తర్వాత ఇక యేమియు అక్కఱ లేదు. స్వస్థతతో శాంతంగా ఉండడమే.

దేవుడు సకలకల్యాణగుణవంతుడు అనే ఉద్దేశములో వుండే మహాదోషము యిది:- దేవుడు నాశత్రువును చంపి, నాకు మేలు చేసి నచో ఆదేవుడు కల్యాణగుణవంతుడా?

సుషుప్తిలో దుఃఖప్రసక్తి లేకపోవటం, సుఖమునకు ఏమియు లోపము లేకపోవటము ఉన్నది. ఆ ఆనందము ఎక్కడిది? దేనిచేత వచ్చినది? అక్కడ ఏవియు లేవు. కాని సుషుప్తిలో అజ్ఞానం ఉన్నది. జాగ్రదవస్థలో వేసిన బ్రహ్మాస్త్రము సుషుప్తిలోని అజ్ఞానమును హత మార్చుచున్నది. నేనే ఉన్నాను. ఆ ఆనంద మంతయు నాదే.

ఏవిధంగా దేహేంద్రియములను కలుపుకొని నేను బ్రహ్మచారిని గృహస్థును, నల్లనివాడను, ఎఱ్ఱనివాడను అని నిస్సంశ యముగా ఎట్లు గ్రహించుచున్నాడో, అట్లే అంతఃకరణశుద్ధివలన కలిగిన వివేకజ్ఞానముతో ఉపనిషత్ప్రమాణముచే, స్పష్టముగా నిస్సంశయముగా తనను, సాక్షాత్ సచ్చిదానందపరబ్రహ్మముగా, గుర్తించుచున్నాడు. అయితే ఇందులో ఒకటి చాలా విచిత్రమైనది ఎద్ది యన-తననుగుఱించి తనకే పొరబాటువచ్చునా? ఇతరులనుగుఱించి అయితే రావచ్చును. అనెదవా! చూడుము. సుఖముగా పడుకొన్నపుడు నీకే కలవచ్చి స్వాప్నికానుభవమువలన నీవు మరొకడుగా, దుఃఖితుడుగా భ్రాంతిపడు చున్నావా? లేదా? ఇది చిచ్ఛక్తివలననా, అజ్ఞానంవలననా? నేను జీవుడ ననుభావం పెట్టుకొనియే, నిత్యసుఖము సంపాదింప దలచి యోగమువలన దేవతాస్వరూపంవలన మరణరహితుడ నగుదు నని ప్రయత్నించడము, ఎంత తెలివితక్కువో గమనించుము.

నిజమైన ఆకలి లేనపుడు తినవలెననే కోరికయే మందమైన ఆకలి. ఇహాముత్రఫలభోగవిరాగములేని జిజ్ఞాసయే మందజిజ్ఞాస.

కామములు పరిచ్ఛేదము కల్పించును. కామము లేని అనగా పరిచ్ఛేదములేని బ్రహ్మవేత్తకు మరణము లేదు. దేహాంతరప్రాప్తి లేక పోవడమే మోక్షము. కామం లేనిచో శరీరం రాదు. వేదాంతవిజ్ఞాన మథనంవలన అరణికాష్ఠంలోవున్న అగ్నివలె బ్రహ్మస్వభావము బయటపడును.

సుషుప్తిలోని అజ్ఞానమే జాగ్రత్స్వప్నములుగా మారుచున్నది. అందులోనివే ఇహపరలోకములు, పుణ్యపాపములు, వేదములు గూడ, అన్ని దేవుళ్లు, బ్రహ్మవిష్ణుమహేశ్వరులును. ప్రత్యగాత్మయగు నేనే బ్రహ్మవిష్ణుమహేశ్వరులు. "తస్య భాసా సర్వ మిదం విభాతి"

శ్లో॥ బ్రహ్మణో హి ప్రతిష్ఠాహ మమృత స్యావ్యయస్య చ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ॥

సంక్షేపశారీరకమ్ –

స్వాజ్ఞానకల్పిత జగత్ పరమేశ్వరత్వ
జీవత్వభేద కలుషీకృతభూమభావా।
స్వాభావికస్వమహిమస్థితి రస్తమోహా
ప్రత్యక్ చితి ర్విజయతే భువనైకయోనిః॥

ప్రథమోఽధ్యాయః, 2వ శ్లోకము.

భువనకారణమైన తనయజ్ఞానముచేత, ప్రత్యగాత్మ, జగత్తు పరమేశ్వరుడు, జీవుడు అను భేదములను పొంది, విస్తృతమై కలుషీకృతమై, మరల స్వాభావికమైన తన మహిమచేతనే మోహమును పోగొట్టుకొని చిద్రూపమై ప్రకాశించుచున్నది.

భాసించే ప్రపంచము మిథ్య అని శాస్త్రయుక్తులచేత పరోక్షంగా తెలియుచున్నది, గాని అపరోక్షంగా కాదు. ప్రపంచము మిథ్య అని

తెలిసి, దాని అనుపయోగం స్పష్టంగా తెలిసినపుడే అపరోక్షంగా తెలిసిన దని అర్థము. ఉపయోగము=సుఖము. దేహేంద్రియవిషయ సుఖములు అర్థక్రియాకారులు కాకుండ ఉపక్షీణం అయిపోవలెను. దేహమే అబద్ధం అని తెలియవలెను. ప్రపంచము మిథ్య అని తెలియడం మాత్రం కాదు; దేహము కూడ మిథ్య అని దేహమువలన వచ్చునట్టి సుఖదుఃఖములు నీకు అనువర్తించకుండ చూచుకొనవలెను.

## 6. కఠోపనిషత్తు

శ్రేయస్సు – ప్రేయస్సు అనునవి వేఱువేఱుగా ఉన్నవి. నిశ్శ్రేయసము అభిలషించువాడు శ్రేయస్సును అనగా మోక్షసాధన మగు జ్ఞానమును, కోరుచున్నాడు. అభ్యుదయము అనగా భూలోకస్వర్గ లోకసుఖములను కోరువాడు ప్రేయస్సును అభిలషించుచున్నాడు. శ్రేయఃప్రేయస్సులు రెండును ఆచరించుటకు మనుష్యునకు స్వాధీన ములే అయివుండగా లోకమునం దత్యధికసంఖ్యాకులు శ్రేష్ఠమైన శ్రేయస్సును వదలి నికృష్టమైన ప్రేయస్సునే ఆచరించుచున్నా రని చెప్పబడుచున్నది.

మూ॥ శ్రేయ శ్చ ప్రేయ శ్చ మనుష్య మేత
స్తౌ సంపరీత్య వివిన క్తి ధీరః।
శ్రేయో హి ధీరో ఽభిప్రేయసో వృణీతే
ప్రేయో మందో యోగక్షేమా ద్వృణీతే॥

కఠోపనిషత్ ప్రథమాధ్యాయము ద్వితీయవల్లి 2. మంత్రము.

ఈ శ్రేయస్సు ప్రేయస్సులు రెండును వివేక అవివేకాత్మక మగుటచేత వెలుతురు చీకటివలె పరస్పరభిన్నభిన్నరూపములు గలవి, మరియు నానాగతులు గలవి, మోక్షమునకు, సంసారమునకు హేతు వగుటచేత, పరస్పరము విభిన్నఫలములు గల వని ఈ శ్రేయస్సు ప్రేయస్సులనే పండితు లగువారలు చెప్పుచున్నారు. "నేను యమధర్మ

రాజును. నచికేతుడ వనెడి నిన్ను ప్రలోభించుటకు అనేక విధములగు దీర్ఘాయువు, అప్సరస స్త్రీలు, దివ్యభోగభాగ్యములు మున్నగు కామములను ఎన్నియో చూపి ఆశగొల్పినను అకామములకు నీ వేమియు వశుడవు కాలేదు. నాచికేతుడ వనంబడు నిన్ను విద్యాభీప్సగల విద్యార్థినిగ, శ్రేయోభాజనునిగ నేను తలంచుచున్నాడను."

కఠోపనిషత్తు 1వ అధ్యాయం 2వ వల్లి 4వ మంత్రము.

మూ॥ "దూర మేతే విపరీతే విషూచీ
అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా।
విద్యాఽభీప్సినం నచికేతసం మన్యే
న త్వా కామా బహవో ఽలోలుపంత॥"

విద్యయందు లేక జ్ఞానమునందు స్థిరబుద్ధి కలుగుటకుగాను అవిద్యాయుతులగువారిని వారియొక్క గతియూ నిరూపింపబడుచున్నది. ఎవ్వరు అవిద్యారూపమగు సంసారమును అభిలషించుచున్నారో వారు ఘనీభూతమైన గాఢాంధకారమధ్యమునందువలె అవిద్యామధ్యమందు అనగా సంసారమధ్యమునందున్న వారలయి, దారాపుత్ర, పశ్వాద్యాశలనుపాశశతములచేత పట్టుబడినవార లయి తామే ప్రజ్ఞగలవారలమనియు, పండితులము, శాస్త్రజ్ఞుల మనియు తలంచుచుందురు. ఈ మూఢులు మిక్కిలి కుటిలమయినట్టియు, అనేకరూపమయినట్టియు గతిని ప్రార్థించుచున్నవారలయి, గ్రుడ్డివాడగు మార్గదర్శకునిచేత మిట్టపల్లములు గల మార్గమునందు పిలుచుకొని పోబడుచున్నగ్రుడ్డివా రేవిధముగా ఆమార్గమునం దనేకకష్టములపాలగుచున్నారో అదేవిధముగా జరామరణరోగాద్యనేక దుఃఖములకు లోనగుచు స్వకృతపుణ్యాపాపకర్మానుసారము స్వర్గమర్త్యాదిలోకములందు పరిభ్రమించుచుందురు.

మూ॥ అవిద్యాయా మంతరే వర్తమానాః
స్వయం ధీరాః పండితం మన్యమానాః।

దంద్రమ్యమాణాః పరియన్తి మూఢాః
అంధేనైవ నీయమానా యథాంధాః॥

రజ్జువునందు భయమునకు కారణ మేదియులేదు. దానిని చూచి పామనుకొని భ్రమపడుటయే కారణము. అది కేవలము అజ్ఞానము. అట్లే ప్రత్యగాత్మ అయిన జీవుడు కూడ తాను నిత్యానందస్వరూపుడై యుండియు తన్ను జీవునిగా భ్రమించుచు సుఖదుఃఖములకు లోనగుచున్నాఁడు. కేవలము ఆనందస్వరూప మయిన తమస్వరూపమును వీడు గ్రహించినచో వీనియందు దుఃఖమెక్కడిది? వీరి దేహములే కాల ప్రవాహములోని సుడులు. ఇందలి జీవులు చీమలవంటివారు ప్రవాహములో పడిన చీమ ఒకసుడిలోనుండి ఎట్లో తెప్పరిల్ల వెలుపలికి వచ్చుచు వెంటనే మరియొకసుడిలో పడుచున్నట్లుగా మరియొకదేహమున తగుల్కొనుచున్నది. దేహములో ఉండుటయే జరావ్యాధిమరణాది దుఃఖములు కలుగుటకు కారణము. ఇట్టి శరీరమును నమ్ముకొని అనేకులు పరమార్థమునకు దూరు లగుచున్నారు.

యము డిట్లు చెప్పుచున్నాడు.

ఇట్టి మూఢులు పరలోకసాధనవిశేషమునందు నమ్మకము లేనివారై ధనాశ యను అజ్ఞానముచేత కప్పబడియుందురు. వివేకహీనులకు పరలోకవిషయము స్ఫురింపదు. ఈ కనబడుచున్న స్త్ర్యన్నపానవిశిష్ట మగు లోకమే కావలెను, పరలోకము లేదు, అని తలంచువాడు మాటిమాటికి నాఅధీనమును పొంది జననమరణాది దుఃఖప్రవాహమునబడి అల్లాడుచుండును. సాధారణముగా జనసామాన్య మంతయు ఈ విధముగానే కామాద్యాసక్తి కలిగియుండుట ప్రసిద్ధమే గదా.

మూ॥ "న సాంపరాయః ప్రతిభాతి బాలం
ప్రమాద్యంతం విత్తమోహేన మూఢమ్।
అయం లోకో నాస్తి పర ఇతి మానీ
పునః పున ర్వశ మాపద్యతే మే॥"

యమధర్మరాజు నచికేతునితో మరియు నిట్లు చెప్పెను:—

లోకమునందుగల కోట్లకొలదిసంఖ్యగల జనసముదాయమునం దెవ్వడో యొకడే నీవంటివాడు ఆత్మజిజ్ఞాసకలవాడు ఉండును. కావున పరమాత్మనుగూర్చి వినుటకు కూడ అనేకులకు అవకాశము ఉండదు. పరమాత్మనుగురించి వినుచున్నవారిలో అనేకులకు అసంస్కృతులగు వారికి ఆత్మతత్త్వ మనునది ఏమియో గోచరింపజాలదు. అట్టియాత్మ తత్త్వమునుగూర్చి యుపదేశించువాడు కూడ అనేకులలో ఒకడే లభించును. అట్టియాత్మనుగూర్చి యుపదేశింపబడుచున్న విషయము నాలకించుచున్నవారిలో ఒక్కడే చక్కగా ఆయాత్మతత్త్వమును గ్రహించువాడుండును. యోగ్యుడగు ఆచార్యునిచేత చక్కగా ఆత్మతత్త్వమును బోధింపబడినవాడు కూడ ఒక్కడే యుండును. అనేక జన్మార్జితసుకృత పరిపాకమువలన సంస్కృతచిత్తుడగువాడు కామాదిసుఖానుభవమునందు విరక్తి కలిగి బ్రహ్మజ్ఞానాభిముఖు డగును. ఇట్టివాడు అనేకజనులయందొక్కడే లభించును. అందువలననే ఆశ్చర్య మని చెప్పబడినది.

మూ॥ "శ్రవణాయాపి బహుభి ర్యో న లభ్యః
శృణ్వంతోఽపి బహవో యం న విద్యుః।
ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా
ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః॥" 2వ మంత్రము.

అధ్యాత్మయోగ మనగా మనస్సును విషయములనుండి మ[illegible]లించి ఆత్మయందు ప్రవేశపెట్టుటయే. ప్రాణులయొక్క బుద్ధిగుహయ[illegible]దున్నదేవుని ధీరుడయినవాడు అధ్యాత్మయోగముచేత తలంచినవాడ[illegible] ఆత్మకు ఉత్కర్షాపకర్షములు లేకపోవుటచేత హర్షశోకములను పొంద[illegible]. ఇట్లు నచికేతుని గురించి యమధర్మరాజు చాల ప్రశంసించుచు "దే[illegible] వ్యతిరిక్తమగు ఆత్మనుగూర్చి నీవు ప్రశ్నించినాడవు. ఆయాత్మయొ[illegible] పరమార్థస్వరూపవిజ్ఞానమే సంసారనివర్తకమును పరమానందప్రా[illegible]ప్తికి

ధర్మ్య మగు సాధనమును అగుచున్నది. నీ వడిగిన దానికంటే వేఱగు శ్రేయస్సాధనము లేదు. కావున నీ వడిగినదానిని చెప్పుచున్నా" నని ప్రారంభించినాడు.

యమధర్మరాజుపలుకు లాలకించి నచికేతు డిట్లు పలుకుచున్నాడు "నేను బ్రహ్మవిద్యోపదేశమునకు యోగ్యుడనై యున్నయెడల, నీవు నాయం దనుగ్రహము కలిగియున్నయెడల ఎయ్యది శాస్త్రవిహితమైన ధర్మానుష్ఠానముకంటెను, తత్ఫలముకంటెను, తత్కారకములకంటెను, వేఱయినదియు ఆ ధర్మానుష్ఠానముకంటెను, అధర్మానుష్ఠానఫలము కంటెను, తత్కారకములకంటెను వేఱయినదియు, కార్యకారణముల కంటెను వేఱయినదియు, భూతభవిష్యద్వర్తమానములకంటెను వేఱయినదియు, కాలత్రయముచేతను అపరిచ్ఛిన్నమయినది ఎయ్యది కలదో సర్వవ్యవహారమునకు అతీతమయిన అట్టిదానిని నీ వెఱింగి యున్నాడవు. కావున అట్టిదానిని నాకు బోధింపుము.

మూ॥ అన్యత్ర ధర్మా దన్యత్రాధర్మా
దన్యత్రాస్మాత్కృతాకృతాత్।
అన్యత్ర భూతా చ్చ భవ్యా చ్చ
య త్తత్పశ్యసి తద్వద.

మూ॥ సర్వే వేదా యత్పద మామనన్తి
తపాగ్ంసి సర్వాణి చ యద్వదంతి।
య దిచ్ఛంతో బ్రహ్మచర్యం చరన్తి
త త్తే పదగ్ం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్॥

పై విధముగా ప్రశ్న మొనర్చిన నచికేతునకు యమధర్మరాజు అట్టి వస్తువును సవిశేషణముగ చెప్పదలచి యిట్లని చెప్పుచున్నాడు:— "అది 'ఓం' అని చెప్పబడును. నీ వెఱుంగదలచిన వస్తువు ఓంకారశబ్ద వాచ్యము లేక "ఓం" శబ్దమే ప్రతీకముగా గల దని గ్రహింపుము.

మూ॥ న జాయతే మ్రియతే వా విపశ్చి
న్నాయం కుతశ్చి న్న బభూవ కశ్చిత్।
అజో నిత్య శ్శాశ్వతోయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥

మూ॥ హంతా చే న్మన్యతే హంతుగ్ం
హత శ్చే న్మన్యతే హతం।
ఉభౌ తౌ నవిజానీతో
నాయగ్ం హంతి న హన్యతే॥

ఈయాత్మవిజ్ఞానమువలననే, శోకాత్యయము — శోకనాశము కలుగు నని నిరూపించుచున్నాడు:—

మూ॥ అశరీరగ్ం శరీరే ష్వనవస్థే ష్వవస్థితం।
మహాంతం విభు మాత్మానం మత్వా ధీరో న శోచతి॥

ఆత్మ స్వరూపముచేత ఆకాశతుల్యుడు. కావున అశరీరి యనం బడుచున్నాడు. అనిత్యములగు దేవ, పితృ, మనుష్యాదిశరీరములం దున్నవాడైనను తాను నిత్యుడును వికారరహితుడును అని భావము. గొప్పవానిగను, విభువుగను, సర్వవ్యాపిగను, ఆత్మను (ఇచ్చట ఆత్మ శబ్దమును ప్రత్యగాత్మవాచకముగ తలంచుటయే ముఖ్యము) తలంచి, అనగా "అయం అహం ఇతి — నేనే పరబ్రహ్మ మని" తలంచుచున్న విద్వాంసుడు శోకింపడు. ఇట్టివాడయిన ఆత్మవేత్తకు శోకము లే దని భావము. (ఆత్మకు సశరీత్వము అభిమానికమే గాని స్వాభావికము గాదని ఎఱుంగవలయును.)

అవ. ఆత్మ దుర్విజ్ఞేయు డయినను ఉపాయముచేత సువిజ్ఞేయుడు, సుఖముగా తెలిసికొనుటకు శక్యమే యని చెప్పబడుచున్నది.

మూ॥ నాయ మాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన।

యమేవైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్‌ం స్వామ్॥

ఈ సాధకుడు ఇహపరలోకములయందలి, సర్వవస్తుసౌఖ్యము లందు వైరాగజము కలిగి ఏయాత్మను మాత్రమే గాఢముగా వరించుచున్నాడో వానిచేతనే, యాత్మపొందదగినవాడై యున్నాడు. కేవలి ఆత్మకాముడగు అట్టివానికి ఈయాత్మ పారమార్థికమగు తన స్వరూపమును ప్రకాశింపజేయుచున్నాడు.

అవ: "గుహ్యం బ్రహ్మ ప్రవక్ష్యామి" యని ౬వ మంత్రము నందు చేసిన ప్రతిజ్ఞ ననుసరించి యమధర్మరాజు అట్టి బ్రహ్మము నుగూర్చి చెప్పుచున్నాడు

అంతఃకరణవ్యతిరిక్తములగు చక్షురాదీంద్రియములు నిద్రించుచుండగా తాను మాత్రము నిద్రించక జాగరూకుడయి కలలో స్త్రక్చందన వనితాద్యభీష్టజాతమును ఏపురుషుడు నిర్మించుకొనుచున్నాడో అతడే పరిశుద్ధమయినట్టియు, నిగూఢమయినట్టియు పరబ్రహ్మము. ఇంతకంటే భిన్నముగ బ్రహ్మ మనునది లేదు. ఇదియే అమృతము అనగా వినాశరహిత మని సర్వశాస్త్రములందు చెప్పబడుచున్నది. పృథివ్యాదిసర్వలోకములు, కారణభూతుడగు ఆ బ్రహ్మమునే ఆశ్రయించియున్నవి. అట్టిబ్రహ్మముకంటే భిన్నముగ నుండునట్టి వస్తువే లేదు ఇదియే నీవడిగిన బ్రహ్మము "

౨వ అధ్యా, ౫వ వల్లి, ౮వ మంత్రము.

మూ॥ యఏష సుప్తేషు జాగర్తి
కామం కామం పురుషో నిర్మిమాణః।
తదేవామృత ముచ్యతే
తస్మింల్లోకాశ్రితా స్సర్వే
తదు నాత్యేతి కశ్చన ఏతద్వై తత్॥

ఆత్మదర్శనమునకు అనభిముఖంగా నుండుటయే లోకస్వభావ
ముగా నున్నది. అటుల ఆత్మదర్శనమునకు ప్రతిబంధకారణము అవిద్య.
అవిద్యాసంబంధమైన దృష్టాదృష్టభోగములందు ఆసక్తి కలుగుట తృష్ణ
యనబడును. అల్పప్రజ్ఞ గలవారలు అట్టి అవిద్యాతృష్ణలవలన ప్రతి
బద్ధమయిన ఆత్మదర్శనముగలవారలయి బాహ్యవిషయములైన కామ్య
విషయములనే కోరుచుందురు. అట్టిప్రజ్ఞావిహీనులు అవిద్యాకామకర్మ
సముదాయరూపమగు మృత్యువుయొక్క సర్వవ్యాప్తమయినపాశము
నకు గురియగుచున్నారు. ఇచట పాశ మనగా దేహేంద్రియాదిసంయో
గవియోగలక్షణ మని ఎఱుంగవలయును; జననమరణములు లనిభావము.
వీరు నిరంతరము జన్మజరామరణరోగాద్యనేకానర్థములకు లోనగు
చుందురు. అవిద్యాతృష్ణాసంబంధ మిట్టి దుఃఖములకు కారణ మని
యెఱింగిన వివేకవంతులు ప్రత్యగాత్మావస్థానలక్షణమగు ముక్తియే
శాశ్వతమని యెఱింగినవారలయి, ఇంద్రత్వాదిపదవులు గూడ అధ్రువ
ములనియు; ప్రత్యగవస్థానలక్షణరూపమగు ముక్తికి "న కర్మణా వర్థతే
నో కనీయాన్" కర్మలచేత పెఱుగుట గాని తఱుగుట గాని లేదు అని
శ్రుతి చెప్పుచున్నది, కావున ఇదియే ధ్రువ మనియు కూటస్థ మనియు;
అచంచల మనియు తెలిసికొన్నవారలై, ఈసంసారమునందు గల సర్వ
పదార్థములను అనిత్యము లని ఎఱింగినవారలయి, సంసారమునందున్న
ఏపదార్థమును గాని, ప్రత్యగాత్మదర్శనమునకు ప్రతికూల మను తలం
పుతో కోరుట లేదు అనగా వారు దారేషణ, ధనేషణ, పుత్రేషణ లను
ఈషణాత్రయమును విసర్జించి, బ్రహ్మవిద్యాభిలాషు లగుచున్నారు.

౨వ అధ్యా, ౧వ వల్లి, ౨వ మంత్రము.

మూ॥ పరాచః కామా ననుయన్తి బాలా
స్తే మృత్యో ర్యన్తి వితతస్య పాశమ్।
అథ ధీరా అమృతత్వం విదిత్వా
ధ్రువ మధ్రువే ష్విహ న ప్రార్థయన్తే॥

అవ:- బ్రహ్మవేత్తలగువారలు దేనిని ఎఱుగుటవలన మఱొక్క దానిని దేనిని కోరరో అట్టి దానిని పొందుట యెట్లు, అను విషయము చెప్పబడుచున్నది.

విజ్ఞానమే స్వభావముగా గలిగినట్టియు, దేహేంద్రియాదులకు, విలక్షణమయినట్టియు, ఏ యాత్మ యను సాధనముచేత ప్రపంచము నందుగల ప్రాణిసమూహ మంతయు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, సంభోగాదివిషయజాతమును చక్కగా తెలిసికొనుచున్నదో అదియే ఆత్మ.

ఈ ప్రపంచమునందు దేహాదిసంఘాతమునకు విలక్షణుడైన విజ్ఞానస్వభావుడగు ఆత్మకు తెలిసికొనుటకు శక్యము కానిది ఎయ్యదియు మిగిలియుండజాలదు. ప్రపంచమునం దున్నదంతయు ఆత్మకు విజ్ఞేయమే; తెలిసికొనుటకు వీలైనదే గాని శక్యము కానిది ఏదియు లేదు. ఏ యాత్మకు అవిజ్ఞేయ మయినది లోకమునం దేదియు లేదో అట్టి ఆత్మయే సర్వజ్ఞుడు గదా. ఇదియే అది.

"అన్యత్ర ధర్మా దన్యత్రాధర్మాత్" అని నచికేతుడు ప్రశ్నించినట్టియు; దేవతలకు గూడ తెలిసికొనదగినది అయినట్టియు, "దేవైరత్రాపి విచికిత్సితమ్" "సోఽధ్వనః పార మాప్నోతి త ద్విష్ణోః పరమం పదమ్" అని వ్యాపనశీలుడగుటచేత విష్ణు వని వ్యవహారింపబడుచున్న ఆత్మకు పరమపద మనియు; "యస్మాత్ పరం నాపర మస్తి కించిత్" అని వేదాంతశాస్త్రములం దుపదిష్టమయినదియును అగు ఆత్మ తత్త్వము ఇదియే.

మూ॥ యేన రూపం రసం గంధం
శబ్దాన్ స్పర్శాగ్ం శ్చ మైథునాన్।
ఏతే నైవ విజానాతి
కి మత్ర పరిశిష్యతే, ఏత ద్వై తత్॥
కఠ 2వ అధ్యా, 1వ వల్లి, 3వ మంత్రము.

అవ:— ఆత్మతత్త్వము అతిసూక్ష్మ మగుటచేత దుర్విజ్ఞేయము. కావున చెప్పిన విషయమే ప్రకారాంతరముగా మఱల మఱల నిరూపింప బడుచున్నది.

ప్రపంచమునందుగల ప్రాణిజాతము స్వప్నాంతమును అనగా స్వప్నమునందు తెలిసికొనదగిన విషయమును, జాగరితాంతమును అనగా జాగిరితమునందు తెలిసికొనదగినవిషయమును, అనగా రెండైన స్వప్న జాగరితాంతములను స్వప్నజాగరిత విజ్ఞేయములను, దేహేంద్రియాది విలక్షణమయినట్టియు విజ్ఞానస్వభావమయినట్టియు ఏఆత్మచేత తెలిసి కొనుచున్నాడో "అట్టియాత్మతత్త్వమును గొప్పదిగను సర్వవ్యాపిగను" తెలిసికొన్న జ్ఞాని అట్టియాత్మయే "సాక్షాత్తుగ నే నగుచున్నాను, నేనే పరమాత్మను" అని తలంచువాడు (సాక్షాత్కారరూప మగు ధైర్యము గలవాడు కావున) శోకింపడు.

మూ॥ స్వప్నాన్తం జాగరితాన్తం
చోభౌ యే నానుపశ్యతి।
మహాన్తం విభు మాత్మానం
మత్వా ధీరో న శోచతి॥
2వ అధ్యా, 1వ వల్లి, 4వ మంత్రము.

కర్మఫలభోక్త యగునట్టియు ప్రాణాదిసమూహమునకు ధారకు డయినట్టియు, జీవుని, నిత్యసన్నిహితునిగను కాలత్రయనియామకుని గను ఎవ్వ డెఱుంగునో అట్టివాడు తద్విజ్ఞానానంతరము ఇతరులనుండి తనకు భయము కలుగగల దను తలంపుతో ఇతరులనుండి తన్ను సంరక్షించుకొనుట కయి ప్రయత్నింపడు. ఎంతవరకు తాను భయపడ వలసిన అవసరముగల దనియు, తాను అనిత్యుడ ననియు తలంచుకొను చుండునో అంతవరకు ఇతరులచుండి తన్ను కాపాడుకొనుచుండుట లోక స్వభావమయి యున్నది. ఎప్పుడయితే ఆత్మను అద్వయునిగను,

నిత్యునిగను తెలిసికొనుచున్నాడో అప్పుడు రెండవవాడు లేనేలే దను దృఢవిశ్వాసము కలుగుటచేత భయపడవలసిన యవసరమే లేదు గదా.

2వ అధ్యా, 1వ వల్లి, 5వ మంత్రము.

మూ॥ య ఇమం మధ్వదం వేద
ఆత్మానం జీవ మన్తికాత్।
ఈశానం భూతభవ్యస్య
న తతో విజుగుప్సతే, ఏత ద్వై తత్॥

## 7. సన్న్యాసావశ్యకత

ఈ బ్రహ్మజ్ఞానవిచారణకు మనుష్య దేహమునందు యిక్కడనే చక్కని అవకాశ మున్నది. తర్వాత బహుదుర్లభమైన బ్రహ్మలోకము లోనే బ్రహ్మవిచారణకు అవకాశము ఉండును; కాని మఱియేలోకము లోను యిట్టి సదుపాయము లభింపదు.

కొందరు మోక్షప్రాప్తికి ఆత్మజ్ఞాన మొక్కటే మార్గ మనియు, "జ్ఞానా దేవతు కైవల్యమ్" అని చెప్పుచున్నారు. అట్టిజ్ఞానము ఎట్టివారి కైనను ఏ ఆశ్రమమందైనను, కలుగునని యాజ్ఞవల్క్యుని, జనకుని మొదలైనవారిని ఉదాహరించుచు సన్న్యసాశ్రమ ఆవశ్యకతను నిరాక రించుచున్నారు.

మరికొందరు మోక్షమునకు సన్న్యసాశ్రమము అక్కర లే దనియు "సన్న్యస్య శ్రవణం కుర్యాత్" అను ప్రమాణవాక్యము యెందు లోనిదో తెలియుట లే దనియు నుదుపుచున్నారు.

వీరు, "జ్ఞానం సన్న్యాసలక్షణమ్" అను శ్రుతివాక్యమును గమ నించినట్లులేదు. శ్రీగీతాభాష్యమున శ్రీశంకరభగవత్పాదులవారు ఇట్లు న్నారు. "గీతాశాస్త్రము సమస్తవేదార్థసారసంగ్రహభూతము. అయీ శాస్త్రమునకు సంక్షేపముగా, హేతుసహితమైన సకలసంసారముయొక్క ముగింపే లక్షణముగా కలిగిన పరమనిశ్శ్రేయసమే ప్రయోజనము.

అది సర్మకర్మసన్న్యాసపూర్వకమై ఆత్మజ్ఞాననిష్ఠారూపమైన ధర్మము వలన సంభవించును.

ఈగీతార్థమైన ధర్మమునుద్దేశించియే భగవంతునిచేతనే యిట్లు అనుగీతలయందు చెప్పబడినది. "బ్రహ్మపదమును గ్రహించుటకు ఆ ధర్మము చక్కగా చాల యున్నది గదా." "గీతాశాస్త్రం సమస్తవేదార్థ సార సంగ్రహభూతమ్ త స్యాస్య శాస్త్రస్య సంక్షేపతః ప్రయోజనం పరం నిశ్శ్రేయసం, సహేతుకస్య సంసార స్యాత్యంతోపరమలక్షణమ్. త చ్చ సర్వకర్మసన్న్యాసపూర్వకా దాత్మజ్ఞాననిష్ఠారూపా ద్ధర్మా ద్భవతి త దేమ మేవ గీతార్థం ధర్మ ముద్దిశ్య భగవతై వోక్తం. "స హి ధర్మ స్సుపర్యాప్తః బ్రహ్మణః పదవేదనే" ఇ త్యనుగీతాసు.

"జ్ఞానం సన్న్యాసలక్షణమ్" అనియు అందులోనే చెప్పబడి యున్నది. ఆంధ్రమహాభారతములోని అశ్వమేధపర్వమునందు ద్వితీయాశ్వాసమున 157 వచనములోను, 158 పద్యములోను ఈవిధముగా చెప్పబడియున్నది. యోగమునకు ప్రవృత్తియును, జ్ఞానంబునకు సన్న్యాసంబును లక్షణంబులు. లక్షణజ్ఞానంబు పరతత్త్వజ్ఞానంబునకు హేతుభూతంబు.

ఆ॥ జ్ఞానపూర్వకమైన సన్న్యాసకలనంబు
పరమగతి నొనర్చు భవ్యులార।
ద్వంద్వరహితుడగు నతని జరామృత్యుని
స్తరణ కరణమైన ధర్మ మొందు॥

"ఇది కర్మానుగతి, విరక్తజనసముంచితము సుడి." ఈ సంగతి సాక్షాత్ చతుర్ముఖబ్రహ్మదేవుడు మహర్షులకు వా రడుగగా చెప్పెను.

కఠోపనిషత్తు, ద్వితీయాధ్యాయ ప్రథమవల్లి, 1వ మంత్రములో ఇట్లున్నది.

మూ॥ పరాఞ్చి ఖాని వ్యతృణత్ స్వయంభూ
స్తస్మా త్పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్।
కశ్చి ద్ధీరః ప్రత్యగాత్మాన మైక్ష
దావృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్॥ 1.

తా॥ పరమేశ్వరుఁడు యింద్రియములను విషయాభిముఖస్వభావము కలవానినిగా (హింసించెను) నిర్మించెను. అందువలన ఆ యింద్రియములు శబ్దాదివిషయజాతమునే గాంచుచున్నవి; అంతరాత్మను చూచుట లేదు. ఒకానొక వివేకి అమృతత్వమును కోరుచున్నవాడయి విషయములనుండి మరలించబడిన యింద్రియసమూహముగలవాడై పరమాత్మను చూచెను.

బాహ్యవిషయములందు ప్రవర్తించుచుండుట, ప్రత్యగాత్మను గాంచుట యను విషయముల నొక్కఁడాచరింపజాలడు. కావున బాహ్యమగు జ్ఞానకర్మేంద్రియవిషయజాతమునుండి విముఖుడయి, అంతర్ముఖుడయి మహాయాసపూర్వకమగు ప్రయత్నముతో, నదీప్రవాహమున కెదురీదినటుల, ప్రవర్తించునట్టివానికే అమృతత్వప్రాప్తి–మోక్షప్రాప్తి కాని తదితరులకు లేదని భావము.

మహావాక్యదర్పణములో శ్రీశంకరులవారు ఇట్లన్నారు. "మోక్షమునకు కర్మ సాధనము కాదు" అని స్వయముగా దృఢముగా నిశ్చయించి మోక్షమును గోరువారికి కర్మచేత గాని సంతానముచేత గాని మోక్షము లభింప దని, అఖిలమైన కర్మమును సాక్షాత్తుగా వేదమే చక్కఁగా నిషేధించుచున్నది.

"న కర్మ మోక్షంప్రతి కారణం త్వితి
స్వయం వినిశ్చిత్య విముక్తి మిచ్ఛతాం।
న కర్మణా న ప్రజయేతి సాక్షా
త్కర్మాఖిలం సాధు నిషేధతి శ్రుతిః॥" 224

"సన్న్యసించి శ్రవణమును చేయవలయు నని ఈవిధముగా స్మృతి కూడ మోక్షమును మాత్రమే కోరుచున్న యతికి శ్రవణమే చాలు నని విధించుచున్నది."

"సన్న్యస్య శ్రవణం కుర్యా దిత్యాది స్మృతి రప్యలం।
విధత్తే శ్రవణం భిక్షో ర్మోక్ష మాత్రైక కాంక్షిణః॥" 225

గీతాభాష్యము తృతీయాధ్యాయమున ప్రథమశ్లోకవివరణములో "కావున ఈతపస్సుల కన్నింటికి న్యాసమే అధికమైనది అని చెప్పుదురు. కావున న్యాసమే అన్నింటి కన్నను మించిన దయ్యెను."

"తస్మా న్న్యాస మేతేషాం తపసా మతిరిక్త మాహుః న్యాస ఏవాత్యరేచయ దితి॥"

గీతాభాష్యము, 13వ అధ్యాయం 21వ శ్లోకభాష్యములో, ఇట్లున్నది.

"దీనిసారాంశము నిట్లు చెప్పవచ్చును. ప్రకృతిస్థము అను పేరుగల అవిద్య, గుణసంగరూపమైన కామము కూడ, సంసారకారణ మని దానిని పూర్తిగా పరిత్యజించుటకు సన్న్యాసముతో కూడిన జ్ఞాన వైరాగ్యములే నివృత్తికారణముగా. గీతాశాస్త్రమునందు ప్రసిద్ధములై యున్నవి.

ఏత దుక్తం భవతి ప్రకృతిస్థత్వాఖ్యా అవిద్యా, గుణేషు చ సంగః కామః, సంసారస్యకారణ మితి, త చ్చ పరివర్జనాయ ఉచ్యతే। అస్య చ నివృత్తికారణం జ్ఞానవైరాగ్యే ససన్న్యాసే గీతాశాస్త్రే ప్రసిద్ధమ్॥

మఱియు సర్వకామపరిత్యాగమువలన సర్వకర్మసన్న్యాసము సిద్ధమగుచున్నది. "అతడు ఎట్టికోరికలు కలవా డగుచున్నాడో అట్టి సంకల్పము కలవా డగుచున్నాడు; తరువాత అట్టి కర్మ చేయు

చున్నాడు." అని మొదలుగా చెప్పుచున్న శ్రుతులవలనకూడ ఇది సిద్ధమగుచున్నది. ఎవ దెవడు ఏపని చేయుచున్నాడో అది యంతయు కామునియొక్క చేష్టయే.

సర్వకామపరిత్యాగే చ సర్వకర్మసన్న్యాసః సిద్ధో భవతీ. స యథాకామో భవతి తత్క్రతు ర్భవతి తత్కర్మ కురుతే ఇత్యాది శ్రుతిభ్యః। య ద్యద్ధి కురుతే **జంతు** స్త త్తత్ కామస్య చేష్టితమ్, ఇత్యాది స్మృతిభ్యశ్చ॥

గీత 5వ అధ్యాయము, 27వ శ్లోకప్రారంభమున అవతారికలో ఇట్లున్నది. సమ్యగ్దర్శనమునందు నిష్ఠ కలిగిన సన్న్యాసులకు సద్యోముక్తి చెప్పబడినది. సత్త్వశుద్ధి, జ్ఞానప్రాప్తి సర్వకర్మసన్న్యాసక్రమమున మోక్షము కలుగు నని భగవానుడు మాటిమాటికి చెప్పియున్నాడు, మఱియు చెప్పబోవుచున్నాడు.

సమ్యగ్దర్శననిష్ఠానాం సన్న్యాసినాం సద్యోముక్తి రుక్తా. కర్మయోగ శ్చ ఈశ్వరార్పిత సర్వభావేన ఈశ్వరే బ్రహ్మణ్యాధాయ క్రియమాణః సత్వశుద్ధి–జ్ఞానప్రాప్తి–సర్వకర్మసన్న్యాసక్రమేణ–మోక్షాయేతి, భగవాన్ పదే పదేఽబ్రవీత్, వక్ష్యతి చ॥

5వ అధ్యాయములోనే 12వ శ్లోకభాష్యమందు గూడ ఇట్లున్నది. "నిష్ఠయందు కలిగిన నైష్ఠికమైన శాంతిని మోక్ష మనుపేరు కలదానిని పొందుచున్నాడు. సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తి సర్వకర్మసన్న్యాసము జ్ఞాననిష్ఠ–అనుక్రమముచేత పొందుచున్నా డని యర్థము.

శాంతిం మోక్షాఖ్యాం ఆప్నోతి నైష్ఠికీం నిష్ఠాయాం భవాం–సత్త్వశుద్ధి–జ్ఞానప్రాప్తి–సర్వకర్మసన్న్యాస–జ్ఞాననిష్ఠాక్రమేణ ఇతివాక్యశేషః॥

ముండకోపనిషత్తు తృతీయముండకే, ద్వితీయఃఖండః 4వ మంత్రము

ఆపరమాత్మ ఆత్మనిష్ఠాజనితబలము లేనివానికి లభ్యము గాదు. మరియు లౌకికపుత్రకళత్రాది విషయసంగ నిమిత్తప్రమాదముచేతను లభ్యము గాదు. ఆలాగే సర్వకర్మసన్న్యాసము లేని జ్ఞానముచేతను లభ్యము గాదు. "తపసో వా ప్యలింగాత్" తపః అనగా ఇక్కడ ఆత్మ జ్ఞానము. లింగం = సన్న్యాసము. సన్న్యాసరహితమైన జ్ఞానముచేత లభ్యము కా దని అర్థము. ఆత్మనిష్ఠాబలము, అప్రమాదము సర్వకర్మ సన్న్యాసముతో కూడిన జ్ఞానము, ఈఉపాయములచేత తత్పరుడై ఏ విద్వాంసుడు ప్రయత్నించునో ఆత్మవిదుడైన అట్టి వివేకవంతుని యొక్క ఈఆత్మ బ్రహ్మపదమును ప్రవేశించుచున్నది.

ఆత్మనిష్ఠాబలాప్రమాదాదులు సన్న్యాససహితములైననే సఫల ములు; లేనియెడల నిష్ఫలములు అని అభిప్రాయము. కాని కొందరు తమ అతితెలివిని ఉపయోగించి ఇంద్రుడు, జనకుడు గార్గి మున్నగు వారు సన్న్యాసులు గారు, జ్ఞానసంపన్నులైన వారలకు బ్రహ్మము ప్రాప్తించె నని వినుచుంటిమి. కనుక బాహ్యసన్న్యాసము అక్కఅలే దని భావించవచ్చును. ఇక్కడ సన్న్యాసమనగా తమది అనెడి అభి మానము లేకపోవుట అని అర్థ మట. "న లింగం ధర్మకారణమ్" అను స్మృతినిగూడ ఉదాహరించి (ఆమాట ఆత్మజ్ఞానహీనమైన సన్న్యాస మని గ్రహించక) బాహ్యసన్న్యాసము ధర్మమునకు హేతువు కాదనియు నీ సందర్భములో ఆంతరసన్న్యాసము వివక్షితము కాని బాహ్యసన్న్యా సము వివక్షితము కాదనియు భాషించుచున్నారు వీరి చేత బృహదా రణ్యకము చూడబడ లేదు. మరియు, ఐతరీయోపనిషత్తుయొక్క శంక రులభాష్యమందలి ఉపోద్ఘాతమునందున్న విపులమైన దీనినిగురించిన మీమాంస గూడ తమస్మృతిలో లేనట్లున్నది.

ఛాందోగ్యోపనిషత్తులోని త్రయోవింశః ఖండమునందలిభాష్య మున ఇట్లు ఉన్నది. "పరివ్రాజకులకు భిక్షాచర్య ఎట్లు సంభవించు

చున్నదో, అట్లే, "సర్వము బ్రహ్మమే" అను ఏకత్వప్రత్యయము కలిగిన గృహస్థులు మొదలగువారికి అగ్నిహోత్రాధికర్మలనుండి నివృత్తిలేదు, అని నీవు అందువేని ఆమాట చెల్లదు. ప్రమాణమును గూర్చి విచారించునప్పుడు ఒకానొకపురుషునియొక్క వర్తనము దృష్టాంతము కాజాలదు."

"పరివ్రాజకానాం భిక్షాచరణాదివత్ ఉత్పన్నఏకత్వప్రత్యయానామపి గృహస్థాదీనాం అగ్నిహోత్రాదికర్మ అనివృత్తి రితి చేత్.

న "ప్రామాణ్యచింతాయాం పురుషప్రవృత్తే రదృష్టాన్తత్వాత్"

మరియు వీరలు గీతాభాష్యములోని శంకరులవాక్యములు గూడ చక్కగా జ్ఞాపకము చేసికొనవలసియున్నది.

"యాజ్ఞవల్క్యుడు లోకములో సాధారణవ్యక్తి అయినప్పటికి ఆత్మజ్ఞానముయొక్క బలమువలన భార్యలు శిష్యులు ధనము మొదలుగా గొప్ప యైశ్వర్యమును సంసారమునందలి కోరికను పరిత్యజించి ప్రజ్ఞానముచేత తృప్తుడై ఆత్మయందు రతి కలవా డయ్యెను. సర్వపురుషార్థములకు కర్మయే సాధన మని లోకమున ప్రసిద్ధమై యున్నది. ఆకర్మ ధనసాధ్యము, అవిత్తముచేత అమృతత్వము కలుగు నను ఆశ కూడ లేదు. ఈఅమృతత్వము కర్మతో సంబంధము లేని కేవలమైన ఆత్మ విద్యచేతనే లభించుచున్నది."

యాజ్ఞవల్క్య లోకసాధారణోఽపి సన్ ఆత్మజ్ఞానబలాత్ భార్యాశిష్యవిత్తాదిమహైశ్వర్యసంసారరతిం పరిత్యజ్య ప్రజ్ఞానతృప్త ఆత్మరతి ర్బభూవ. సర్వపురుషార్థానాం కర్మ హి సాధన మితి లోకే ప్రసిద్ధమ్। త చ్చ కర్మవిత్తసాధ్యమ్. తేన ఆశాఽపి నాస్త్యమృతత్వస్య త దిదం అమృతత్వం కేవలయా ఆత్మవిద్యయా కర్మనిరపేక్షయా ప్రాప్యతే॥

"వాణీవిలాస్, శ్రీరంగం ఎడిషన్; బృహదారణ్యకోపనిషద్భాష్యే" 338 పేజీ బ్రా 5 క 16.

ప్రమాణముద్వారా నిర్ధారణ అయిన విషయము కధానికలలో అందుకు విరుద్ధముగా కనబడినను ధానిని ప్రమాణముగా తీసికొనగూడదు.

"సన్న్యాసం జ్ఞానలక్షణం"
"సన్న్యాసేన తనుంత్యజేత్" ఇతిస్మృతేః.

క॥ గిరులంబోలెడి కరులను
హరులం దనప్రాణదయితలై మనియెడి సుం
దరులను హితవరులను బుధ
వరులను వర్జించి గాఢవైరాగ్యమునన్॥

క॥ గోవిందనామకీర్తన
గావించి భయంబు దక్కి ఖట్వాంగ ధరి
త్రీవిభుడు సూరగొనియెను
గైవల్యము దొల్లి రెండుగడియలలోనన్॥
మరియు పరీక్షిన్మహారాజు నిర్మలమతివిశేషంబున

ఆ॥ సుతుల హితుల విడిచి చుట్టాల విడిచి యి
ల్లాలి విడిచి బహుబలాళి విడిచి
రాజు హృదయ మిడియె రాజీవనయనుపై
ధనము విడిచి జడ్డుదనము విడిచి॥

వ॥ ఇట్లు మృత్యుభయంబు నిరసించి, ధర్మార్థకామంబులు సన్న్యసించి పురుషోత్తమునందు చిత్తంబు విన్యసించి, మోక్షమును పొందినాడు.

తత్త్వవేత్తయగు విమలానందభారతీస్వాములవారు అన్నారు. "జడభరతుడు సర్వత్యాగము చేసియు ఒకజింకమీది ప్రీతిచేత జింకజన్మ ఎత్తవలసివచ్చినది. మనకు చాలా జింకలు ఉన్నాయి.

"ఆత్మానం చే ద్విజానీయా
దయ మస్మీతి పురుషః।
కి మిచ్ఛన్ కస్య కామాయ
శరీర మనుసంజ్వరేత్॥

దీని వివరము శంకరభాష్యమునం దున్నది.

## వేదప్రామాణ్యము

వేదప్రమాణముయొక్క ఉపయోగము అజ్ఞాతార్థవిషయమును తెలియజేయుటయే గాక అది పరమప్రయోజనముగాను ఉండవలెను. నన్ను సచ్చిదానందపరబ్రహ్మమునుగా తెలియజేయుట పరమప్రయోజనము. తన్ను నిర్విశేషప్రత్యగాత్మనుగా బ్రహ్మమునుగా తెలిసికొనుటయే కృతార్థత. మాయావశాత్తు ఆ బ్రహ్మమే ఈసృష్టిగా కనబడుచున్నది. అందువలననే ఏకవిజ్ఞానముచేత సర్వవిజ్ఞానము కలుగుచున్నదను ప్రతిజ్ఞ నెరవేరుచున్నది.

ప్రత్యక్ష-అనుమానములవల్ల నీకు తెలియనిదియు, నీకు గొప్ప ప్రయోజనమును కలిగించునట్టిదియు అగు విషయమునే, నేను చెప్పునది యని శ్రుతి నుడువుచున్నది; అందువలననే నన్ను వేదము అని తెలియుచున్నా రని శ్రుతి వాక్రుచ్చుచున్నది. మనకు తెలియునట్టివిషయమును వేదము చెప్పవలసిన పనిలేదు.

వేదాంతము నన్నుగురించిన ముచ్చటయే చెప్పుచున్నది. అట్టి నాముచ్చటే నా కర్థముగా నప్పుడు ఇక ప్రపంచముయొక్క ముచ్చట నా కేమి ప్రయోజనము!

ఆత్మ సరిగా అర్థ మైనచో వీనికి ఏలోకములో నైనను అనర్థమే లేదు.

ప్రమాణ మనగా ఎయ్యది మరి దేనిచేతను తెలియబడక దేని చేత మాత్రమే తెలియబడునో అది దానికి ప్రమాణము. కన్ను రూపము నకు వలె.

"ధర్మమోక్షా వలౌకిక వేదైకగమ్యౌ" "అలౌకికపురుషార్థోపాయం వేత్త్యనే నేతి వేదశబ్దవ్యుత్పత్తేః"

అవ్యక్త మవ్యాకృతాఖ్యం అవిద్యావస్థ మాత్మత్వేన ప్రతిపన్నాః కేచిత్. సర్వత్ర బుద్ధ్యాదిదేహాంతే ఆత్మచైతన్యాభాసతా ఆత్మభ్రాంతి కారణ మిత్యత శ్చ ఆత్మవిషయం జ్ఞానం న విధాతవ్యమ్ కిం తర్హి? నామరూపాద్యనాత్మాధ్యారోపణనివృత్తి రేవ కార్యా, నాత్మ చైతన్య విజ్ఞానం కార్యం అవిద్యాధ్యారోపితసర్వపదార్థాకారైః అవిశిష్టతయా దృశ్యమానత్వాత్ తస్మా దవిద్యాధ్యారోపిత నిరాకరణమాత్రం బ్రహ్మణి కర్తవ్యం న తు బ్రహ్మవిజ్ఞానే యత్నః అత్యంతప్రసిద్ధత్వాత్. తథాచోక్తం–"ప్రత్యక్షావగమం ధర్మ్య" మిత్యాది

లౌకికగ్రాహ్యగ్రాహకద్వైత వస్తుని సద్బుద్ధిః నితరాం దుస్సంపాదా, ఆత్మచైతన్యవ్యతిరేకేణ వస్త్వంతరస్యానుపలబ్ధేః, యథాచ "ఏత దేవ మేవ, నాన్యథా" ఇతి అవోచామ, ఉక్తం చ భగవతా యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ఇతి. తస్మాత్ బాహ్యాకారభేదబుద్ధినివృత్తి రేవ ఆత్మస్వరూపావలంబనకారణం, న హి ఆత్మా నామ కస్యచిత్ కదాచి దప్రసిద్ధః ప్రాప్యః హేయః ఉపాదేయో వా.

తస్మా దాత్మజ్ఞానే యత్నో న కర్తవ్యః కింతు అనాత్మని ఆత్మ బుద్ధినివృత్తావేవ; తస్మాత్ జ్ఞాననిష్ఠా సుసంపాద్యా.

అతః జ్ఞాననిష్ఠా లక్షణయా భక్త్యా మా మభిజానా తీతి వచనం న విరుధ్యతే తత్ర చ సర్వం నివృత్తివిధాయి శాస్త్రం వేదాంతేతిహాస పురాణస్మృతిలక్షణ న్యాయప్రసిద్ధం అర్థవత్ భవతి.

ప్రత్యగాత్మావిక్రియస్వరూపనిష్ఠత్వా చ్చ మోక్షస్య. న హి పూర్వసముద్రం జిగమిషోః ప్రాతిలోమ్యేన ప్రత్యక్సముద్రజిగమి షుణా సమానమార్గత్వం సంభవతి. ప్రత్యగాత్మవిషయజ్ఞానసంతాన కరణాభినివే శ్చ జ్ఞాననిష్ఠా.

సా చ ప్రత్యక్సముద్రగమనవత్ కర్మణా సహభావిత్వేన విరు ధ్యతే పర్వతసర్షపయో రివ అంతరవాన్ విరోధః ప్రమాణవిదాం నిశ్చితః. తస్మాత్ సర్వకర్మసన్న్యాసే నైవ జ్ఞాననిష్ఠా కార్యా ఇతి సిద్ధమ్.

సకలజీవులు స్వభావసిద్ధముగానే జరామరణనిర్ముక్తులు. "జరా మరణనిర్ముక్తాః సర్వే ధర్మా స్వభావతః."

వేదాంతప్రమాణ జ్ఞానమువలన తెలిసినది యేమనగా తనకు మాత్రమే జననమరణములు లే వని గాదు మరెవ్వరికి గూడ లేవనే తెలిసినది.

న చ స్వరూపవిషయాకాంక్షా స్వస్యైవ; తస్మాత్ అజ్ఞానఅధ్యా రోపణనివృత్తి రేవ ఆత్మాన మే వావే దిత్యుక్తమ్, నాత్మనో విషయీ కరణమ్॥ ఆత్మను విషయమునువలె తెలియడం కాదు.

"ఇది గా దిది గా దనియెడి
పదసందోహంబులోని పరమార్థంబే
విదితంబుగ నాతత్వము
పదపడి మటి యొక్క లాగు పలుకగవశమే॥
దేవీభాగవతము.

"నేతి నే త్యాత్మాహ మ్మనియెడిమతియే సమాధి"

యః కశ్చిత్ వ్యావృత్తబాహ్యాత్మస్సేక్య ఆత్మాన మేవ ఏవం వేద అహం బ్రహ్మాస్మీతి—అపోహ్య ఉపాధిజనితభ్రాంతివిజ్ఞాన—అధ్యారోపితా

న్విశేషాన్ సంసారధర్మానాగంధిత మనంతర మబాహ్యం బ్రహ్మైవా హమస్మి కేవల మితి–సః అవిద్యాకృతాసర్వత్వనివృత్తే ర్బ్రహ్మ విజ్ఞానా దిదం సర్వం భవతి వామదేవవత్॥

"నమో నమ స్తే గురవే మహాత్మనే
విముక్తసఙ్గాయ సదుత్తమాయ।
నిత్యాద్వయానంద రసస్వరూపిణే
భూమ్నే సదాపారదయంబుధామ్నే॥"

"యత్కటాక్షశశిసాన్ద్రచన్ద్రికా
పాతధూతభవతాపజశ్రమః।
ప్రాప్తవా నహ మఖండవైభవా
నంద మాత్మపద మక్షయం క్షణాత్॥"

"స్వారాజ్యసామ్రాజ్యవిభూతి రేషా
భవత్కృపాశ్రీమహితప్రసాదాత్।
ప్రాప్తా మయా, శ్రీగురవే మహాత్మనే
నమో నమ స్తేఽస్తు పున ర్నమోఽస్తు॥
"మహాస్వప్నే మాయాకృతజనిజరామృత్యుగహనే
భ్రమంతం క్లిశ్యంతం బహుళతరతాపై రనుకలమ్।
అహంకారవ్యాఘ్రవ్యథిత మిమ మత్యంతకృపయా
ప్రబోధ్య ప్రస్వాపా త్పర మవితవా న్మా మసి గురో॥"
"హిత మిద ముపదేశ మాద్రియంతాం
విహితనిర స్తసమ స్తచి త్తదోషాః।
భవసుఖవిరతాః ప్రశాంతచిత్తా
శ్రుతిరసికా యతయో ముముక్షవో యే॥"
"సంసారాధ్వని తాపభానుకిరణప్రోద్భూతదాహవ్యథా
ఖిన్నానాం జలకాంక్షయా మరుభువి భ్రాంత్యా పరిభ్రామ్యతాం।
అత్యాసన్న సుధాంబుధిం సుఖకరం బ్రహ్మాద్వయం దర్శయ
న్త్యేషా శంకరభారతీ విజయతే నిర్వాణసంధాయినీ॥"

ఓం తత్సత్.